# జ్ఞాన దీపిక

అయమాత్మా బ్రహ్మ

అహం బ్రహ్మాస్మి

ఏకమేవాద్వితీయం బ్రహ్మ

ప్రజ్ఞానం బ్రహ్మ



తత్త్వమసి

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ

సర్వంఖల్విదం బ్రహ్మ

సత్యంజ్ఞానం అనంతం బ్రహ్మ


వడ్డి వరలక్ష్మి

12-10-322/2, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061

ఫోన్ నెంబరు : 27076687


ముముక్షువులకు
అమూల్యం


# జ్ఞాన దీపిక

అయమాత్మా బ్రహ్మ

అహం బ్రహ్మాస్మి

ఏకమేవాద్వితీయం బ్రహ్మ

ప్రజ్ఞానం బ్రహ్మ





తత్త్వమసి

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ

సర్వంఖల్విదం బ్రహ్మ

సత్యంజ్ఞానం అనంతం బ్రహ్మ

వడ్డి వరలక్ష్మి



సద్గురు స్వామి శ్రీరామనాథ్ గారు

అంకితము

నేనేమియు ఉన్నత విద్య నభ్యసించనటువంటి దానినైనప్పటికిన్నీ, నగుణారాధన పూర్తి చేనుకొని, జ్ఞాన పిపాసినై నద్గురువుకై తిరుగాడుచుండ నా అదృష్టవశమున పూర్వపుణ్య పరిపాక ఫలితమున, ఈశ్వరానుగ్రహము వలన శ్రీ మహాయోగి శ్రీ రామనాథ్ గారు పుత్రికావాత్సల్యముతో తత్త్వమార్గదర్శి అయి, నాకు జ్ఞాన భిక్ష పెట్టి తరింపచేసిన శ్రీ నద్గురు దేవునకు వినయ పూర్వ ప్రణామములతో అంకిత మొనరుచుచున్నాను.

ఇట్లు
వడ్డి వరలక్ష్మి
శిష్యరేణువు.

## బ్రహ్మజ్ఞానావలీమాలా

(బ్రహ్మనామావలీమాలా)

1. సకృత్శ్రవణమాత్రేణ బ్రహ్మజ్ఞానం యతో భవేత్,।
బ్రహ్మజ్ఞానా వలీమాలా సర్వేషాం ముక్తిసిద్ధయే.॥

2. అనజ్ఞోఽహ మనజ్ఞోఽహ మసజ్ఞోఽహం పునఃపునః।
సచ్చిదానన్దరూపోఽహ మహమేవాహవ్యయః॥

3. నిత్యశుద్ధ విముక్తోఽహం నిరాకారోఽహమక్షరః।
భూమానన్దస్వరూపోఽహ మహ మేహ మేహమవ్యయః॥

4. నిత్యోఽహం నిరవద్యోఽహం నిరాకరోఽహమక్షరః।
పరమానన్దరూపోఽహమహ మేవాహ మవ్యయః॥

5. శుద్ధచైతన్య రూపోఽహమాత్మరామోఽహమేవ చ,।
అఖణ్డా నన్దరూపోఽహ మహమేవాహ మవ్యయః॥

6. స్వయం ప్రకాశరూపోఽహం చిన్మయోఽహం పరోఽస్మ్యహం,।
అద్వైతానన్దరూపోఽహ మహమేవాహమవ్యహః॥

7. ప్రత్యక్ చైతన్యరూపోఽహం శాన్తోఽహం ప్రకృతేః పరః।
శాశ్వతానన్ద రూపోఽహ మహమేవాహ మవ్యయః॥

8. తత్త్వాతీతః పరాత్మాహం మధ్యాతీతః పరఃశివః।
మాయాతీతః పరంజ్యోతి రహమేవాహ మవ్యయః॥

9. నామరూపవ్యతీతోఽహం చిదాకారోఽహ మచ్యుతః।
సుఖ ప్రకాశరూపోఽహ మహమేవాహ మవ్యయః॥

శ్రీ సద్గురోభ్యనమః

## నివేదన

చాలామంది వేదాంతమంటె భయపడుతారు. అది తెలుసుకోవటం వలన సన్యాసులవుతారని ఒక మూఢనమ్మకము. ఉపనిషత్తులు, వేదాంత పంచదశి, యోగివాశిష్ఠము, వివేకచూడామణి, అష్టావక్ర గీత మొదలయిన గ్రంధములు సంస్కృతములో వాటి తర్జుమా తెలుగు భాషలో ఉన్నప్పటికి చాలామందికి అందుబాటులో లేవు. అవి చదివినా అర్థం చేసుకోవటం భాషా పరిజ్ఞానం లేని వారికి చాలా కష్టము, సంస్కృతంలోనూ, గ్రాంధిక భాషలో ఉండటం వలన పైగా వేదాంతంలో వచ్చు పద జాలము కొంచెం జటిలంగా ఉండుటవలన. అద్వైత జ్ఞానము కొంగున మూట కట్టుకొని నీ ఇష్టము వచ్చినటుల మెలుగుమని చెప్పారు శ్రీ రామకృష్ణ పరమహంసులవారు. **"బ్రహ్మ సత్యం, జగత్ మిధ్యా"** "అనిన్ని, **జీవో బ్రహ్మైవ నా పరఃనేహ నానాస్తి కించన"** అని బోధించారు శ్రీ శ్రీ జగద్గురువు శంకరాచార్యులవారు.

వేదాంత బోధంత నేను సద్గురువు వద్ద నేర్చుకున్న దానినిబట్టి, నా అనుభవాలు బట్టి ఏ అరణ్యాలకు పోనక్కర లేకుండా సంసారంలోనే ఉంటూ, సంసారంలో చిక్కుకోకుండా దానికి అంటుకోకుండా మనో నిగ్రహంతో, ఇంద్రియాలు అంతర్ముఖం చేసుకుంటూ, వాసనాక్షయం చేసుకొని, అహంకార మమకారములు విడనాడి, చిత్తశుద్ధి చేసుకొని, సకల సంకల్ప రాహిత్యం చేసుకుంటూ, ద్వైత భావన విడనాడి, శుద్ధతత్త్వమునాశ్రయించి, నిర్వికల్ప సమాధి పొందవచ్చును. దీనికి సంసారము ఏమీ అడ్డురాదు. అరణ్యాలకు వెళ్ళినప్పటికి అక్కడ కూడా మనలో ఉన్నబుద్ధి, మనస్సు, అహంకారము, చిత్తము, ఇంద్రియాలు కూడానే ఉంటాయి. అవి సాధనకు అడ్డుతగులుతూనే ఉంటాయి. మనలో ఉన్న శతృవులను జయించి, ద్వైతభావన నశింపు చేసుకొని, నేను పరమాత్మ కంటె భిన్నుడను కాను అని బోధించునదే వేదాంతము. ఇది కేవలము



అనుభవనీయమే, తీవ్ర సాధనతో నేనంటే ఎవరు? నాస్వరూపమేది? పరమాత్మ స్వరూపమేది? అనేది స్వానుభవము ద్వారా తీవ్ర సాధన వలన రెండింటికి అభేదమును తెలుసుకొనటయే జ్ఞానము. ఇది ముఖ్యంగా భావశుద్ధి వలన, చిత్తైకాగ్రత వలన గురుబోధ వలన, తీవ్ర సాధనవలననే సాధ్యమవుతుంది.

ఈ పుస్తకము భాషా పరిజ్ఞానము  గల వేదాంతులకు, నిర్వికల్ప సమాధి ద్వారా స్వస్వరూపానందము అనుభవించిన వారికి ఉద్దేశింపడినది కాదు. ఉన్నత విద్యాభ్యాసము, కుటుంబ పరిస్థితుల వలన చేయలేదు. నాకు సంస్కృతమునగాని, తెలుగులో వ్యాకరణమందు గాని ప్రవేశము లేదు. కాబట్టి, వాడుక భాషలో వేదాంత మంటే ఏమిటో తెలియని వారికి కూ డా తేట తెల్లమగునట్లుగా శ్రీ గురువుగారి ఆదేశానుసారముగా వ్రాయబడింది. వారు అనేక గ్రంధములు వ్రాసి ఉన్నారు. గురువుగారి ముఖతఃవిన్న ప్రవచనాల ఆధారంగా, నా స్వానుభవం వలన కలిగిన జ్ఞానం వలన, గురుగీత, కొన్ని ఉపనిషత్తులు, పెద్దలు వ్రాసిన వేదాంత గ్రంధములు, భగవద్గీత ఆధారంగా ఈ పుస్తకము వ్రాయబడినది. ఆగురు శక్తే ఈ విధంగా వ్రాయించింది. ఇందులో ఏమయినా తప్పులున్నచో పాఠకులు నన్ను మన్నించగలరు. ఈ పుస్తకము పాఠకుల సాధనకు, బ్రహ్మవిద్య అంటే ఏమిటో తెలుసుకొనుటలో ఏ కొద్ది మందికైనా ఉపయోగబడినట్లయితే నా శ్రమ ఫలించినట్లే.

ఈ పుస్తకము చివర గురుపూజ (నామావళీ మంత్ర పుష్ప సహితముగా) శ్రీ సద్గురు స్వామి రామనాధ్ వేదాంత ప్రచారమండలి, కర్నూలు వారి సౌజన్యంతో ఒకటవ అనుబంధముగా చేర్చడమయినది. వారందరకూ  నా ధన్యవాదములు.

తత్త్వబోధ చేసి స్వరూప జ్ఞానము కలుగచేసిన శ్రీ గురువుదేవుడు భగవత్స్వరూపుడు. సంసారబంధ మోహము నుండి రక్షించువాడు. ఆ గురువే తండ్రి, తల్లి, బంధువు, ఇష్టదైవము. గురుకృప లేనిదే స్వస్వరూప జ్ఞానము కలుగదు. ఆయన పరమశాంతుడు. ఆ గురువే బ్రహ్మ, విష్ణువు,

ధ్యాన శ్లోకములు

1 ఓమ్ ఓమ్ ఓంకార రూపం త్ర్యహమితిచపరంయత్స్వరూపం తురీయం
త్రైగుణ్యా తీతనీలం కలయతి మననస్తేజ సిందూరమూర్తిం
యోగీంద్రా బ్రహ్మరంధ్రే సకల గుణమయం శ్రీహరేన్ద్ర ఙసంగం
గంగంగంగం గణేశం గజముఖ ఘభితో వ్యాపకం చిన్తయన్తి॥

**తాత్పర్యము** : ప్రణవ స్వరూపుడును, తురీయ రూపుడును, త్రిగుణాత్మకమగు ప్రకృతికి పరమైనవాడును, మనస్సును ప్రకాశింప చేయువాడును, తేజో రూపుడును, సిందూర కాంతి గలవాడును, సకల కళ్యాణ గుణమయుడును, సర్వవ్యాపియునగు విఘ్నేశ్వరుని యోగులు బ్రహ్మ రంధ్రమున పరబ్రహ్మైక్యము కొరకై ధ్యానించుచున్నారు.

2 ఓం వ్యాసాయ యతివర్యాయ విద్యావిగ్రహ ధారిణే
నమస్తే పరమానన్దదాయినే పరమాత్మనే॥

**తాత్పర్యము** : యతులలో కెల్ల శ్రేష్టుడు, విద్యనే రూపముగల వాడు, పరమానంద పరమాత్మ స్వరూపుడగు శ్రీవ్యాస మహర్షికి వందనములు.

3 ఓం వ్యాసం వసిష్టనప్తారం శక్తేఃపౌత్రమ కల్మషం
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్॥

**తాత్పర్యము** : వసిష్టుని మునిమనునడును, శక్తి యొక్క మనుమడును, పరాశరుని పుత్రుడును, శుని తండ్రియు, తపోనిధియు, కలుష రహితుడునగు శ్రీ వేదవ్యాస మునీంద్రునకు నమస్కారములు.

4 ఓం వ్యాసాయవిష్ణు రూపాయ వ్యాసరాపాయ విష్ణవే
నమోవై బ్రహ్మ నిధయే వాసిష్ఠాయ నమోనమః॥

**తాత్పర్యము** : విష్ణు రూపుడగు వ్యాసునకు, వ్యాసరూపుడగు

విష్ణువునకు బ్రహ్మవిద్యానిలయుడగు శ్రీ వాసిష్టుడగు వ్యాసునకు నమస్కారములు.

శ్రీ దక్షిణామూర్తి వారి స్తోత్రములు

5 ఓం స్ఫటికరజిత వర్ణం మౌక్తికీ యక్ష మాలాం
అమృత కలశ విద్యాంజ్ఞాన ముద్రాం కరాగ్రే
దధతమురగ కక్ష్యం చంద్ర చూడం త్రినేత్రం
విధృత వివిధ భూషం దక్షిణా మూర్తి మీడే॥

**తాత్పర్యము** : స్ఫటిక రజితములవంటి స్వచ్ఛమైన వర్ణము గలవాడును, ముత్యములతో చేయబడిన జపమాల కలవాడును, అమృత కలశము గైకొనిన వాడును, విద్యానిధియు, హస్తముల చివర చిన్ముద్ర ధరించిన వాడును, కక్ష్య భాగమున సర్పములు గలవాడును, శిరస్సు పై చంద్రుడు ఒప్పుచున్న వాడును, త్రినేత్రుడును, పెక్కు భూషణములు ధరించిన వాడును శ్రీ దక్షణామూర్తిని స్తుతించెదను.

6 మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వమ్
వర్షిష్ఠాంతే వసదృష్టి గణైరావృతం బ్రహ్మనిష్ఠైః
ఆచార్యేంద్రమ్ కరకలిత చిన్ముద్రమ్ ఆనందమూర్తిమ్
స్వాత్మారామమ్, ముదితవదనమ్, దక్షిణామూర్తి మీడే॥

**తాత్పర్యము** : మిక్కిలి వృద్ధులును, శిష్యులునూ అయిన ఋషుల సమూహము చేత పరివేష్ఠింప బడినటువంటిన్నీ మౌనము చేతనే తత్త్వబోధ చేయుచున్నటువంటిన్నీ, యువకుడునూ, కుడి చేతిలో చిన్ముద్ర ధరించిన వాడునూ, మూర్తీభవించిన ఆనంద స్వరూపుడునూ, తన స్వరూపమున రతిగొంటూ చిరునవ్వుతో ఉన్నటువంటి దక్షిణామూర్తిని స్తోత్రం చేయుచున్నాను.

7 విశ్వం, దర్పణ దృశ్యమాన నగరీతుల్యం, నిజాంతర్గతం
పశ్యన్, ఆత్మని మాయయా, బహిరివోద్భూతం యథానిద్రయా,



యఃసాక్షాత్కురుతే, ప్రబోధసమయే, స్వాత్మానమే వాద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే॥

**తాత్పర్యము** :ఆత్మయందు కల్పింపబడిన, అజ్ఞానం చేత (మాయచేత) బయట కనిపించుచున్న దృశ్యజగత్తంతా అద్దంలో కనిపించు నగరం వంటింది అని, అది అజ్ఞాన కలుషితమయిన మనో కార్యమని, కాని తన నిజతత్త్వంలోనే ఉండి సర్వజగత్తు వాస్తవంలో కల్పింపబడినదిగా చూస్తూ తన స్వస్వరూపము కంటె రెండవ పదార్థం లేనిదిగా తన ఉనికిని గోచరింప చేయుచున్నాడో అటువంటి జగద్గురువు శ్రీ దక్షిణామూర్తి వారికి నమస్కారములు.

8.బీజ స్యాంతరి వాంకురః, జగదిదం ప్రాఙ్నిర్వికల్పం, పున
ర్మాయాకల్పిత దేశకాల కలనా వైచిత్ర్య చిత్రీకృతం
మాయా వీవ విజృంభయత్యపి, మహాయోగీ వయస్స్వేచ్ఛయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే॥

**తాత్పర్యము** : విత్తనములో ఉన్న మొక్క, చెట్టు పూర్వము కనిపించక పోయినట్లు, ఈ జగత్తు నమిష్ఠి పూర్వము లేక ఇపుడు మాయచేత దేశకాలములు, చిత్ర విచిత్రముగా కనిపించబడినది. ఇది అంతా అజ్ఞానం చేత పరమాత్మ గారడి వానివలె అంతులేకుండా సృష్టి చేస్తున్నాడు అని అజ్ఞానంతో అందరు అనుకున్నప్పటికీ, వాస్తవంలో మహాయోగి వలె, గురుమూర్తి శ్రీ దక్షిణామూర్తి తన నిరంజన తత్త్వము ఆరోపించబడి ఉన్నవని అట్టి జగత్తుతో సంబంధము లేక తన స్వరూపములో ఉన్న వారికి నమస్కారములు.

9. య స్యైవస్ఫురణం, సదాత్మకం, అసత్కల్పార్థగంభాసతే
సాక్షాత్తత్త్వమ సీతి, వేద వచసా, యోబోధ యత్యాశ్రితాన్
యత్సాక్షాత్కరణార్భవేత్సపునారావృత్తిఃభవాంభోనిధౌ
తస్మై శ్రీ గురుమూర్తయో నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే॥

**తాత్పర్యము** : ఏ జగద్గురువు తనను ఆశ్రయించిన వారికి వేదాంత మహా వాక్యములచే వాస్తవంలో ఆ పరబ్రహ్మవే నీవు అని బోధిస్తున్నారో ఆ బోధను విన్న శిష్యులు ప్రత్యక్షఅనుభవం ద్వారా జనన మరణ రూప సంసారమనే సముద్రంలో మళ్లీ తిరుగాడటం అనేది సంభవించదో అటువంటి గురుమూర్తులయిన శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

10. నానాచ్ఛిద్రఘటో దరస్థిత మహాదీప ప్రభా భాస్వరం,
జ్ఞానం యస్యతు, చక్షురాది కరణద్వారా బహిస్స్పందతే,
జానామీతి, తమేవ భాంతం, అనుభాత్యేతత్సమస్తంజగత్,
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణా మూర్తయే॥

**తాత్పర్యము** కుండలో ఉన్న జ్యోతి యొక్క కాంతి దానికున్న చిల్లుల ద్వారా ఏవిధంగా బైటికి ప్రకాశించుచున్నదో ఆ విధంగా తనలో నున్న ఆత్మ ప్రకాశమే కన్ను మొదలైన ఇంద్రియముల ద్వారా బయటకు గోచరించుట నేను తెలుసుకుంటున్నాను, చేస్తున్నాను అనే అనుభవం ద్వారా (జ్ఞానం ద్వారా)ఆ ఆత్మ తత్త్వ జ్ఞానమే అనుభవింపబడుచున్నదై ఈ జగత్తు సర్వమూ ఆత్మతత్త్వ జ్ఞానమునే అనుసరించి ప్రకాశించుచున్నది. అటువంటి జ్ఞానస్వరూపుడైన శ్రీ జగద్గురు మూర్తి శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

11. దేహం ప్రాణమపీంద్రి యాణ్యపి చలాం బుద్ధించశూన్యం విదుః
స్త్రీ బాలంధజడోపమాస్త్వ, అహమితి భ్రాంతాభృశం వాదినః
మాయాశక్తి విలాస కల్పిత, మహావ్యామోహ సంహారిణే,
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే॥

**తాత్పర్యము**: ఆత్మ అంటే దేహమేననీ, ప్రాణమేననీ, ఇంద్రియాలని, మనస్సేననీ, శూన్యమేననీ భ్రాంతిలో పడి అజ్ఞానంచే వాదించేవారు అయిన స్త్రీలు, బాలురూ, అంధులూ, జడులూ వారియొక్క మాయచేత కల్పింపబడిన అంతులేని మోహమును సంహరించునటువంటి జగద్గురువు



శ్రీ దక్షిణామూర్తి వారికి నమస్కారములు.

12. రాహుగ్రస్త దివాకరేందు సదృశఃమాయా సమాచ్ఛాదనాత్,
సన్మాత్రఃకరణోప సంహరణతః యోఽభూత్సుషుప్తఃపుమాన్,
ప్రాగస్వాప్సమితి, ప్రబోధసమ యే, యఃప్రత్యభిజ్ఞాయతే,
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణా మూర్తయే॥

**తాత్పర్యము** : ఏ జీవుడు వాస్తవంలో సత్తా మాత్రుడయినప్పటికి రాహుగ్రహం చేత మ్రింగబడిన సూర్యచంద్రుల వలె అజ్ఞానం చేత బాగా కప్పబడినందువలన ఇంద్రియములు వాటి ప్రవృత్తి నుండి తాత్కాలికంగా విరమించుకొని విశ్రాంతి తీసుకొంటున్నందువల్ల నిద్రపోయి, (సుషుప్తి) తిరిగి నిద్రలేచినపుడు తన వెనుకటి స్థితిని జ్ఞాపకం చేసుకుంటున్నాడో అటువంటి జీవుడు నిజానికి సత్తా మాత్రుడే అని భోదించే జగద్గురువు శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

13. బాల్యాదిష్వపి, జాగ్రదాదిషు, తథా సర్వాస్వ వస్థాస్వపి,
వ్యావృత్తాసుఅనువర్తమానం, అహమితి అంతస్స్ఫురంతం సదా
స్వాత్మానం, ప్రకటీ కరోతి భజతాం, యోభద్ర యాముద్రయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే॥

**తాత్పర్యము** : బాల్యమూ, కౌమారము యౌవనము, వార్ధక్యము మొదలైన అవస్థలలోనూ, స్వప్న, సుషుప్తి అవస్థలలోనూ అదేవిధంగా ఎప్పుడు మారుతూఉండే సర్వ అవస్థలలోనూ మారకుండా ఉండే **"నేను"** అని అన్ని అవస్థలలోనూ స్ఫురిస్తున్నదియే నీ నిజ స్వరూపము (పరమాత్మ) అని ఏ జగద్గురువు భోధచేయుచుండెనో అట్టి శ్రీ దక్షిణామూర్తి వారికి నమస్కారములు.

14. విశ్వం పశ్యతి, కార్యకారణతయా, స్వస్వామి సంబంధతః
శిష్యాచార్య తయా, తథైవ పితృ పుత్రాది, ఆత్మనా భేదతః
స్వప్నే జాగ్రతివా, ఎ ఏష పురుషః, మాయా పరిభ్రామితః
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణా మూర్తయే

**తాత్పర్యము** : ఏ జీవుడు తాను సత్తామాత్రుడైనప్పటికీ, మాయలో పరిభ్రమిస్తున్న వాడై విశ్వమును కూడా కారణములు కలదానినిగాను అదే విధంగా స్వామి భృత్యుల సంబంధములు గలదిగానూ, ఆచార్య సంబంధములతోనూ, తండ్రి కొడుకు మొదలయిన బంధుత్వాలుగానూ ఆత్మచేతనే బేధం కలదానినిగా అజ్ఞానంతో సత్యమైన వానివలె చూస్తున్నాడు. అటువంటి వారిని తరింప చేయుటకై వారికి స్వస్వరూపము (ఆత్మ స్వరూపము) బోధ చేయుచున్న జగద్గురువు శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

15. భూరం భాంస్యనలోऽని లోంబర మహర్నాధోహిమాంశుః పుమాన్,
ఇత్యాభాతి చరాచరాత్మకమిదం, యస్యైవ మూర్త్యష్టకం,
నాన్యత్కించన విద్యతే, విమృశతాం, యస్మాత్పరస్మాద్విభోః,
తస్మైశ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే॥

**తాత్పర్యర్యము**: కదిలేది కదలనిదిగా కనిపిస్తున్న ఈ భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడూ, చంద్రుడు, జీవుడూ, ఏ పరమాత్మ యొక్క ఎనిమిది రూపములు అని అజ్ఞానంలో అభాన కలుగుచున్నదో, వివేకం చేత ఆత్మ మయమే అన్న వాస్తవం కంటె వేరుకాదు. నామరూపాలు ఆత్మ కాదు అని బోధచేయుచున్న అద్వితీయ ఆత్మ స్వరూపులయిన జగద్గురువు శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

16. సర్వాత్మత్వమితి స్ఫుటీకృతమిదం, యస్మాదముష్మిన్‌స్తవే,
తేనాన్యశ్రవణాత్, తథర్థమననాత్, ధ్యానాచ్చ, సంకీర్తనాత్,



స్వాత్మత్వమహావిభూతి సహితం, స్వాదీశ్వరత్వంస్వతః,
సిద్ధ్యేత్తత్పునరష్టధా, పరిణతంచ ఐశ్వర్యమవ్యాహతం॥

**తాత్పర్యము**: ఏ కారణం చేత స్తోత్రమందు ఇది సర్వమూ ఆత్మ మయమేనని నిశ్చయం గావింపబడినదో ఆ కారణం చేత ఈ స్తోత్ర బోధను శ్రవణం చేసినందువల్లనూ, దాని అర్థాన్ని మననం చేయుటవల్లనూ, అన్యోన్యం ముచ్చటించుకోవటం వల్లనూ సర్వమూ ఆత్మ మయమేనని నిశ్చయాత్మక ఆనంద సహితమై నేనే బ్రహ్మము అనే అనుభవం కూడా ముముక్షువు యొక్క అభ్యాసం వలన తనంతట తానే కలుగుతుంది. ఇంకా ఆ తత్త్వం గురించి శంకలేని నిశ్చయమున్నూ అష్టైశ్వర్యాలకు మించిన అభయం అనే విభవం కలుగుతుంది.

శ్రీ దత్తాత్రేయులవారి స్తోత్రము

17. వరదః కార్తవీర్యాదీ రాజరాజ్య ప్రదోऽనఘః
విశ్వశ్లాఘ్యోऽ మితాచారో దత్తాత్రేయో మునీశ్వరః॥

18. పరాశక్తి పదాశ్లిష్టో యోగానందః సదోన్మదః
సమస్తవైరి తేజోహృత్ పరమామృత సాగరః॥

19. అనసూయా గర్భరత్న, భోగమోక్ష సుఖప్రదః
శ్రీపాద వల్లభః పాతు శ్రీనృసింహ సరస్వతీ॥

శాంతి మంత్రములు

20. ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్యపూర్ణమాదాయా పూర్ణమేవావశిష్యతే॥

21. ఓం సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం
కరవావహై తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై॥
ఓం శాంన్తిః శాంన్తిః శాంన్తిః॥1.

# 1. ఉత్కృష్టమయిన మానవ జన్మ - పరమావధి

సకల జీవరాసులలోనూ మానవ జన్మ చాలా ఉత్కృష్టమయినది. ఎన్నో జన్మల పుణ్యాన్ని వెచ్చించి ఈ మానవ జన్మ తీసుకొని కర్మఫలితాలను అనుభవించటానికి వచ్చాము. మిగతా జంతువులు కూ డా వాటి ప్రారబ్ధ భోగము కొరకు ఆయాజన్మలు తీసుకున్నాయి. అందరికి, వాటి వాటి అనుగుణమైన ఆహారము, మైధునము, సంతానప్రాప్తి పొందుతున్నాయి. మానవుడు కూ డా ఆ విధంగానే జీవితం గడుపుతున్నాడు. ఆవిధంగానే జీవితం గడిపి దేహము పరిత్యజిస్తే మానవుడుకి పశువుకు తేడా ఏమీలేదు. మానవునికి భగవంతుడు యుక్తా యుక్త విచక్షణా జ్ఞానమును బుద్ధిని ప్రసాదించాడు. అందుచేత మానవుడు తన బుద్ధిని సద్వినియోగపరచుకొని పునర్జన్మ లేని మోక్షమును పొందాలని కృత నిశ్చయుండయి సాధన చేయాలి. ఆ ప్రయత్నం లేకుండా ఇంద్రియలోలుడై, అమితమైన కోర్కెలు పెంచుకుంటూ, రాగద్వేషాలకు లోనై సంగమంతో కర్తృత్వ భావంతో ప్రవృత్తి మార్గమవలంబించి మరణిస్తే మళ్లీ ఏ జన్మ వస్తుందో తెలియదు. అపుడు మానవునికి పశువులకు ఏమీ భేధముండదు. పశుపక్ష్యాదులకు ప్రారబ్ద కర్మ అనుభవించటానికే పుట్టాయి. మానవులులాగ కాని అవి కొత్త కర్మలు చేసి కర్మ వాసనలు పెంపొదించుకోలేవు, వాటికి యుక్తా యుక్త వివేక జ్ఞానము లేదు కాబట్టి. మానవుడు మాత్రం తన బుద్ధిని సద్వినియోగ పరచుకొని నిషిద్ధకర్మలు చేయకుండా నివృత్తి మార్గములో జీవితము గడిపి జ్ఞానమార్గం ద్వారా కర్మ ఫలసముదాయాన్ని భస్మం చేసుకొని పునర్జన్మ లేని మోక్షము పొందటానికి అవకాశముంది. ఈ అవకాశము మానవ జన్మలోనే సాధ్యమవుతుంది. అలా చేయకపోతే ఉత్కృష్టమయిన మానవజన్మను పాడుచేసుకొన్నట్లే.





## దైవత్వము - మానవత్త్వము - రాక్షసత్వము

మానవులలో సాధారణంగా మూడు రకాల వారు ఉంటారు. (1)మానవ దేవతలు (2) మానవ మానవులు (3) మానవ రాక్షసులని. మానవ దేవతనలేవారు నిత్య కర్మనుష్టాను చేసుకుంటూ, దైవసంపద 4 వ ప్రకారణలో చెప్పినట్లు అలవరచుకొని అసురసంపద దరి చెరనీయక, పుణ్యకర్మలాచరిస్తూ, పరోపకార బద్ధులై సగుణోపాసనా పరులై కాలం గడుపుతారు. యజ్ఞయాగాది కర్మలు చేస్తూ ఉంటారు. ఇటువంటి వారు మరణానంతరం తాము చేసిన పుణ్యకార్యాల ఫలితంగా దేవలోకంలో గాని గంధర్వ లోకంలో గాని ఊర్ధ్వ లోకాలలోని దేవతా శరీరము ధరించి పుణ్యఫలము పూర్తిగా అనుభవించి గానే తిరిగి మానవలోకంలో సంపన్న గృహంలో గాని వైదిక కర్మలాచరించే శ్రోత్రియుల ఇంట్లోగాని జన్మిస్తారు. ఇటువంటి వారికి కూ డా పునర్జన్మ తప్పదు. ఇక మానవ మానవులు మిశ్రమ పాప పుణ్యకర్మలాచరించటం వలన ఆ పాప పుణ్యకర్మల ఫలితంగా మానవుడుగా జన్మిస్తాడు. నీచసంస్కారుల ఇంటిలోనా ఉన్నత సంస్కారుల ఇంటిలోనా అనునది వారి కర్మ ఫలితాలమీద ఆధారపడి ఉంటుంది. కాని మానవ రాక్షసులు కేవలం రాక్షస ప్రవృత్తులు కలవారై నాల్గవ ప్రకరణలో చర్చించుకున్నట్లుగా అసుర సంపదలతో క్రూ రకర్మలాచరించి, నాస్తికులై, పరపీడనాపరులై, దేహాభిమానంతో దుష్కర్మలు ఆచరిస్తూ జీవితం గడుపుతారు. వారు తిరిగి క్రిమికీటకములుగా గాని, జంతువులలో గాని వృక్షములలో గాని పుడతారు. సద్గురుద్వారా తత్త్వ బోధ పొంది, సాధనచతుష్ట యసంపత్తితో తీవ్ర వైరాగ్యంతో, శ్రవణమననాదులు, నిధి ధ్యాసలతో నిర్వికల్ప సమాధి ద్వారా స్వస్వరూప నిరతిశయ ఆనందాన్ని అనుభవిస్తేనేగాని మోక్షము కలుగదు. ఇదే జ్ఞానమార్గము అంటారు.

పిపీలికాది బ్రహ్మ పర్యంతం సకల జీవరాశులు ఆనందాన్ని, సుఖాన్ని కోరుతారు. కష్టాలు వాటి పరంగా కలిగే దుఃఖాన్ని కోరుకోరు. ఆనందం, సుఖాలు సత్‌కర్మలవల్ల కలుగుతాయి. కష్టాలు, దుఃఖాలు దుష్కర్మలవల్ల కలుగుతాయి. సుఖాల్ని ఆనందాన్ని కోరుకుంటాడే తప్ప వాటికి కారణాలయిన సత్‌కర్మలు ఆచరించడు. కష్టాల్ని దుఃఖాల్ని కలుగకూడదనుకుంటాడు కాని బలవంతంగా నయినా వాటికి కారణభూతమయిన దుష్కర్మలను మాత్రం మానడు.

బంధాలు ఉన్నంతవరకు మోక్షప్రాప్తి కలుగదు. బంధాలు కతృత్వ భావంతో సంగమంతో చేసే కర్మలవల్ల కలుగుతాయి. ఆ కర్మ ఫలితాలు అనుభవించటానికి ఏదో ఒక శరీరము తీసుకొని రావలసి వస్తుంది. అంటే జన్మ వస్తుంది. ఏ శరీరము వస్తుందో మనకు తెలియదు. ఆ శరీరము పంది అవచ్చు, కుక్క అవచ్చు, చెట్టు అవచ్చు, మానవ జన్మ అవచ్చు, క్రిమికీటకాదులు, పక్షులు అవచ్చు. దేవతా శరీరం రావచ్చు. ఇది మనం చేసుకున్న పుణ్య, పాప కర్మల ఫలితంగా సంభవిస్తాయి. **"జన్మ దుఃఖం, జరాదుఃఖం, జాయాదుఃఖం పునః పునః! సంసార సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత్త జాగ్రత్త"** అని హెచ్చరించారు జగత్‌గురువు శ్రీ శంకరాచార్యులవారు. ప్రతీవారు తెలిసో తెలియకో మోక్షం కోరుకుంటూ ఉంటారు. ఆ మోక్షం బంధాలనుండి విముక్తి అవటమే. బంధాలు శాశ్వతం కాదు. శాశ్వతంగా ఉంటే ఎవరూ విడిపించుకోలేరు. ఎవరూ మోక్షార్హులు కారు. కాబట్టి బంధాలు అశాశ్వతాలు. బంధాలు అంటే ఏమిటో తెలిసికొని వాటిని నివారించుకొని వాటినుండి విడివడిన వారికి మోక్షార్హత కలుగుతుంది. వారికి బంధ విముక్తి కలుగుతుంది. కాబట్టి బంధ విముక్తే మోక్ష ప్రాప్తి. ఈ బంధాలన్నీ అజ్ఞానం వల్ల కలుగుతాయి. జ్ఞానం కలగగానే





అజ్ఞానం తొలగిపోతుంది. దాని ఫలితంగా కలిగే దుఃఖాలు తొలుగుతాయి. జ్ఞానం అజ్ఞానం ఒకచోట ఉండవుకదా! చీకటి వెలుతురు రాగానే పోతుంది. వెలుతురు లేకుండా పోయినప్పుడు చీకటి ప్రత్యక్షమవుతుంది. అందుచేత దీనినుండి తేలిందేమంటే మోక్షార్హత కల ముముక్షువు జ్ఞాన సముపార్జన చేసుకొని అజ్ఞానాన్ని నిర్మూలించుకొని తద్వారా బంధాలనుండి విడివడి పునర్జన్మ లేకుండా ముక్తుడవ్వాలి. కాబట్టి జీవిత పరమావధి పునర్జన్మకి కారణమయిన అజ్ఞానాన్ని జ్ఞాన సముపార్జన వలన పారద్రోలి బంధ విముక్తుడయి మోక్షమును పొందాలి.

జ్ఞానమంటే ఏమిటి? అది ఎట్లు సాధించాలి? ఒక విషయాన్ని గురించి పరిపూర్ణంగా తెలిసికోవటం జ్ఞానమవుతుంది. ప్రపంచంలో ప్రతివారికి ప్రతి విషయంలోనూ కొంత పరిజ్ఞానమే కలుగుతుంది. పూర్తి పరిజ్ఞానం కలుగదు. ఇది ప్రకృతిలో ఉండే అన్ని విషయాలమీద పూర్తిగా ఎప్పుడూ కలుగదు ఒకవేళ కలిగినా అది విషయ జ్ఞానమవుతుంది. ఆ జ్ఞానము మోక్షానికి సాధనముకాదు. చిత్రమేమంటే ప్రతిమానవుడు ఎంతసేపూ విషయ జ్ఞాన సేకరణకు ప్రయత్నిస్తాడేతప్ప తన్ను గురించి సంబోధించే **"నేను" "నేను"** అనే వ్యక్తిత్వం గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాస లేదు. **"నేను"** ఉన్నాను అని అంటున్నావు కాని నీస్వరూపమేమిటో నీకు తెలియదు. నేనున్నాని మాత్రం తెలుసు. అంటే నీకు సంబంధించిన జ్ఞానం మాత్రము లేదు. నీకు సంబంధించిన విషయముల మీద జ్ఞానం మాత్రం ఉంది. అది కూడా పరిపూర్ణంగా లేదు. **"నేను" "నేను"** అంటే గోపాలరావు అనో రామయ్య అనో అనుకుంటాడే తప్ప ఆ **"నేను"** యొక్క స్వరూపము ఎటువంటిదో అని కూడా తెలుసుకోవటానికి ప్రయత్నించడు. ఈ గోపాలరావు అనో రామయ్య అనో పేరు లోక వ్యవహారానికి శరీరానికి

పెట్టిన పేరు. పుట్టక ముందు పుట్టిన తర్వాత కూడా నామకరణ మహోత్సవం చేసేటంత వరకు గోపాలరావు గాని రామయ్య గాని లేదు. నామం లేకపోయినా **"నేను"** ఉన్నాను. ఈ **"నేను"** అనే వస్తువు శరీరములో నుండి నిష్క్రమించినపుడు వెంటనే ఈ శరీరము నిర్జీవంగా పడిపోతుంది. అపుడు ఆశరీరము శవము అవుతుంది. ఆ **"నేను"** అనే వస్తువు నిష్క్రమించింది కాబట్టి శరీరము వేరు **"నేను"** వేరు అని తెలుస్తోంది. రోజూ మాట్లాడుకునేటప్పుడు కూడా నా శరీరము బాగా లేదంటాడు అస్వస్థతగా ఉంటే. నా చేతి రుమాలు అన్నప్పుడు **"నేను"** వేరు నా చేతి రుమాలు వేరు అని కదా ఉన్నాయి! చేతి రుమాలు "నేను" కాలేదు కదా! అదే విధంగా శరీరము వేరు **"నేను"** వేరు కదా అని అర్ధము. అయితే ఆ "నేను" **"నేను"** అనే వస్తువు యొక్క పరిజ్ఞానము లేకపోవటమే అజ్ఞానము. దాని పూర్తి పరిజ్ఞానము అనుభవపూర్వకంగా తెలుసుకోవటమే జ్ఞానసముపార్జన అవుతుంది. ఆ **"నేను"** అనుభవ పూర్వకముగా ఎప్పుడు తెలుసుకొని అనుభవిస్తాడో వెంటనే అజ్ఞానం నశిస్తుంది. దాని వలన సకల బంధాలు కష్టాలు తొలగి మోక్షప్రాప్తికి హేతువవుతుంది. స్వస్వరూప జ్ఞానము అనుభవకపూర్వకముగా తెలుసుకోవాలి. కాబట్టి ఆ **"నేను"** **"నేను"** అంటే ఏమిటి? ఆ అనుభవము ఎలా కలగాలి. భగవంతుడంటే ఎవరు? ఆయన స్వరూపమేమిటి? ఆయన లక్షణాలు ఏమిటి? ఆ "నేను" కు భగవంతుని ఎంత దూరముంది? ఆయనను పొందే మార్గమేమిటి? ఇవి తెలుసుకుంటే కలిగే ఫలితాలు ఏమిటి? ఈ జ్ఞానం ఎంత వరకు పునర్జన్మలేని మోక్షానికి ఎలా దారితీస్తుంది? అనే విషయాలు చర్చించుకుందాము. ఇంకా కొంచెం విపులంగా చెప్పాలంటే ఈ శరీరంలో ఉండి చూసే **"నేను"** అంటే అది ద్రష్ట చూడబడేవన్నీ ఈ ప్రకృతి దృశ్యాలు





అంటే తన శరీరము మొదలుకొని బాహ్యంగా ఉండే సర్వ జగత్తుని అంటే **"దృశ్యము"** ఎక్కడో కనబడ కుండా ఉండే భగవంతుడు (పరబ్రహ్మ) గురించి విపులంగా చర్చించుకొని ఆ **"నేను"** అనే తత్వాన్ని దృశ్యామంతా ఆ **"నేను"** లో లయం చేసినపుడు ఆ **"నేను"** అనే స్మృతి కూడా పరబ్రహ్మలో లయమయినపుడు త్రిపుటి నశించి అన్ని బంధములు విడివడి పరిపూర్ణ జ్ఞాని అయి విదేహకైవల్యం పొందుతాడు. ఇక పునర్జన్మ ఉండదు. ఈ విషయాలు పూర్తిగా చర్చించుకుందాము. ఇలా తెలుసుకోవాలనే కుతూహలమే బ్రహ్మ జిజ్ఞాస, తీవ్ర ముముక్షత్వము లేక శుభేచ్ఛ అంటారు. ఈ విషయాలు రాబోయే ప్రకరణాలలో చర్చియుందాము.

అంతేకాని యజ్ఞ యాగాదులవల్లగాని, తీర్ధ యాత్రల వల్ల గాని పుణ్య నదుల స్నానాలు చేయటం వలన గాని, దానధర్మాల వలన గాని ఉపవాసాలవలన గాని, చాంద్రాయణ వ్రతము మాదిరి వ్రతములు ఆచరించినా గాని మోక్షము కలుగదు. అవి చిత్తశుద్ధి దోహదం చేసి పరోక్ష జ్ఞానము పొందటానికి కారణాలవుతాయి గాని మోక్షప్రాప్తి కలుగచేయవు. సత్పుత్రులను కనినా, రాజ్యాధికారాలు పొందినా, ఆశుకవిత్వ నిపుణులయినా మోక్షము కలుగదు.

## 2. కర్మలు - కర్మ ఫలితాలు

ఎవడయినా, ఎక్కడయినా, ఎప్పుడయినా కర్మ చెయకుండా ఒక్క క్షణం కూడా ఉండలేడు. ప్రకృతి వలన కలిగిన సత్త్వ రజస్తము గుణాలతో మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు ఏకమై పూర్వ జన్మ వాసనాబలంతో సంగమంతో కర్తృత్వ భావంతో ప్రతి జీవికర్మలు చేస్తు ఉంటాడు. ఈ కర్మలు మూడు రకాలు i. మానసిక కర్మలు ii. వాచిక కర్మలు iii. కాయిక కర్మలు. ఒక సుషిప్తిలో తప్ప జాగ్రత్స్వప్నావ స్థలలో సైతం పై మూడు కర్మలు గాని లేదా రెండుగాని లేదా ఒకటి గాని చేయవచ్చు. ఎవరు ఏ కర్మ చేసినా తన స్వార్థం కోసం, ఆనందం కోసం, సంగమంతో, కర్తృత్వంతో చేస్తు ఉంటాడు ఒక్క బ్రహ్మనిష్ఠుడు తప్ప. ఈ కర్మఫలాన్ని అతను అనుభవించటానికి జన్మ ఎత్తవలసి వస్తోంది.

ఈ విశ్వ ప్రపంచమంతా కర్మ సిద్ధాంతం పైన ఆధారపడి ఉంది. ప్రతి కర్మకి ఒక ఫలితం తప్పకుండా ఉంటుంది. కర్తృత్వంతో చేసిన కర్మ ఫలితాలు అనుభవించటానికి ఒక దేహం ఉండాలి. అందుచేత జన్మ తప్పదు. కాబట్టి కర్మ ఫలితాల బట్టి జన్మ వస్తుంది. జన్మించిన తరువాత మళ్ళీ కర్మలు చేయకుండా ఉండడు కాబట్టి వాటి ఫలితాలు అనుభవించటానికి మళ్లీ జన్మ ఎత్తాలి. అందుచేత కర్మ, జన్మ, కర్మ, జన్మ ఇది అనివార్యం. ఈ విధంగా అనాది నుండి వస్తోంది. అనాది నుండి ఎన్నో జన్మలు అనుభవించాము. కర్మఫలితములు క్షయమయితే కాని జన్మ పరంపరలు నుండి తప్పించుకోలేము.

ఈ కర్మ ఫలితాలు మూడు రకాలుగా విభజింపబడినాయి. 1.సంచితం 2. ప్రారబ్ధం 3. ఆగామి. మన ఎక్కౌంటులో నిల్వ ఉన్న కర్మ ఫలితాలనుండి కొన్నిటిని అనుభవించటానికి ఈ జన్మ తీసుకొని వచ్చాము.





అవి పుణ్యకర్మలు కావచ్చు. పాపకర్మలు కావచ్చు. దానినే ప్రారబ్ధం అంటారు. ఉదాహరణకు ఒకనికి 1000 కర్మ ఫలితాలు అనుభవించటాని నిలువలో ఉన్నాయి అనుకోండి. అందులో 400 ఫలితాలు అనుభవించటానికి ప్రస్తుత జన్మ తీసుకుంటే ఇది ప్రారబ్ధ కర్మ అంటారు. ఇంకా 600 కర్మ ఫలితాలు నిలువలో ఉంటాయి. ఇది సంచిత కర్మ ఫలితాలు అంటారు. ఈ జన్మలో 400 కర్మ ఫలితాలు అనుభవిస్తూ మళ్లీ 800 కర్మలు చేస్తే ఇది ఆగామి కర్మ ఫలితాలు అంటారు. మరణించే సమయానికి అతనికి ఆగామి 600+ 800= 1400 సంచితం అవుతుంది. కాబట్టి కర్మ ఫలితాలు కూడా Bank Account మాదిరిగా ఉంటుంది. కర్మ ఫలితాల Account లో NIL Balance అయ్యే వరకు జన్మ తప్పదు. NIL Balance అయినపుడు మాత్రమే మోక్షం సిద్ధిస్తుంది. ఒక్క వాసన మిగిలిఉన్న జన్మ తప్పదు.

పుణ్యకర్మలకు మంచి కలుగుతుంది. పాపకర్మలకు చెడు కల్గుతుంది. ఆశ్చర్యమేమంటే ప్రతివాడికి ఆనందం, ఐశ్వర్యము, ఆరోగ్యము, అధికారం కోరుతాడే కాని వాటిని పొందే పుణ్యకర్మలు మాత్రము ఆచరించడు. బలవంతంగానైనా పుణ్యకర్మలయిన దాన ధర్మాలు, మానవసేవ మొదలయినవి ఆచరించడు. పాపకర్మ ఫలితాలయిన కష్టాలు రాకూడదని వాంఛిస్తాడే తప్ప పాపకర్మలను చేయటం మానడు. ప్రారబ్ధకర్మ ఫలితాలు అనుభవించేటప్పుడు కష్టాలు వస్తే భగవంతుణ్ని కష్టాలొచ్చాయని నిందిస్తాడు తప్ప తాను గత జన్మలో చేసిన పాపకర్మల ఫలితంగా కష్టాలొచ్చాయని తెలుసుకునే వివేకం కోల్పోతాడు. తనకు ప్రమోషన్లు వచ్చినప్పుడు, ధనప్రాప్తి కల్గినప్పుడు, సుఖం ఆనందం కలిగినప్పుడ అహంకారంతో తన ప్రయోజకత్వం వలన కలిగినాయని అనుకుంటాడే తప్ప ఇవి గత జన్మలో చేసుకున్న పుణ్యకర్మ ఫలితాలని గ్రహించడు. భగవంతుడు కర్మ ఫల ప్రదాత. ఆయన

దయామయుడు, కరుణామయుడు. కర్తృత్వ బుద్ధితో, సంగమంతో, త్రిగుణాల ప్రభావంతో ఆచరించిన కర్మలకు భోక్తృత్వం కూడా వహించవలసి ఉంటుంది. ఇది అనివార్యం. త్రి గుణాలు వాటి ప్రభావాలు 3వ ప్రకరణలో చర్చించబడ్డాయి. అయితే కొన్ని కర్మలకు ఫలితాలు వెంటనే కలుగుతాయి. కొన్ని కర్మల ఫలితాలు కొన్ని గంటలలో అనుభవానికి రావచ్చు. కొన్ని కర్మల ఫలితాలు జన్మాంతరాలలో రావచ్చు. ఉదాహరణకు గుండుసూదితో పని చేసేటప్పుడు అది వ్రేలుకు గుచ్చుకొని వెంటనే రక్తం వస్తుంది. ఇపుడు భోజనం చేస్తే పచనమయి రక్తం మజ్జ మొదలయిన పదార్ధాలుగా మార్పు చెందటమనే పలితం రెండు గంటల తర్వాత అనుభవంలోకి వస్తుంది కొన్ని ఫలితాలు కొన్ని జన్మల తరువాత రావచ్చు. పశుపక్షాదులు, క్రిమి కీటకాలు, చెట్లు వగైరా జీవాలు కర్మ అనుభవించటానికే వచ్చాయి. కాబట్టి కొత్త కర్మ సముదాయాన్ని సంపాదించటానికి రాలేదు. ఎందుచేతనంటే వాటికి యుక్తా యుక్త విచక్షణ జ్ఞానం, తగిన బుద్ధి భగవంతుడు వాటికి ప్రసాదించలేదు. అందుచేత అవి చేసే కర్మలకు ఫలితాలు ఉండవు. ప్రారబ్ద కర్మ అనుభవించటం పూర్తవగానే శరీరం వదలి కొత్త జన్మ తీసుకుంటాయి. అయితే మానవ జన్మ అలా కాదు. ఎన్నో జన్మల పుణ్య పరిపాకం వలన గాని మానవ జన్మ రాదు. మానవులకు మాత్రమే యుక్తా యుక్త వివక్షణా జ్ఞానాన్ని బుద్దిని ప్రసాదించాడు భగవంతుడు. ఈ జన్మలోనే శాస్త్రరీత్యా నిష్కామ కర్మలాచరిస్తూ, అకుంఠిత భక్తి వైరాగ్యాలతో అంతః కరణ శుద్ధి చేసుకొని, సాధన చతుష్టయ సంపత్తితో అరిషడ్వర్గాలను, ఇంద్రియాలను జయించి, మనస్సును నియంత్రణ చేసుకొని సద్గురు తత్త్వ బోధపొంది, మహావాక్యోపదేశము పొంది, తీవ్రముముక్షత్వంతో అకుంఠిత దీక్షతో సాధన చేసి జ్ఞానసముపార్జన చేసుకొని నిర్వికల్ప సమాధి పొంది భగవంతుని కృపతో సప్త భూమికలు దాటి కర్మ ఫలితాలను అంటే





సంచిత, అగామి కర్మల శేషాన్ని భస్మీపటలం గావించికొని కర్మల Account ను NIL బ్యాలన్సు చేసుకొని జన్మరాహిత్యం చేసుకోవచ్చు. ఇది ఇతరజీవులకు అంటే పశు, పక్షి, క్రిమికీటకాదులకు గాని చెట్లు మొదలయిన ఇతర ప్రాణులకుగాని సాధ్యం కాదు. దేవతలకు కూడా వారి పుణ్య కర్మల భోగాల అనుభవం అయిపోగానే మోక్షం కోరుకుంటే మానవ జన్మ ఎత్తవలసిందే. ప్రారబ్ద కర్మ మాత్రం అనుభవిస్తేనే కాని క్షయము అవదు. అది విడిచిపెట్టిన బాణంలాంటిది. ప్రారబ్ద కర్మ ఇంకా శేషం ఉంటే అతడు మహాసముద్రంలో పడిపోయినా ఆ ప్రారబ్ద శేషాన్ని అనుభవించటానికి ఎలాగో అలాగు ఒడ్డు చేరుకుంటాడు. ప్రారబ్ధం క్షీణిస్తే ఎంత సమర్ధులయిన వైద్యులు వైద్యం చేస్తున్నా శరీగాన్ని వదులుతాడు. నిర్వికల్ప సమాధిపొందిన యోగి ప్రారబ్ధాన్ని తన శరీరానికి వదలి తాను సాక్షి రూపుడయి ఉంటూ ఉదాసీనంగా ఉంటాడు. ఈ విషయాలు అంటే ఈ కర్మ ఫలితాల సముదాయాలనుండి NIL బ్యాలన్సు చేసుకొని పునర్జన్మలేని మోక్షసాధన ఏ విధంగా చేయాలి అనేది విపులంగా ఈ ప్రకరణలో చివర చర్చించుకుందాము. అయితే ఈ కర్మ ప్రభావాలు ఏ విధంగా ఉంటాయో కొన్ని ఉదాహరణల ద్వారా చర్చించుకుందాము.

i. ఒకడు ఒక ఊరిలో తన పొలములో వరి పంట నాటాడు. పంట ఏపుగా పెరిగి ఆకర్షణీయంగా ఉంది కాని తన పొలం చుట్టూ పశువులు రాకుండా కంచె వేసుకోలేదు. ఒకరోజు ఒక ఆవు అటువెడుతూ వరిపంటను చూసి ఆకలిగా ఉండటం చేత పొలంలోకి వెళ్లి మేస్తోంది. దానికి ఇది ఇతరుల పొలం వారి అనుమతి లేకుండా ప్రవేశించి, ఆ పంటను మేసి వారికి నష్టం కలుగుచేయరాదనే వివేచనా శక్తినిచ్చే బుద్ధి భగవంతుడు ఇవ్వలేదు. కాబట్టి తన ఆకలి తీర్చుకోవటానికి అందులోకి వెళ్లి మేస్తోంది. ఇది జంతు సహజ లక్షణం. దాని తప్పేమీ లేదు కాని

ఆభూస్వామి ఆవుమేయటం చూసి లోభంతో, తనకు నష్టం కల్గించిదని ఆగ్రహంతో ఒక కర్ర తీసుకొని తీవ్రంగా ఆ ఆవును కొట్టగా దాని కాలు విరిగింది. ఆభూస్వామి యుక్తా యుక్త విచక్షణా జ్ఞానం కోల్పోయాడు. పొలం చుట్టూ కంచె వేసిఉంటే ఆవు మేసి ఉండేది కాదు. అది తనతప్పు అని గ్రహించలేని అవివేకి అయ్యాడు. ఆవుకు భగవంతుడు బుద్ధిని ఇవ్వలేదు కాబట్టి దాని సహజ లక్షణంగా తన ఆకలి తీర్చుకునేందుకు మేస్తొందని గ్రహించలేకపోయాడు. లోభంతో క్రూరంగా ఆ సాధుజంతువును కొట్టి అంగవైకల్యం చేశాడు. ఆవుకు మాత్రంప్రారబ్ద కర్మ తీరింది. భూస్వానికి మాత్రం తన దుష్కర్మ ఫలం (ఆగామి) సంపాదించుకున్నాడు. అది అతడు అనుభవించి తీరవలసిందే.

ii. ఒక ఊరిలో బాగా నీటిఎద్దడి ఉంది. త్రాగటానికి కూ డా నీరు దొరకక గ్రామస్థులు అల్లాడుతూ దూర ప్రాంతాలకు వెళ్లి నీరు తెచ్చుకోవలసి వస్తోంది. ఆ గ్రామంల్లో నివశించే ఒక సత్త్వగుణ ప్రధానుడు ధనవంతుడు, నాల్గురోడ్డులు కలిసే ఒక కూ టమిలో గ్రామ ప్రజల సౌకర్యార్థం ధనం వ్యయంచేసి ఒక బావి త్రవ్వించాడు. అదృష్టవశాత్తు భగవంతుని దయవలన అందులో పుష్కలంగా స్వచ్ఛమైన మంచినీరు వచ్చాయి. ఊరందరూ అతనిని శ్లాఘించారు. అందరూ ఆ నీటిని వాడుకోవటం అంత మంచిపని ప్రజోపయోగార్థం తాను పుణ్యకార్యం చేశాను కదా అని ఆనందించాడు. ఆ పనిని తాను కర్తృత్వ బుద్ధితో చేయటంవల్ల ఆ పుణ్య కార్యానికి సంతోషించాడు. కాని ధనలోభంచేత ఆ బావికి ఒక అడుగు మాత్రం ఎత్తుగా చుట్టూ పిట్టగోడ కట్టాడు. కొన్ని రోజుల తర్వాత ఒక ఆవు అటునుండి వస్తూ దాహంగా ఉండటంచేత బావి వద్దకు వెళ్లి దాని పిట్టగోడ ఎత్తుగా లేకపోవటం చేత అందులో





ప్రమాదవశాత్తు పడి చనిపోయింది. కాని ఆ బావి త్రవ్వించిన యజమాని ఆవు మరణానికి దారితీసిన పాపఫలాన్నిదాని కర్మ మీదకు తోసేస్తాడు. ఎప్పుడయితే బావి త్రవ్వించి పుణ్యఫలాన్ని ఆశిస్తున్నాడో అనివార్యంగా పిట్టగోడ ధనలోభం చేత లుబ్ధత్వంతో ఎత్తుగా కట్టకపోవటం చేత ఆవు చనిపోయిన కర్మకు కూ డా భోక్తృత్వం వస్తుంది. ఇదీ అనివార్యమే.

iii. ఉదాహరణకి నేను ఒక స్నేహితుని ఇంటికి వెళ్లాను. అతను భోజనం చేస్తూ ఉండటంవల్ల తలుపు తీసి నన్ను ముందు గదిలో కూ ర్చోమన్నారు. అక్కడ table మీద ఒక అందమయిన ఖరీదయిన Wrist Watch ఉంది. అక్కడ ఎవరూలేరు కాబట్టి ఆ Wrist Watch ని దొంగిలిద్దామని సంకల్పం కల్గింది. ఈ సంకల్పం చిత్తమందలి పూర్వజన్మ వాసనల బీజరూపమయిన దొంగతనం వల్ల కల్గింది. దీనిని మానసిక కర్మ అంటారు. దీనికి కూడా కర్మ ఫలితం ఉంటుంది. దొంగతనం చేయటం పాప కార్యమని అంతరాత్మ చెబుతూనే ఉంది. కాని ఇక్కడ ఎవరూలేరు. ఇప్పుడే వారి పనిమినిషి బయటకు వెళ్లింది. ఈ Wrist Watch తీసుకుంటే పనిమనిషి మీదకుపోతుంది. సమాజంలో పలుకుబడి ఉన్న నా అంతటి వ్యక్తి మీదకు అనుమానము రాదు అందుచేత ఈ Wrist Watch తీసుకోవటమే లాభదాయకమని బుద్ధి నిర్ణయిస్తుంది. అంతరాత్మ బోధ పెడచెవిని పెట్టింది. ఎప్పుడయితే బుద్ధి నిర్ణయిస్తుందో వెంటనే అహంకారం బయలుదేరి చేతులనే కర్మేంద్రియం ద్వారా Wrist Watch తీసుకొని జేబులో పెట్టుకోవటం జరుగుతుంది. ఇప్పుడు శారీరకంగా దొంగనయ్యాను. ఈ విధంగా మానసిక, వాచిక, శారీరక కర్మలు జరుగుతూ ఉంటాయి.

iv. ఈ జన్మలో అనుభవించే ప్రారబ్ద కర్మలు మూడు రకాలు 1.ఐచ్ఛిక ప్రారబ్దము 2. అనైచ్ఛిక ప్రారబ్దము 3. పరైచ్ఛిక ప్రారబ్దము.

ఐచ్ఛిక ప్రారబ్దము స్వయముగా ప్రయత్నము చేసి ఈ జన్మలోగాని జన్మాంతరమందు గాని సంపాదించుకున్నవి. ఉదాహరణకి, తీవ్ర సాధనతో అకాశ గమనాది సిద్దులను సంపాదించవలెనని కోర్కెతో వాటిని పొందుట. ఇంకా ఒకడు వేరొక సంపన్న గృహస్థుని అతని అధికార హోదా చూసి ఆ విధంగా తనకు కూ డా కలగాలని ఆ స్థితికి రావాలని తీవ్రకాంక్షతో దానికి తగిన పుణ్యకార్యాలు యజ్ఞ యాగాదులు చెయ్యటం వలన ఈ జన్మలో కాకపోయినా ఇంకొక జన్మలో తన కోర్కె సిద్ధించి అవి కలుగట మున్నగున్నవి. అనైచ్ఛిక ప్రారబ్దము తాను కోరకపోయినా వచ్చేవి. కష్టాలు మొదలైనవి. కష్టాలు ఎవరూ కోరుకోరు. ఉదాహరణకు ఇతరులను వారికి తెలియకుండా మోసపుచ్చి బుద్దిపూర్వకంగా నష్టం కలిగించి తాను లబ్ది పొందటం. వారికి తెలియ లేదు కదా అని నిశ్చింతగా ఉండటం. దానిని గురించి మరచిపోవటం. వాటి ఫలితాలు ఈ జన్మలో గాని జన్మాంతరంలోకాని కష్టాలు వచ్చి అనుభవించటం. వీటిని అనైచ్ఛిక ప్రారబ్దాలు అంటారు. అందుకనే ఇతరులు ఏ పని చేస్తే మనకి ఇబ్బంది కలుగుతుందో అటువంటి పనులను ఇతరులకు మనము చేయకూ డదు.

జ్ఞానేంద్రియాలు ఎపుడూ బయటకు ప్రసరిస్తు ఉంటాయి. ఈ ప్రకృతిలో కనబడే విషయ పరిజ్ఞానాన్ని అంతాకూ డా గ్రహించి మనస్సుకు తెలియచెబితే, ఆ మనస్సు బుద్ది నిర్ణయానికి లోబడి, అహంకారంతో కర్తృత్వ భావనతో కామంతో కర్మేంద్రియాల ద్వారా చేసే వ్యాపారాన్ని కర్మలంటారు. ఒక్కొక్కసారి ఈ మనస్సే బుద్దిని కూ డా లోబరుచుకొని కర్మలాచరిస్తుంది అంటే ఇక్కడ జ్ఞానేంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారము, కర్మేంద్రియాలు చూడబడే విషయము వీటిన్నింటికి ఆ కర్మ చేయటానికి శక్తినిచ్చే ఆత్మ చైతన్యము (అదే జీవ చైతన్యము కోర్కెలతో చేయబడేది కాబట్టి) కలిసి చేస్తాయి. కర్తృత్వముతో జీవుడు (జీవ చైతన్యము)



జ్ఞాన దీపిక

చేయబడింది కాబట్టి దానివల్ల వచ్చే ప్రతిఫలం అనుభవించటానికి అ జీవ చైతన్యము (జీవుడు) భోక్తుడవుతున్నాడు. ఈ మనస్సు, బుద్ధి, అహంకారము, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు అతనికి పనిముట్లు. ఈ విధంగా సకల కర్మలు జరుగుతూ ఉంటాయి.

అయితే ఈ కర్మలు చేయటంలో రెండు మార్గాలున్నాయి.1.ప్రవృత్తి మార్గమని 2.నివృత్తి మార్గమని. ప్రవృత్తి కొరకు చేసే కర్మలన్నీ శ్రేయస్సు కొరకై చేయబడతాయి. అంటే సంగమంతో, కర్తృత్వ భావంతో అరిషడ్వర్గాలకు లోనయి, ఈర్ష్య, అసూయ, స్వాభిలాష, అజ్ఞానంతో, కోరికలతో చేయబడిన కర్మలన్నీ ప్రవృత్తి మార్గములనబడతాయి. వీటివల్ల అధోలోకాలకి, నీచ జన్మలెత్తుతూ జనన మరణ ప్రవాహంలో కొట్టుకొని పోతాడు. ఈ కర్మలవల్ల పునర్జన్మ లేని మోక్ష స్థానానికి ఎన్నడూ చేరలేడు.

కర్మలన్నీ ఈశ్వరప్రీతికై, ఫలాపేక్ష లేకుండా, మోక్ష ఫలమందు సైతం ఆసక్తివదలి సర్వకర్మలను భగవంతుని కోసం ఆచరించేవన్నీ ఆ విద్వాంసుడు నీటిలో ఉంటున్నా నీరు తామరాకును అంటనట్లుగా ధర్మా, ధర్మాత్మకమైన పాపం అతనికి అంటదు. ఈశ్వరుని కొరకే నేను కర్మను చేస్తున్నాను. నేను ఫలాపేక్ష కోరి చేయటం లేదు.పరహితార్థం చేసే కర్మలన్నీ చిత్తశుద్దికోసమే అవుతుంది. ఆచిత్తశుద్ది మూలంగా వాసనాక్షయ మవుతుంది. ఉపాసనతో ఏకాగ్రత సిద్ధిస్తుంది.విచారణతో జ్ఞానాన్ని పొందటం వల్ల పరోక్షంగా మోక్ష సాధనమవుతుంది. ఈ కర్మలన్నీ నివృత్తి మార్గ కర్మలంటారు. ఈ విధంగా చేసే కర్మలు ఊర్ధ్వంగా పుణ్యలోకాలకు తీసుకొనిపోయి, ఆఖరుకి చిత్తశుద్ధి కలిగి భగవంతుని కృప వల్ల వాసనాక్షయమయి జ్ఞానం అనుభూతిలోకి వచ్చి పునర్జన్మ లేని మోక్ష ప్రాప్తి కలుగచేస్తాయి అందుచేత కర్తృత్వము లేకుండా, ఈశ్వరార్పణ బుద్ధితో

ఫలాపేక్ష రహితముగా, అహంభావ రహితంగా, నిస్వార్ధబుద్ధితో, పరోపకార యుక్తమగు కర్మలు చేయాలి. ఈ విధంగా వాసనాక్షయమయి తీవ్ర వైరాగ్యము, సాధన చతుష్టయ సంపత్తి కలిగి, సద్గురువు ద్వారా తత్త్వభోధ శ్రవణము చేసి, మనన నిధి ధ్యాసలు తీవ్ర ముముక్ష్వంతో సాధనచేసి, ధ్యానం ద్వారా నిర్వికల్ప సమాధి ద్వారా స్వస్వరూప జ్ఞానం పొందుతాడు. ఇటువంటి నిర్వికల్ప సమాధి పొంది స్వస్వరూప జ్ఞానము అనుభవించిన యోగి యొక్క సమస్త కర్మల ఫలం అంతా కూడా, దూది రాశిలో ఏ విధంగా అగ్నికణం పడితే దూది అంతా భస్మమవుతుందో అదే విధంగా సంచిత కర్మఫల సముదాయమంతా భస్మమవుతుంది. కర్మఫలాల యొక్క బ్యాలన్సు NIL అవుతుంది. **"జ్ఞానగ్ని సర్వకర్మాణి భస్మాసాత్కురుతే"**. అయితే శేష జీవితంలో చేసే కర్మలన్నీ ఈశ్వర ప్రీత్యర్థం లోకహితార్థం. సంగమం లేకుండా కర్తృత్వం లేకుండా చేస్తాడు కాబట్టి కర్మ ఫలితాలు ఉండవు. అక్కడ "భోక్తుత్వం" ఉండదు. అయితే తాను ఆ విధంగా చేసిన పుణ్యకర్మల ఫలం ఆయన శిష్యులకు ఆయనను పూజించిన వారికి చేరుతాయి. తెలియకజేసిన పాప కర్మలుంటే వాటి ఫలితాలు ఆయనను అకారణంగా నిందించే వారికి చేరతాయి. అంటే ఇకముందు ఆగామి కర్మ ఫల సముదాయము ఉండదు. అందుచేతనే మహాయోగులను గాని ఇతరులను గాని పరోక్షంగాగాని అపరోక్షంగాగాని నిందించరాదు. ఇక ప్రారబ్దకర్మ విడిచిపెట్టిన బాణం కాబట్టి అది అనుభవించేది దేహమే కాబట్టి ఆ ప్రారబ్ద కర్మ ఫలితాన్ని దేహానికి వదిలిపెట్టి తాను విలక్షణుడై ఉండి ఆబాధలను ఉదాసీనంగా సాక్షిగా చూస్తూ ఉంటాడు. ఆ ప్రారబ్ద కర్మ ఫలం తీరేవరకు దానికి ఇతరులను నిందించడు. ఈ విధంగా కర్మ ఫలితాల ఎక్కౌంట్ NIL బ్యాలెన్సు అయింది కాబట్టి మళ్లీ దేహం తీసుకొని వచ్చే పునర్జన్మ ఉండదు. ఈ క్రింది పటము పరిశీలించగలరు.







## 3. త్రిగుణములు - వాటి ధర్మములు - అవి ఎలాగ జీవుని బంధిస్తున్నాయి - ఆగుణాల విముక్తి ఏలా లభిస్తుంది.

పరమాత్మ త్రిగుణాత్మకమైన ప్రకృతి అనే మాయయే సమస్త భూతాలకూ గొప్ప కారణం (యోని). ఈ ప్రకృతియే మిగతా కార్యాలన్నింటికీ గొప్పదైనందున "మహత్తు" అని, తన వికారాలు అనుభవించటం వల్ల బ్రహ్మ అని, దీనిని (ఈ ప్రకృతిని) మహద్బ్రహ్మ అంటారు. అట్టి మహద్బ్రహ్మ రూపమైన యోనియందు (కారణమందు) సమస్త భూతాల జన్మకు కారణమైన హిరణ్యగర్భుని యొక్క జన్మకోసం బీజాన్ని పరమాత్మ ఉంచుతున్నాడు. అతని ద్వారా సమస్త సృష్టి ఉత్పన్నమవుతోంది.

వ్యవహార దశలో పరమాత్మని మాయావిశిష్టుడన్నారు. పరమాత్మ వేరు. పరమాత్మ శక్తి వేరుకాదు. శక్తి, శక్తిమంతులు భిన్నంగా ఉండరు. ఆ మాయనే ప్రకృతి, అవ్యక్తము అంటారు. అదియే సర్వ భూతాలకు ఉత్పత్తి స్థానము. కావుననే "యోని" అని చెప్పబడింది. స్థావరజంగమాత్మక వస్తువులన్నీ క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగముతోనే సంభవిస్తున్నాయి. క్షేత్రమంటే ఏమిటి, క్షేత్రజ్ఞుడు అంటే ఎవరు, జ్ఞానము అంటే ఏమిటి అనే విషయాలు విపులంగా తొమ్మిదవ ప్రకరణలో చర్చించుకుందాము. ప్రకృతి స్వతంత్ర వస్తువు కాదు. అది భగవంతుని ఆధీనంలో ఉన్నది. **"మమ మాయా"** అన్నారు కాబట్టి, అపరితమైనది కాబట్టి ఆకాశాది భూతాలకంటే పెద్దది. కాబట్టి ప్రకృతిని మహత్తు అన్నారు. సర్వ భూతాలు అవ్యక్త దశనుండి వ్యక్త దశకు రావడమే ఉత్పత్తి. ప్రకృతి సకల జీవులకు తల్లి. పరమేశ్వరుడు తండ్రి. బీజదాత. మాయ అంటే ఏమిటి, మాయా కార్యమెట్టిది, దానిని దాటటం ఎలా అనే విషయాలు పదవ ప్రకరణలో విపులంగా చర్చించబడింది.





ప్రకృతినుండి మూడు గుణాలు కలిగాయి. గుణాలు సామ్య స్థితిలో ఉన్నపుడు ఆ స్థితిని "ప్రకృతి" అని వ్యవహరింప బడుతుంది. కాని విషమత్వంబొంది అంగాగిభావంతో ప్రకృతినుండి మూడు గుణాలు పరిణమిస్థాయి. ఈ మూడు గుణాలు (I) సత్వ గుణం (II) రజోగుణం (III) తమో గుణం. ఈ మూడు గుణాలు సమానమైన మోతాదులో ఉండటం సామ్య స్థితి అంటారు. ఒక గుణం ప్రధానంగాను మరి రెండు అప్రధానంగాను మారటం విషమస్థితి మొత్తానికి మూడు గుణాల కలయికలోనే ప్రపంచం ఏర్పడింది. ఈ మూడు గుణాలే బ్రహ్మాండంలో విషయాకారంగా ఉన్నాయి. అవే లోపల పిండాండంలో రాగ, ద్వేష, నిద్ర, ఆలస్య, ప్రమాద సత్య, దయ దాక్షిణ్యాది రూపాలలో విస్తరించి ఉన్నాయి. గుణాల సాంగత్యంతో జీవుడు సంసార బంధంలో పడిపోయాడు. గుణాలను తీవ్ర ముముక్షత్వంతో తీవ్రమయిన సాధనతో దాటితేనే కాని మోక్ష ప్రాప్తి కలుగదు. గుణాలు దాటి నిర్గుణస్థితికి రావటం కష్టమే కాని అశక్యం మాత్రం కాదు. పరమేశ్వరుని దయతో అకుంఠిత దీక్షతో దాటవచ్చు.

పురుషుడు స్వతహా నిర్వికారుడు అయినా అఘటనఘటనా పటీయసియైన మాయా ప్రభావంతో తన స్వరూపాన్ని మరచి దృశ్యాలయిన గుణాలతో (కల్పిత) తాదాప్యం చెంది దేహంతోనూ దాని కర్మలతోను **"నేను" "నాది"** అనే అభిమానానికి పాల్పడి జనన మరణ రూప సంసారంతో అజ్ఞానంచేత బద్ధుడైనాడు. ఇది వాని స్వయంకృతాపరాధం. స్వరూప స్థితిలో క్షేత్రజ్ఞుడుకి (పురుషునికి) ఎట్టి వికారములు లేవు కాని అధ్యారోప దృష్టిలో భ్రాంతి దృష్టిలో గుణాల సంగమం వల్ల వికారవంతుడైనట్లు తోస్తున్నాడు. అలా అయినట్లు తోచుటే కాని నిజంగా అలా అవలేదు. కాబట్టి క్షేత్రజ్ఞుని గుణ సంబంధము కూడా మాయికమే కాని వాస్తవం కాదు. ఇది

తెలుసుకొని వాటినుండి విముక్తి పొందటమే జ్ఞానం. సత్త్వ గుణం అంతర్ముఖాన్ని కల్గిస్తుంది. రజోగుణం బహిర్ముఖాన్ని కల్గిస్తుంది. తమో గుణం రెండూ లేనట్టి మరుపును కల్గిస్తుంది. మూడు గుణాలుకూ డా జీవుని బంధిస్తాయి. ఇప్పుడు గుణ ధర్మాలను విచారించుకుందాం.

(i) సత్త్వ గుణము-

సత్త్వ గుణం మంచిదే కాని, అహంకారానికి, అభిమానానికి దారి తీస్తే బంధానికి కారణమవుతుంది. నేను సుఖిని, నేను జ్ఞానిని, నేను నిర్వికారుణ్ని, నిరామయుణ్ని అనే అహంకార భావంతో జీవుని బంధిస్తుంది. సుఖాసక్తితో జ్ఞాన సక్తితో దేహ బంధాన్ని పెంపొందిస్తుంది. సత్త్వ గుణం బంగారు సంకెలవంటిది. సత్త్వ గుణం లభించాలంటే పుణ్యమనే సొత్తు ఉంటేనే లభిస్తుంది. దీనిని దాటటం చాలా కష్టం. ఇది ఒక విచిత్రమైన బంధం. గూఢంగా, గుప్తంగా బంధిస్తుంది. బంధంలాగా కానరాని బంధమిది. సత్త్వ గుణం స్వచ్ఛమైన స్ఫటికలాగా నిర్మలంగా ప్రకాసిస్తుంది. అంతః కరణ ధర్మమైన సుఖము జ్ఞానము అనే వానియొక్క అభ్యాసమే (భ్రాంతియే) సంగమం అనబడుతుంది. నేను సుఖిని, నేను తెలుసుకున్నాను, అనేదే సంగంయొక్క ఆకారంగా ఉంటుంది. ఇవి ఆత్మ ధర్మాలు కావు. అందుచే సత్త్వ గుణం కూ డా జీవుని బంధిస్తుంది. 'A' Class Jail లాంటిది. అహంకారంతో నేను తెలివి కలవాణ్ని, ప్రతిభాశాలిని, జ్ఞానిని, భక్తుణ్ని, సాత్వికుణ్ని, నిరహంకారిని, నిరభిమానిని, నిగర్విని అనే స్వభావం కలవాడు. సత్త్వగుణం ప్రధానులు **"సాత్వికం నిర్మలం ఫలం"** వివేక జ్ఞానంతో అహంకారం నశింపజేసుకొని శుద్ధ సత్త్వంలోకి పోవాలి.

(ii) రజోగుణము

రజోగుణం రాగాత్మకమైంది. జీవుడు ఈ రాగవృత్తి ద్వారా తన స్వభావం నుండి జారి దృశ్యవస్తువులతో తాదాప్యం పొందుతూ కర్మలు





ఆచరిస్తాడు. రాగముఎప్పుడు అంకురిస్తుందో ద్వేషము కూడా కలుగుతుంది. రాగద్వేషాలే రజోగుణ స్వరూపం. కోటి కోటి జన్మలకు ఈ రజోగుణమే కారణం. అఖండ వస్తువును ఖండఖండాలుగా చూపించేది ఈ రజోగుణమే. మనస్సును విషమ భోగాలలో పడవేసి దుఃఖాలు పాలు చేస్తుంది. తృష్ణకు కారణం కూ డా రజోగుణమే. తృష్ణ అంటే ఆశ, కోరిక అని అర్థము. అది **"మహాశనా - మహా పాప్మా"**. కోరిన వస్తువులు వస్తూ ఉంటాయి పోతూ ఉంటాయి. కాని కోరికలకు మాత్రం ముగింపు లేదు. ఈ రజోగుణంతో కలిగే ఇంకొక వస్తువు "ఆశక్తి" లేని వస్తువును కావాలి అనుకోవటం తృష్ణ. దొరికిన వస్తువు మీద విశేషప్రీతి. ఆసంగమము అంటే ఆశక్తి ఈ రెండూ రజో గుణంలో వృద్ధి పొందుతాయి. రజోగుణ కర్మ సంగంతో ఫల సంగంతో జీవుణ్ని బంధిస్తుందిం. కర్మ సంగం అంటే కర్తృత్వభావంతో చేసిన కర్మలు - ఫల సంగం అంటే ఈ కర్మలవల్ల వచ్చిన ఫలమును నేనే అనుభవించాలి. ఇక్కడ భోక్తృత్వభావం కూ డా ఉంటుంది. ఈ విధంగా రజోగుణ దేహా శుద్ధైన జీవుణ్ని స్వస్వరూప స్థితి నుండి దిగజార్చి జనన మరణ రూప ప్రవాహంలో పడవేస్తుంది. ఆ విద్యా కామాలతో ప్రేరేపింపబడి కర్మ చేసేవాడు ఈ కర్మ చక్రం నుండి విడివడటం చాలా కష్టం. **రజస్తుఫలం దుఃఖం**

(iii) తమోగుణం

కేవలం అజ్ఞాన రూపమయినది. దేహదారులందరిని విలపింప చేస్తున్నది. ప్రమాదంలోనూ, సోమరితనం లోను, నిద్ర రూపంలోను, జీవుని బంధిస్తుంది. తమో గుణంతో అజ్ఞానం పెరుగుతుంది. అజ్ఞానంతో తమో గుణం పెరుగుతుంది. దీని మూలాన ఇంద్రియాలన్నింటిలో జడత్వం ఆవరిస్తుంది. **"అధోగచ్ఛతి తామసాః"**

అయితే ఎల్లప్పుడూ ఈ మూడు గుణాలు సామ్య స్థితిలో ఉండవు.

ఏదో ఒకటి మిగతా రెండిటికంటే ఎక్కువగా ఉండి మనస్సులో కూర్చుంటుంది Musical Chair లాగా. అప్పుడు ఆయా గుణ ప్రవృత్తి వల్ల ఆయా కర్మలు చేస్తాడు. **ఉదాహరణకు**:- ఒకడు సాయంకాలం ఒక దేవాలయంలో వేదాంత ప్రవచనం జరుగుతోందని వెళ్ళటానికి నిశ్చయించుకుంటాడు. అక్కడకు వెడతాడు. ఇది ఆ సమయంలో మనస్సుకు సత్వగుణం, మిగతా రెండిటికంటే ఎక్కువగా ఉండటంవల్ల ఆ సంకల్పము ఆ కార్యము జరిగింది. శ్రద్ధగా వేదాంత శ్రవణం వింటున్నాడు. అరగంట అయేసరికి నిద్దుర మైకం వచ్చి జోగుతున్నాడు. వేదాంత శ్రవణం చేయకుండా అప్పుడు తమోగుణం ఆధిక్యత వల్ల ఆ కార్యము జరిగింది. ఇంతలో ప్రక్కనున్న ఇంకొక శ్రోత ఇతనిని తట్టి లేపాడు. వెంటనే మెలుకువ తెచ్చుకొని కాసేపు ప్రవచనం విన్నతరువాత చేతి గడియారం Time చూసుకొని చేయవలసిన అర్జంటు కార్యం జ్ఞప్తికి వచ్చి ప్రవచనాన్ని పూర్తిగా వినకుండా లేచిపోయాడు. ఇది ఆసమయంలో అధిక్యంగా ఉన్న రజోగుణ ప్రభావమే. కాబట్టి తన మనస్సులో కలిగిన భావాలవల్ల సంకల్పాలవల్ల ఏ గుణం ప్రవృద్ధమై ఉందో తెలుసుకోవచ్చు. వివేక జ్ఞానంతో బలవంతంగా అయినా స్వత్త్వ గుణ ప్రాధాన్యత సంపాదించుకొని దానినుండి శుద్ధ సత్త్వంలోకి పోవాలి. దీనికి పురుషయత్నం తత్పరత ముఖ్యం.

సత్త్వగుణం ప్రవృద్ధమై ఉండగా జీవుడు మరణిస్తే మహదాది తత్వవేత్తలయొక్క పుణ్యలోకాలను పొందుతాడు. రజోగుణం ఉద్భుతమై ఉన్న సమయంలో మరణిస్తే మనుష్యులలో కర్మ యోగులైనవారిలో జన్మిస్తాడు. తమోగుణం ఉద్భుతమైనప్పుడు దేహం విడిస్తే పశ్వాది మూఢయోనులలో జన్మిస్తాడు. ఈ మూడు తెగలవారికి పునర్జన్మ తప్పదు. మోక్షార్హత లేదు. కాబట్టి ఈ త్రిగుణాలే సమస్త కర్మలకు కర్త. జీవుడు కర్త





కాడు. తాను ద్రష్ట. క్షేత్రజ్ఞుడు. తాను గుణాలకంటే అతీతుడని వాటికి విలక్షుడునని, అకర్తనని సద్గురువుద్వారా తత్వ జ్ఞానోపదేశం పొంది అనుభవం ద్వారా తెలుసుకున్నవాడు ఆత్మజ్ఞాని. అతనికి కర్తృత్వ, భోక్తృత్వాలు కల్పించటం అజ్ఞానంతో కూడిన పని. ఈ మూడు గుణాలు అతిక్రమించి నిర్గుణుడయి బ్రతికి ఉండగానే ప్రత్యగ్దృష్టిచేత సర్వమూ "నేనే" ఈ సర్వమూ "బ్రహ్మ స్వరూపమే" అని నిర్వికల్ప సమాధి ద్వారా అనుభవ పూర్వకముగా తెలుసుకున్న జ్ఞాని జన్మ మృత్యు దుఃఖాలనుండి విముక్తుడవుతాడు. అతనికి రాగద్వేషాలు, అహంకార, మమకార అభిమానములు ఉండవు. ఇవి అంతఃకరణ వృత్తులు. కాబట్టి ఇతరులెవ్వరకూ అతని భావాలు తెలియవు. అటువంటివాడు ఉదాసీనుడుగా ఉంటాడు. వాటి కార్యాలవల్ల చలించడు. నిర్వికారంగా తటస్థంగా ఉంటాడు. సుఖదుఃఖాలను సమానంగా చూస్తాడు. ఆత్మయందే ఎల్లప్పుడూ ప్రసన్నుడై ఉంటాడు. అతనికి రాతిబెడ్డ, బంగారం అన్నీ సమానమే. ప్రియా ప్రియములందు సమభావముంటుంది. మానవానామనములందు ఏవిధమైన వికారముండదు. మిత్ర శత్రు పక్షములందు కూడా సమభావముంటుంది. మంచిగాని చెడుగాని సర్వ కర్మలను పరిత్యజించినట్టి యతి గుణాతీతంతో సన్యాసిగాని, కర్మయోగిగాని అయినవాడు సమస్త భూతముల హృదయాలలోను ఉండే పరమాత్మను స్థిర బుద్ధితో భక్తి యోగం ద్వారా సేవిస్తే మోక్షాన్ని పొందటానికి అర్హుడౌతాడు. నాశ రహితుడు నిర్వికారుడు. నిత్యుడు అయినట్టి జ్ఞాన యోగంచేత పొందదగినట్టి ఆనంద స్వరూపం కలిగినట్టి అవ్యభిచారియైన పరమాత్మకు ప్రత్యాగాత్మ స్వరూపుడయిన అతనుకు ఏమాత్రం భేదం లేదని పరమాత్మే ప్రత్యాగాత్మ, ప్రత్యాగాత్మే పరమాత్మ అని ఎవడు తెలుసుకుంటాడో అతను ముక్త పురుషుడు, గుణతీతుడు. సమస్త బంధములు పోయి మోక్షార్హుడు.

# 4. దైవీ సంపద - అసురసంపద

మోక్షార్హత కలగాలంటే దైవీ సంపద సంపాదించాలి. దైవీ సంపద అసురసంపద అనేవి రెండు రకాలు. దైవీ సంపద పరోక్ష జ్ఞానానికి హేతువు అవుతుంది. ఇది నివృత్తి మార్గము. అసుర సంపద ప్రవృత్తి మార్గము. ఇది అధోలోకాలకు నీచజన్మలకు దారి తీస్తుంది. దైవీ సంపద అసుర సంపద వివరాలు ఈ క్రింద వివరిస్తున్నాను.

**1. దైవ సంబంధమైన ప్రకృతి కలవారి ముఖ్య గుణాలు**

1. నిర్భయం-భయంలేకపోవటం
2. అంతఃకరణ శుద్ధి
3. జ్ఞానయోగమందు నిష్ఠ
4. దానము
5. దమము - బాహ్యేంద్రియ నిగ్రహము
6. యజ్ఞము - అగ్నిహోత్ర వైశ్వ దేవాదులు
7. స్వాధ్యాయం - వేదాలను అధ్యయన చేయటం
8. తపస్సు
9. ఆర్జవము - ఋజుభావం - సరియైన నడవడి
10. అహింస
11. సత్యం
12. అక్రోధం - కోపము లేకుండుట
13. త్యాగము
14. శాంతి - అంతఃకరణయొక్క ఉపశమనం
15. అపైశము - ఇతరులమీద చాడీలు చెప్పకుండుట
16. భూతదయ
17. అలోలత్వం - ఎదురుగా విషయాలున్నా వాటిఎడల ఇంద్రియ వికారములు లేకుండుట
18. మృదు స్వభావం





19. హ్రీ - లజ్జ
20. అచపలం - చాంచల్యము లేకుండా ఉండటం
21. తేజస్సు - ప్రాగల్భ్యం
22. క్షమ - ఓర్పు
23. ధృతి - ఇంద్రియాలు అలసిపోయినా ధైర్యంగా ఉండటం
24. శౌచం - బాహ్యాంతరములందు శుచిగా ఉండటం
25. అద్రోహం - ఇతరులకు ద్రోహం చేయాలని తలంపు లేకుండటం
26. నాతిమానిత - అతి మానిత్వం లేకపోవటం. పూజ్యులందు నమ్రత కలిగి ఉండటం

ఈ గుణాలను దైవీ ప్రకృతి కలవారికుండేవి. తీవ్ర ముముక్షువు మోక్షార్హతను పొందేవాడు ఈ గుణాలను ఆత్మ విమర్శన చేసుకుంటూ తనలో ఎంతవరకూ ఉన్నాయో వివరించుకొని తీవ్ర సాధనాలద్వారా ఈ గుణాలను అభివృద్ధి చేసుకుంటూ అసురీ సంపదను విడనాడాలి. దైవీ సంపద జ్ఞానాధికారాన్ని కలిగించి సంసార బంధనాలనుండి విముక్తి కలిగిస్తుంది

**అసురీ సంపద:**

1. దంభము - ప్రగల్భాలు పలకటం - గొప్పలు చెప్పుకోవటం
2. దర్పము - ధన సౌందర్యాదులకు సంబంధించిన గర్వం
3. అతి మానము - తాను చాలా గొప్పవాడననే మిధ్యా జ్ఞానం
4. క్రోధము
5. పౌరుష్యము - పరుషంగా, కఠినంగా మాట్లాడటం
6. అజ్ఞానం - మంచి చెడులను విమర్శించి తెలుసుకోలేకపోవటం

అసురీ సంపద బంధనానికి హేతువు అవుతుంది. అభ్యుదయ సాధనమైన వైదిక ధర్మాన్నిగాని (ప్రవృత్తి) మోక్ష సాధనమైన వైదిక ధర్మాన్ని గాని (నివృత్తి) తెలుసుకోలేరు. బాహ్యం అంతర శౌచానికి సంబంధించిన స్నాన సంధ్యావందనాలు, అహింసాదులు, మనువు మొదలైన పెద్దలు

చెప్పిన సదాచారములు, సత్యాభాషణ మొదలైన మంచి గుణాలు ఉండవు. అంటే అశుచిగా ఉండేవారు, అనాచారులు, స్నాన దైవ ప్రార్ధనలు లేనివారు, మాయావులు, అసత్యవాదులు, అసుర ప్రవృత్తి కలవారై ఉంటారు. తాము అసత్యావాదులైనట్లే జగత్తులోని వారందరూ అసత్యావాదులని, ధర్మమనేది అధర్మమనేది ఏదీ లేదనేది నాస్తికులై కామోద్రేకంతో స్త్రీ, పురుష సంయోగం చేతనే జగత్తు అంతా పుడుతోందని, కాబట్టి కామమనేది ఈ సృష్టికి కారణమని ఇతర కారణాలేమీ లేవని అంటారు. దుష్ట స్వభావులై, వివేక హీనులై, విషయ వాంఛలకు లోబడినవారై, పరహింసాపరాయణులై, లోక శత్రువులుగా వ్యవహరిస్తారు. ఎన్నడూ హద్దు లేనట్టి కాముని ఆశ్రయించి క్షుద్ర దేవతారాధకులై, దంభంతోనూ, మదంతోనూ కూడిన వారై అవివేకం వల్ల మోహంలో చిక్కుకుని, అవైదికమైన వ్రతాదులను ఆచరిస్తూ అపవిత్రమైన పనులు చేస్తూ ఉంటారు. అట్టి మూఢులు కేవలం అశుచివృతులే కాదు, కామోపభోగమే జీవితం యొక్క పరమపురుషార్ధం అని తలచినవారై విషయాల వలనే సుఖం కలుగుతుందని. శరీరంకంటే వేరొక భోక్త ఎవరూ లేరని శరీరమే ఆత్మ అని నిశ్చయించుకున్నవారై ఈ శరీరం ఉండగానే కోరికలన్నీ అనుభవించాలని తలచి వాటికోసం జీవితమంతా వ్యయపరుస్తూ మరణమనేది ఉన్నదనే విషయాన్ని మరచి సంచరిస్తూ ఉంటారు. ఆశలనెడి వందలకొలది త్రాళ్ళచేత బంధింపబడినవారై కామక్రోధాదులచేత ఆకర్షింపబడి వాటికి చిక్కి ఇతరుల ధనాన్ని అపహరించటం మొదలైన అన్యాయాలద్వారా ధనాన్ని సంపాదించి స్రక్చందన వనితా భోగాలకోసం ఖర్చు పెడుతూ ఉంటారు. ఇప్పుడు ఈ డబ్బు నాకు లభించింది. అంతకంటే ఎక్కువగా సంపాదించాలి. ఈ ధనంతో తృప్తినిచ్చే కోరికలను తీర్చుకోగలను. భవిష్యత్తులోఇంకా చాలా ధనం సంపాదించి





ఇంకా ఎక్కువ భోగాలు, కీర్తి ప్రతిష్ఠలు పొంది విఖ్యాతుణ్ని కావాలి అని కర్మలు చేస్తూ ఉంటారు. నా శత్రువు ఫలానావాడు నా చేతిలో వాడు మృతుడయ్యాడు. వాడికంటే ఇతర అల్పులైన ఇతర శత్రువులను కూడా హతమార్చాలి, నేనే ఈశ్వరుడును, నేనే ప్రభువును. నా మాటకు, నా చేతకు ఎదురులేదు. నేనే పరమ భోగిని. నా పుత్ర పౌత్రాదులు కూడా నావల్ల సంపన్నులవ్వాలి. నేను బలవంతుడను, నేను కారణ జన్ముడను అని తలపోస్తూ దుష్కర్మలాచరిస్తారు. నేను గొప్ప ధనవంతుణ్ని, నేను ఉత్తమ వంశంలో పుట్టాను, నాతో సమానమైనవాడెవ్వడూ లేడు. నేను ఇతరులకు మించిన యజ్ఞయాగాదులు చేసాను. ఇక ముందుకూడా చేస్తాను. నాట్యకత్తెలకు, నటులకు కవులకు నన్ను స్తుతిస్తూంటే వారికి ధనం ఇస్తాను. వారి పొగడ్తలవల్ల సంతోషం పొందుతాను అని అనుకొంటూ అజ్ఞానంతో భ్రమలతో విమోహితుడయి ఉంటారు. ఇలా అనేక రకాల భ్రాంతులతో కూడిన చిత్తా వృత్తులకలవారై అవివేకమనే - మోహమనే వలలో చిక్కినవారై స్రక్చందన వనితా భోగాలయందు మిక్కిలి ఆశక్తి కలవారై మిక్కిలి అపవిత్రమైన వైతరణ్యాది, రౌరవాది ఘోరనరకాల్లో పడతారు. తమ గొప్పతనాన్ని, తమ గుణాలను తామే పొగుడుకుంటూ, నమ్రభావం లేనివారై మాట్లాడుతారు. ధన గర్వంతో అభిమానంతో, మదంతో కూడినవారై ఉంటారు. విధివిహితులు కానట్టి ఆడంబరముతో కూడినట్టి మంచి చెడ్డల విచారణ లేనట్టి, దంభంతో కూడిన యజ్ఞ దీక్షితులై నామమాత్రముకైనా యాగాలు చేస్తూ ఉంటారు. అహంకార, మమకారాలతో అన్ని అనర్ధాలకు మూలమైనట్టి ఇతరులను లెక్క చేయక ధర్మాన్ని అతిక్రమించి, విచ్చలవిడిగా దర్పముతో, కోరికలతో, కోపాలతో అనేక అనర్ధాలకు మూలమైన ద్వేషంతో, అసూయతో మంచివారియెడల

అసూయాభావంతో భగవంతునిపైన ద్వేషంతో ఉంటారు. క్రూ ర కర్మలు, పాప కర్మలు ఆచరిస్తారు. ఈ విధంగా మూఢులు మాటిమాటికి ప్రతి జన్మయందు అసురయోని పొందుతూ తమోగుణ ప్రధానములైన పశ్వాది జన్మలు పొందుతూ అవివేకులైనందున ఈశ్వరుని పొందలేక శాశ్వతంగా నీచ స్థితిని పొందుతున్నారు. ఈ అసుర ప్రవృత్తి కారణాలు, కామ, క్రోధ, లోభములనే మూడు దుర్గుణాలు. ఇవి నరక ప్రాప్తికి సాధనాలు. ఆత్మ నాశనానికి ఇవే కారణం. అవే అధర్మ ప్రవృత్తికి కారణమై మోక్ష ప్రతిబంధకాలవుతాయి. శాస్త్రములు విధించిన కర్మలు ఆచరించకుండా కామ ప్రవృత్తి కలవారై తను ఇష్టమువచ్చినట్లు శాస్త్ర నిషిద్ధ కర్మలాచరిస్తారు. సుఖాన్ని, శాంతిని పొందలేరు. కాబట్టి ఈ అసుర ప్రవృత్తిని మూల కారణాలయిన కామ క్రోధ లోభాలను పరిత్యజిస్తేనే తప్ప అజ్ఞాన, మోహ, ప్రతిబంధకాలనుండి విముక్తి కాలేరు.





## 5. భక్తి

సామాన్యంగా ప్రతీవారిలోకూ డా ఎంతో కొంత భక్తి ఉంటుంది. అది అవసరమయినప్పుడే భగవంతునిగూర్చి యోచించి ఆయన్ని కోర్కెలతో అర్థిస్తారు. తనకు అన్ని పరిస్థితులు అనుకూ లముగా ఉండి కష్టాలు లేకుండా సుఖంగా సకుటుంబంతో జీవన యాత్ర జరుగుతున్నంత కాలం భగవంతుడి గురించి యోచించడు. ఏదయిన కష్టమొచ్చినప్పుడు లేదా తీర్చలేని సమస్యకు ఎదురయినప్పుడు భగవంతుని తలచుకొని మొక్కులతో ముడుపు కట్టి ఆ కష్టాన్ని దాటటానికి ప్రయత్నిస్తాడు. ఆకష్టం తొలగిపోగానే భగవంతుణ్ని మరిచిపోతాడు. ఈశ్వరుణ్ని సేవించేవారు సామాన్యంగా నాల్గు తరగతులుగా ఉంటారు. 1. ఆర్తులు 2. అర్థార్థి 3. జిజ్ఞాసువు 4. జ్ఞాని. ఆర్తులంటే కష్టకాలంలో భగవంతుణ్ని తలచుకొని అది తీరగానే ఆయనను మరచిపోవటం. ఏదో ఒక ఫలితం ఆశించి సంకల్పంతో సత్యన్నారాయణస్వామివారి వ్రతమనో, యజ్ఞమనో మరి ఏ ఇతర కార్యక్రమమో ఇష్టదేవతానుగ్రహం కొరకు చేసే కార్యములు అర్థకాములు. లెక్కలేనన్ని జన్మలెత్తి ప్రతీ జన్మలోను భగవంతుని కొరకు ఆరాటపడి భగవతత్త్వం ఎలాగుంటుంది? నేనంటే ఎవరు? ఎక్కడినుండి వచ్చాను? నాగమ్యమేమిట? వాసనాక్షయం అంటే ఏమిట? చిత్తశుద్ధి కల్గటంతో భగవతత్త్వాన్ని ఏ విధంగా తెలుసుకొని అనుభవించాలి ? నాకు ఆ మార్గము చుపించే గురువు ఎక్కడ లభ్యమవుతాడు? అనే ఏకైక కోర్కెతో అలమటించే వారు జిజ్ఞాసువులు. జ్ఞానాన్ని అనుభవపూర్వకంగా సద్గురుతత్త్వ భోధవల్ల తెలుసుకొని అపరోక్ష జ్ఞానం పొంది పరమాత్మలోఐక్యమావటనికి చేసే సాధనాపరులను జ్ఞానులంటారు.

అయితే పరమాత్మ తత్త్వం అవ్యక్తం. కంటికి కనిపించదు. అందుచేత సాధారణంగా మొదటి రెండు తరగతుల వారికి (ఆర్తులు - అర్థకాములు) విశ్వాసముండదు. నాస్తికులకు కూ డా భగవంతుడంటే నమ్మకముండదు. కనిపించనంత మాత్రాన పరమాత్మ లేదనటానికి వీలులేదు. గాలి కనిపించదు కాని అది లేనిదే బతకలేము. అందులోనే మసలుతున్నాము. అందుచేత ఆ చైతన్య శక్తి (అంటే పరమాత్మ) లేని స్థలము లేదు. నీలో ఉంది నాలో ఉంది. సర్వే సర్వత్రా ఉంది. మనమందరము పరమాత్మలోనే ఉన్నాము. ఆ పరమాత్మ చైతన్య శక్తి వలననే మనము పనులు చేసుకోగలగుతున్నాము. అదిలేనిదే మనకు మనుగడ లేదు. ఇది జ్ఞానులు మాత్రమే తెలుసుకొని అనుభవించగలరు. ఆ స్థితికి వారిలో ఉండే పరమాత్మ యందుండే అనన్యభక్తి, జిజ్ఞాస, నిస్వార్థ సత్కర్మానుష్టానము కారణము. అయితే భగవంతుని యందుండే భక్తి సాధారణంగా ఈ కింది విధంగా ఉంటాయి.

i. సామాన్య భక్తి ii. అనన్య భక్తి iii. మానస భక్తి

సాధారణంగా జీవులందరూ సామాన్య భక్తులే. ఏ కొద్ది మంది మాత్రమే అనన్య భక్తితో ఉంటారు. ఈ సామాన్య భక్తి ఏ విధంగా ఉంటుందో కొంచెం విపులంగా చర్చించుకుందాము.

ఒకని గృహంలో ఒక ప్రత్యేక గదిలో దేవతా మూర్తుల విగ్రహాలు, ఫొటోలు ఏర్పాటు చేసుకొని రోజు ఉదయం 4 గంటలకు లేచి కాలకృత్యములు తీర్చుకొని 5 గంటలకల్లా సగుణారాధన పూజలు చేస్తుంటాడు. అతని కార్యక్రమము షుమారు 4 గంటలు. అంటే ఉదయం 9 గంటల వరకూ పూజ చేస్తూ ఉంటాడు. అతనికి స్వంత ఇల్లు ఉంది కాబట్టి ప్రత్యేకగదిలో ఈ ఏర్పాటు చేసుకోవటం జరిగింది. అతను ఒక





ఆఫీసులో ఆఫీసరుగా పూర్వ జన్మ సంస్కారం కొద్ది ఉద్యోగం చేసుకుంటున్నాడు. ఈ నాల్గు గంటల కాలంలో మొదటి 40 నిమిషాలు తాను అక్కడ ఆసనంపై స్థిరపడడానికి, దేవతా మూర్తుల విగ్రహాలను తుడుచుకోవటం, పూజాసామాగ్రి సిద్ధ పరచుకోవటం, పూజకోరకై అష్టోత్తర, సహస్రనామాల పుస్తకాలు అందుబాటులో ఉంచుకోవటం కొరకు కాలం వ్యయమవుతుంది. తరువాత పూజ మొదలుపెడితే ఎడంచేతిలోని పుస్తకంలో నామం చదువుతూ కుడి చేత్తో విగ్రహంపై పూలు విసరటం యాదృచ్ఛికంగా జరుగుతూ ఉంటుంది. దృష్టి మనస్సు కేవలం పుస్తకంలోని నామం చదవటంపై ఉంటుంది. ఈ లోగా హారతి కర్పూరం వెలగడంలేదనో, గంధం సరిగా తీయలేదనో, అక్షతలు సిద్ధం చేయలేదనో, ఏదో ఒక లోపంపై కుటుంబ సభ్యుల మీద విసుక్కోవడం, చిరాకుపడడం జరుగుతుంది. పోనీ అవన్నీ సమంగా అమరినపప్పుడు కిందట రోజున ఆఫీసులో జరిగిన సన్నివేశాలు సమస్యలు మనస్సు జ్ఞాపకం చేస్తే మళ్లీ పూజ అవగానే ఆఫీసుకు వెళ్లి ఏం చేయాలో మనస్సుతో యోచించుకుంటూ అభ్యాసంతో నోటితో యాదృచ్ఛికంగా నామం చదువుతూ చేత్తో పూలు వేస్తూ Mechanical గా జరుగుతూ ఉంటాయి. మనస్సు మాత్రం ఆఫీసులో ఉంటుంది. ఇది కొంత కాలమయిన తర్వాత తెలుసుకొని మళ్లీ ప్రయత్న పూర్వకంగా మనస్సుని పూజ కొరకై వినియోగించగానే ఎవరో ఫోను చేస్తున్నారు, అర్జంటుగా రండి అని భార్యామణి గారు చెప్పగానే ఫోన్లో మాట్లాడి రావటానికి కొంతకాలం వ్యయమవుతుంది. ఆ రోజు పూజా కార్యక్రమములు ఇంకా పూర్తికాలేదే Time అపుడే 8.30 గంటలయింది మిగతా Items తొందరగా పూర్తి చేయాలని ఇంకా ఇతర దైవాలు మీద సహస్రనామాలు ఇతరస్తోత్రాలు చాలా ఉండటం వల్ల అతి Speed గా

పూర్తి చేయటానికి ఉపక్రమించి అయిందనుకొని 9 గంటలకు పూర్తి చేస్తాడు. ఈ పూజ కూ డా గణపతి స్తోత్రం, తరువాత శివనామాలు, ఆ తరువాత లలితసహస్ర నామాలు. శివుని మాత్రం పూజిస్తే విష్ణువు ఏమనుకుంటాడో అని విష్ణు సహస్రనామాలు, శని అనుగ్రహం కొరకు శని అష్టోత్తరం ఈ విధంగా అనేక దేవతా మూర్తులపై ఉంటుంది పూజ. ఉదయం 5 గంటల నుండి 9 గంటలవరకు చేసిన పూజా కార్యక్రమములో తాను తనని మరచి, మనస్సు దేవతా విగ్రహం మీద లయింపచేసి బాహ్యస్మృతి అంటే శరీరస్పృహ లేకుండా భగవంతునిలో ఎంతకాలం నిల్వకలిగాడు. కనీసం 5 నిమిషాలు కూడా ఉండలేదు. అంటే భగవంతుని దృష్టిలో లెక్కలోకి వచ్చేది 5 నిమిషాలే కాని ప్రజల దృష్టిలో ఉండే నాల్గు గంటల లెక్కలోకి రావు. ఆ తరువాత 9 గంటలనుండి సాయంత్రం 6 గంటలవరకూ దేహాత్మ బుద్ధితో, సంగమంతో, కర్తుత్వంతో కర్మలు చేస్తు ఉంటాడు. అపుడు దైవంపై దృష్టి రాదు. సాయంత్రం 6గంటల నుండి 8 గంటల వరకూ పురాణ కాలక్షేపానికి గాని హరి కథాకాలక్షేపానికి భగవత్ భక్తితో పోయే అలవాటు ఉండనుకుందాం. అవి కూడా ఎప్పుడో గాని జరుగవు పర్వ దినాలలో తప్ప. అప్పుడు వెళ్లినా ఆ రోజు హరికథలో కీచకవధ చెపుతున్నారు. ఆ రోజు భక్తిభావం కలగచేసే సంఘటనలేదు. పూర్తిగా కీచకుడియొక్క రజోగుణ కార్యక్రమము కామప్రవృత్తి జరుగుతోంది. అవి కథలు. ఆ కథలో నవరసాలు పాత్రాభినయన సంఘటనలు మాత్రమే ఉంటాయి. ఆ విధంగా 2 గంటలు కార్యక్రమము పూర్తి చేసుకొని 8 గంటలకు ఇంటికి వచ్చి, విశ్రాంతి తీసుకొని, భోజనం పూర్తిచేసి భార్యబిడ్డలతో ముచ్చటించి పడుకునేటప్పటికి రాత్రి 11 గంటలవుతుంది. అప్పటినుండి ఉదయం 4 గంటలవరకూ సుషుప్తిలోకి జారుకుంటాడు.





మళ్లీ లేచిన తర్వాత పైన చెప్పిన కార్యక్రమమే. ఇలా గడిచిన 24 గంటలలో ప్రపంచదృష్టిలో అతను మంచి దైవభక్తుడు. ఉదయం 4 గంటలు సాయంకాలం 2 గంటలు మొత్తం 6 గంటలు దైవారాధన చేస్తాడు. చాలా గొప్పవాడనుని కొనియాడబడతాడు. కాని భగవంతుని దృష్టిలో దైవభక్తి గణనలోకి వచ్చేది 5 నిమిషాలు మాత్రమే. పోని కనీసం 30 నిమిషాలు ఇచ్చామనుకోండి ఇది పునర్జన్మలేని మోక్షానికి సహాయ పడుతుందా అని పరిశీలించుకుంటే చాలదని ఖచ్చితంగా సమాధానమొస్తుంది. ప్రతివారు ఈ విషయం తీవ్రంగా ఆత్మవిమర్శన చేసుకొని తగు విధంగా పూజా కార్యక్రమాలు భగవంతుని కృపకొరకై సవరించుకోవాలి.

కొంతమంది భగవంతుని యందు భక్తితో కొబ్బరికాయ కొట్టాలనుకుంటారనుకోండి. అక్కడ ముదురు కొబ్బరికాయ కొంటే మనకు వచ్చే కొబ్బరిచిప్పతో పచ్చడి చేసుకోవచ్చు కదా అని స్వార్థంతో కొబ్బరికాయలు కొంటారు. ఎప్పుడయినా సత్యనారాయణ స్వామి వారి వ్రతము చేసుకుంటారనుకోండి. అక్కడ పురోహితుడు చెప్తున్న మంత్రాలు, నామాలు పైగాని, భగవంతుని యందుగాని శ్రద్ధ ఉంచుకోడు. అప్పుడువచ్చిన బంధు మిత్రులను పరామర్శించటానికి వారి మర్యాదల మీద మనస్సుని లగ్నం చేస్తాడు. పురోహితుడు కూ డా ఓంకార నామాన్ని స్వచ్ఛంగా పలుకడు. మంత్రాలలో అపస్వరాలు చోటు చేసుకుంటూ ఉంటాయి అక్కడక్కడ. వ్రతము పూర్తవగానే తనకు వచ్చిన కానుకలను ఖేరీజు వేసుకుంటాడు. ఈ విధంగా ఉంటాయి చేసే వ్రతాలు కూ డా.

**అనన్య భక్తి** అంటే సర్వ భారము ఇష్టదైవంపై వేసి తనకు ఏమీ లేదని ఎల్లప్పుడూ అంటే నడుస్తున్నా, ప్రయాణం చేస్తున్నా, ఏ పని చేస్తున్నా

ఇష్ట దైవనామాన్ని జపం అంతర్గతంగా ఎల్లవేళల విసుగు విరామం లేకుండా మనస్సులో చేసుకుంటే అది క్రమేపీ వాసనాక్షయమయి, చిత్తశుద్ధి కలుగచేసి పరోక్షజ్ఞాన ప్రాప్తికి తీసుకొని వెడుతుంది. ఎల్లప్పుడు ఒకే ఇష్టదైవము యొక్క నామమే స్మరించాలి. కొన్ని రోజులు శివుడునన్ని, కొన్ని రోజులు విష్ణువనిన్నీ, కొన్నిరోజులు ఆంజనేయస్వామి వారనన్నీ వ్యభిచారము చేయకూ డదు. సర్వ దేవతలు ఆపరమాత్మ స్వరూపులే అని కృతనిశ్చయంతో ఏదో ఒక నామాన్ని స్వీకరించి నామ జపం చేయాలి. ఆయన్నే శరణు వేడాలి. సర్వభారం ఆయనమీదే అచంచల విశ్వాసంతో వేయాలి. ప్రతి జీవిలోనూ ఆ ఇష్టదైవాన్ని సందర్శించాలి. సర్వకర్మల ఫలితం ఆయనకి సమర్పించాలి. అంటే ఆయనకు పూర్తి శరణాగతి అవాలి. దీనినే అనన్య భక్తి అంటారు. ఈ మాదిరిగా సాధన చేసేవారు బహుతక్కువ. అనన్య భక్తి ద్వారా పురోగమించటం చాలా మంచిది.

**మానసిక పూజ** - దీనికి బాహ్య ఆడంబరాలు అక్కరలేదు. ఇది వీలయినపుడల్లా ఎక్కడబడితే అక్కడ చేయవచ్చు. మడి ఆచారం స్నానం మొదలైనది కూ డా అక్కరలేదు. ధనవ్యయమేమీలేదు. పూజా ద్రవ్యాల సేకరణ వగైరాలకు ఇంకొకరి సహాయం అవుసరముండదు. ఇది కేవలం మనస్సుతో భావనతో చేసే పూజ. అది ఎలాగ? మీరు ఉచితాసనం మీద అంటే మీకు ఎలాకుర్చుంటే సుఖంగా ఉంటుందో ఆ విధంగా ఆసీనులవ్వాలి. మనస్సుని ఇష్టదైవమూర్తిని కల్పించుకొని ఆయన స్వరూపాన్ని మీ మనస్సులో ప్రతిష్టించుకోవాలి. మీ సంకల్పంతో అంతర్గతంగా విశాలమయిన స్థలంలో మామిడి తోరణాలతో, అరటి స్తంభములు కట్టి - వివిధ రంగులతో ఆకర్షణీయంగా అలంకరించబడిన విశాలమయిన పందిరిని శోభాయమానంగా ఉండునట్లు భావనతో





సృష్టించుకోవాలి. అటువంటి పందిరిలో రత్నాలు, మణులు అమర్చి దివ్యకాంతితో మెరిసే ఒక బంగారు సింహాసనం ఉన్నట్లు భావన చేయాలి మనస్సుతో. అంటే ప్రతిష్టించుకోవాలి. అపుడు మీ ఇష్టదైవాన్ని సాదరంగా, ప్రేమగా స్వాగతం పలుకుతూ, మంగళవాయిద్యాలతో, భక్తితో, ఆర్తితో వారిని సింహాసనం మీద ఆసీనులను చెయ్యాలి. ఇవన్ని సంకల్ప మాత్రం చేత సిద్దిస్తుంది, సింహాసనం మీద ఆసీనులయిన వెంటనే నవరత్నాలతో పొదగబడిన దివ్యకాంతులు విరజిమ్మే కిరీటధారియై మీవంక చిరునవ్వుతో తృప్తిగా చూస్తునట్లుగా యోచించుకుంటూ ఇతర ఆలోచనలు రానీయక ఆయన పాదములకు సాష్టాంగ నమస్కారములు ఆచరిస్తున్నట్లుగా తన్మయులై ఆయనను తదేక దృష్టితో ఆర్తితో భక్తితో చూస్తున్నట్లుగా భావనతో దృశ్యం కలిగించుకోవాలి. వారి సింహాసనము మీద ఆసీనలవగానే బంగారు పళ్లెములో వారి పాదములుంచి బంగారు బిందెలతో వారి పాదములుపై నీరుపోస్తు మెల్లగా వారికి నెప్పి లేకుండా పాదములు పూర్తిగా కడిగి ఆ కడిగిన నీరు మీ శిరస్సుపై జల్లుకొంటునట్లుగా భావన చేస్తు, సంకల్పిస్తూ, ఆదృశ్యము మీ మనోనేత్రంతో చూస్తూ తరించాలి. ఆ తరువాత మెత్తని కొత్త ఉత్తరీయముతో వారి పాదములును మృదువుగా మెల్లమెల్లగా వారికి నెప్పిలేకుండా తుడవాలి. ఆ వస్త్రాన్ని కళ్లకు అద్దుకొని, తన శిరస్సుపై ధార్యము చేసినట్లు మనస్సుతో ఏకాగ్రతతో చూడండి. ఆ తరువాత అర్ఘ్యాదులు సమర్పించి పూజలు మొదలుపెట్టండి. అభిషేకములు పంచామృతములతో చేయండి. బంగారు బిందెలతో ఆవుపాలు మనస్సులో సృష్టించుకొని అభిషేకం చెయ్యండి. ఆ తరువాత తేనె, చెక్కర, ఆవునెయ్యి, కొబ్బరినీరు, ఆవు పెరుగు, చెరుకురసం, మామిడిరసం, కొబ్బరి నీరు, గంగనీరు బిందెలతో తెచ్చి మనస్సులో

సృష్టించుకొని అభిషేకం మీ మనస్సుతృప్తి కలుగునట్లుగా చెయ్యండి. దీనికి ఏమీ ఖర్చు కాదు. వస్తువులు దొరకవు అని లేదు. చెరకు, మామిడిపళ్లు season కాదు అనే యోచనక్కరలేదు. మీ సంకల్పంతో భావనతో మనస్సే సృష్టిస్తోంది. పంచామృత స్నానాంతరం శుద్ధోదకస్నానం. ఆ తర్వాత ఉత్తరీయంతో వారి దేహమంతా తుడిచి, నూతన వస్త్రములు అంటే జరీ అంచు పట్టు పీతాంబరాలు వారికి కట్టి, గంధం తిలకాలు తీర్చిదిద్ది, సువర్ణ ఆభరణాలు ధరింపచేసి, బంగారు యజ్ఞోపవీతం వేసి సింహాసనంపై ఆసీనులు చేయండి. ఆ తరువాత, వివిధ రకాలయిన పరిమళ సువాసనలతో కూడిన, మల్లి, సంపెంగ, సన్నజాజి, చామంతి, గులాబీ, ఎర్రకమలాలు, తెల్ల కమలాలు, అనేక రకాలయిన పువ్వులను బుట్టలతో వారిని మీ మనస్సును సంతృప్తి పడినట్లుగా మీ వంక చిరునవ్వుతో చూస్తూన్నట్లుగా ప్రోక్షిస్తు ఆయనను చూడండి.మనస్సుతో సృష్టించేవి కాబట్టి పువ్వుల కొరతలేదు. ఆ విధంగా ఆయన సర్వాలంకార భూషితుడయి, నవరత్న ఖజిత సింహాసనము మీద కూర్చొని మీ వైపు మందహాసంతో చూస్తునట్లుగా యోచించుకుంటూ, ఆ దృశ్యము అలాగే నిల్పుకొని తన్మయం చెందండి ఆ దశలో వారిని ఏమీ లౌకిక కోర్కెలు సమస్యలు నివేదించుకొని దిగజారకండి. పునర్జన్మలేని మోక్షప్రాప్తి కలుగచేయమని ఎల్లకాలం ఆదృశ్యం మీ మనస్సులో స్థిరపడేటట్లు మరీమరీ ప్రాధేయపడుతూ వేడుకోండి. ఆ తరువాత వారి దగ్గరకూర్చొని, ప్రేమతో, భక్తితో పంచభక్ష పరమాన్నములలో, పళ్లతో కొంచెం కొంచెం వారి యొక్క చేతితో వారి నోటలో పెట్టుకొని ఆరగింపు చేస్తున్నట్లుగా వారు తృప్తితో స్వీకరిస్తున్నట్లుగా మనసుతో దృశ్యము చూడండి. తన్మయులు కండి. ఆ తర్వాత తాంబులం, హారతి ఇవ్వండి. ఆ అఖండ జ్యోతిలో దేదీప్యమానంగా





వెలుగుతూ కనిపించే దివ్య సుందర విగ్రహాన్ని తనివితీర వీక్షించండి. వారు చిరునవ్వుతో వారి కుడి హస్తంతో అభయముద్రతో ఆశీర్వదిస్తున్నట్లు గమనించండి. మనస్సుతో యోచించండి. మీకై మీరు ఉద్వాసన చెప్పవద్దు. మీకు దేహభ్రాంతి కలుగనంత వరకు ఆ దృశ్యంలో లీనంకండి. అది ఎంతకాలం నిలచిఉంటుందో మీరు అంత అదృష్టవంతులు. ఇపుడు యోచించండి. ఈ విధమైన మానసిక పూజకు ధనం కావాలా? పూజాద్రవ్యాలు కావాలా? ఇతరుల సహాయం కావాలా? అంతఃదృష్టి ఉంటే చాలు కదా! అన్ని మీ సంకల్పంతో బావనతో మనస్సే సృష్టించింది కదా! దీనికి మంచి తిధి, వార, నక్షత్రాలు కావాలా? ఫలానా చోట చెయ్యాలి అని నియమముండాలా? Train లో ప్రయాణం చేస్తూ వెల్లకిలా పడుకొని కూడా మీలో మీరు మానసిక పూజ చేసుకోవచ్చు కదా! ఇక్కడ జరిగిందేమంటే మీ మనస్సు అన్నీ సమకూర్చుకొని ఇష్ట దేవతామూర్తిని సృష్టించుకొని, తృప్తి తీరా షోడశోపచార పూజ చేసి ఆ దేవతామూర్తిలో లయమయింది. బాహ్యప్రపంచం, దేహ స్ఫురణ మరచింది ఇది నిజమైన పూజ. ఇదీ పరమాత్మ లెక్కలోకి వస్తుంది. కాని ప్రపంచ దృష్టిలో వీడు ఏమీ పూజలు చెయ్యడు. భగవంతుని అనుగ్రహానికి ఈ మానసిక పూజే మంచిది.

అయితే ఇక్కడ ముఖ్యమైన విషయం గ్రహించాలి. నిష్కామసత్ కర్మానుష్ఠానము వలన పాపక్షయమయి చిత్తశుద్ధి కలుగుతుంది. సత్ అంటే సత్యము బ్రహ్మము. నిష్కామంతో సత్కర్మలు ఆచరించటం వలన పాపక్షయమవుతుంది. చిత్త శుద్ధి కలుగుతుంది. లౌకిక కర్మల వల్ల చిత్తశుద్ధి కలుగదు. అది కర్తృత్వ బుద్ధితో చేయటం వలన పునర్జన్మకు కారణమవుతుంది. ఇదిప్రవృత్తి మార్గము. భక్తి ఉండబట్టే సత్కర్మానుష్ఠానమునకు బుద్ధి

పుడుతుంది అనేక జన్మలు పశు, పక్షి, కీటక, చెట్టు మొదలయిన జన్మలెత్తి గత జన్మలో చెసుకున్న సత్కర్మానుష్ఠానము భక్తితో చేసినందువల్ల అనేక లోకాలు తిరిగి తిరిగి ఇపుడు ఈ మానవజన్మలోకి రాగలిగాము. అనేక జన్మల పుణ్యపరిపాకము వలన గాని ఈమానవ జన్మ లభ్యం కాలేదు.

అయితే భక్తి వల్ల మోక్షం కలగదా అంటే భక్తి సగుణోపాసన వలన మోక్షం కలగదు. అక్కడ అనన్య భక్తితో ఆరాధించేదేవతే తానని అనుభూతి కలిగినా అక్కడకూ డా భగవంతుని దయ ఉంటేనే కాని నిర్గుణోపాసనలో మనస్సు లగ్నమయి అహంబ్రహ్మాస్మి అనే మహావాక్యం అనుభవంలోకి తెచ్చుకుంటేనే గాని మోక్షార్హత కలుగదు. ఇక్కడ తాను బ్రహ్మకంటే వేరుకాదు "నేను" అంటే ఆ పరబ్రహ్మనే అని అనుభవంలోకి వచ్చినా సరిపోదు. ఇంకా సాధనవల్ల పరమాత్మ కృపతో ఈ చూడబడే దృశ్యమానజగత్తంతా కూడా పరబ్రహ్మ కంటే వేరుకాదు. **సర్వం ఖలిద్వం బ్రహ్మ - అయమాత్మ బ్రహ్మ - సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ - ప్రజ్ఞానం బ్రహ్మ** - అనే మహావాక్యాలుకూ డా అనుభవంలోకి రానంతవరకు సాధన, అనన్య భక్తి ఉండాలి. తద్వారా భగవత్కృప లభ్యమవుతుంది. అదే జ్ఞాన నిష్ఠలో పరాకాష్ఠ. పునర్జన్మ లేని జీవన్ముక్తి స్థితి. ఈ కింది పటము పరిశీలించండి.







# 6. గర్భోపనిషత్తులోని కొని ముఖ్య విషయాలు

దేహము అనేక క్రిమి కీటకాదులచే నిండి ఉంది. ఇందులో సదా దుర్గంధమయిన మలమూత్రాదులతో నిండి ఉంది. ఎముకలు, మాంసము, క్రొవ్వు, మజ్జ, రక్తము మొదలయిన పదార్థములను చర్మముచే కప్పబడి ఉన్నది. శ్లేష్మ కఫ పిత్తాదులకు ఆశ్రమయి ఉన్నది. ఇది ఒక జడ పదార్థము. మలమూత్ర భాండవత్ అన్నారు. దుఃఖాలమయమైన ఈ దేహము శాశ్వతము కాదు. ఎన్ని పదార్థాలతో స్నో పౌడరు వగైరాలుతో అలంకరించినా ఏదో ఒక రోజున దేహమును విడిచిపోవలసినదే. శరీరములోని చైతన్యముంటేనే (జీవాత్మ) శరీరం కదులుతుంది. ఆ చైతన్యము (జీవుడు) నిష్క్రమించగానే శరీరము శవమై పడిపోతుంది. అంతవరకూ దానిని ప్రేమించిన మోహించిన దారా పుత్రాదులు బంధువులు ఎవరూ భయంతో దగ్గరికి రారు. ఆ శరీరాన్ని చితిపై దహించి వేస్తారు లేదా భూస్థాపితం చేస్తారు. లేదా కొన్ని దేహాల్ని వెంటనే జలసమాధులవుతాయి వాటి వాటి ప్రారబ్ద కర్మానుసారం. ఈ దేహాన్నే స్థూల శరీరం అంటారు. ఇది ఒక పనిముట్టు మాత్రమే. జడ పదార్థము. ఈ స్థూలశరీరంలో ఇంకొక శరీరము ఉంది. దాన్ని సూక్ష్మ శరీరము లేక లింగ శరీరము అంటారు. ఈ సూక్ష్మ శరీరము యొక్క అంగాలేమంటే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, పంచజ్ఞానేంద్రియాలు, పంచప్రాణాలు. ఇవికూడా జడపదార్థాలే. ఈ సూక్ష్మ శరీరంలోని అంగాలు జీవాత్మ అనే చైతన్య శక్తియొక్క సన్నిధానం వలన కదలిక శక్తి ఏర్పడి పని చేస్తున్నాయి. దాన్ని కారణ శరీరము అంటారు. ఈ శరీరత్రయ విచారణ ఇంకొకచోట 9వ ప్రకరణలో చెప్పకున్నాము. ఇంతకీ





విశదీకరించేదేమంటే పూర్వజన్మలలో చేసిన కర్మ ఫలితాలను అనుభవించటానికి ఒక స్థూల శరీరం కావాలి. ఆ స్థూలశరీరము కర్మ ఫలితాల బట్టి మానవ శరీరం కావచ్చు. దేవతా శరీరం కావచ్చు లేదా పంది, కుక్క మొదలైన జంతు శరీరం కావచ్చు లేదా గాలిలో విహరించే పక్షి శరీరాలు కావచ్చు లేదా జలంలో నివశించే చేప మొదలైన శరీరాలు కావచ్చు వృక్ష సంబంధమైన శరీరాలే కావచ్చు. కాబట్టి కర్మ ఫలితాల బట్టి ఆయా శరీరాలు ఏర్పడతాయి. అయితే ఈ కర్మ ఫలితాలను అనుభవించేది కర్మలు చేసేది సూక్ష్మ శరీరమే కాని స్థూల శరీరము కాదు. స్థూల శరీరము ఒక పనిముట్టు మాత్రమే. అందుచేతనే ఈ సూక్ష్మ శరీరము కారణశరీరముతో ఈ స్థూల శరీరం నుండి నిష్క్రమించినపుడు ఈ స్థూల శరీరం నిర్జీవంగా పడిపోతుంది. దానినే మరణమంటారు. ఒకరితో ఒకరు ఇద్దరు మనుష్యులు దెబ్బలాడు కుంటున్నారు అనుకోండి వారి స్థూల శరీరాలు కొట్టుకుంటున్నాయి. దుర్భాషలాడు కుంటూన్నారు అని చూచే వారందరూ అనుకుంటూ ఉంటారు. కాని ఆ ఇద్దరు తెచ్చుకున్న పూర్వజన్మ వాసనా ఫలితంగా సూక్ష్మ శరరాలు దెబ్బలాడుకుంటున్నాయి తప్ప స్థూల శరీరాలు కాదు. ఈ స్థూల శరీరాలు కాని సూక్ష్మ శరీరాలు కాని పంచ భూతాలలో నిర్మితమయి ఉన్నది. దీనినే పంచభూతాల పంచీకరణ అంటారు. పంచీకరణ అనే విషయాన్ని ఇంకొకచోట 9వ ప్రకరణలో విపులంగా చర్చించుకుందాము.

ఈ స్థూల శరీరము గర్భోత్పత్తినుండి ఏ విధంగా జరుగుతుందో, గర్భోపనిషత్తులోని కొన్ని విషయాలు విశదీకరించుకుందాము. ఈ శరీరములు పంచభూతాత్మకమైనది. అందుచేత దీనిని పాంచభౌతిక శరీరమన్నారు. ఏ ఏ భూతంవల్ల ఏ ఏ పదార్థాలు ఏర్పడుతాయో కింద చూపబడినది.

| | | పంచభూతాలు |
|---|---|---|
| 1.కఠినముగా ఉండునది | ధరించుట యందును | పృధివి |
| 2.ద్రవముగా ఉండునది | ముద్దగా చేయుట యందును | జలము |
| 3.ఉష్ణముగా ఉండునది | రూపములు చూచుట యందును | అగ్ని |
| 4.సంచరించునది | సంచరించుటయందును | వాయువు |
| 5.అవకాశము ఇచ్చునది | అవకాశము ఇచ్చుట యందును | అకాశము |

ఈ దేహము ఆరింటిని i. తీపి ii.పులుపు iii. ఉప్పు iv. కారము v. వగరు iv. చేదు ఆశ్రయించి ఉన్నాయి. ఈ దేహము ఆరు వికారములు గలది.

i. అస్తి = ఉండుట

ii. జాయతే = కలుగుట

ii. వర్థతే = వృద్ధి పొందుట

iv. పరిణమతే = పక్వమగుట

v. అవక్షీయతే = కృశించుట

vi. వవశ్యతే = నశించుట





శుక్ల శోణిత సంయోగము వలన గర్భము కలుగుచున్నది. అది ఒక రాత్రి ఉంటే బుగ్గ అవుతుంది. 15 దినములకు పిండమగుచున్నది. ఒకమాసమునకు గట్టిదగుచున్నది. రెండు నెలలకు కాళ్లువచ్చుచున్నవి. నాలుగు నెలలకు కడుపు, నడుము వచ్చుచున్నని. ఐదవనెలలో వెన్నెముక, ఆరవనెలలో, ముక్కు, కళ్లు, చెవులు ఏడవనెలలో ప్రాణము ఎనిమిదవ నెలలో శరీరము యొక్క అవయవములన్నియు సంపూర్ణముగా రాగా తొమ్మిదవ నెలలో సంచరించుచున్నది (గర్భోపనిషత్తు ఆధరంగా)

గర్భములో నున్న శిశువు యొక్క బ్రహ్మారంధ్రమునుండి సుషుమ్నా నాడిమార్గమున జీవాత్మ (సూక్ష్మ శరీరము) తనవాసనామయమయిన కర్మ ఫలితాలను అనుభవించుటకు ప్రవేశిస్తుంది. ఆ శిశువు పంచ భూతమయుడును, సమర్థుడును అగుచున్నాడు. శబ్ద స్పర్శ గంధరసముల అన్ని అవయవములు పూర్తి అవుతున్నాయి. పరమాత్మ స్వరూపమయిన ప్రణవమును తెలుసుకొనుచున్నాడు. అప్పుడు సమ్యక్జ్ఞానము వలన తన పూర్వ జన్మల స్మృతులు కలిగి పూర్వ కర్మల, భవిష్యత్కరముల పాపపుణ్య కర్మలును తెలుసుకొని ఈ విధంగా విచారణ చేస్తాడు.

"నేను లెక్కలేనన్ని స్త్రీల యోనులందు దర్శించాను అనేకరకముల ఆహారములను భుజించాను. అనేక స్తనముల పాలను పానము చేశాను. ఈ సమస్త పృధివియు నా జన్మభూమి. సమస్త భూమియు స్మశాన భూమియే. 84 లక్షల జీవరాసులలో జన్మించాను. ఎన్ని యోసారులు గర్భనరకమనుభవించి సంసారియై ఉండి, పుట్టుట, చచ్చుట, మరల పుట్టుట ఈ ప్రకారము నా కాలము గడిచిపోయింది. గర్భవాసము మహా దుఃఖకరముగా ఉన్నది. జన్మలయెత్తుట వాటి దేహములందలి మోహము మహా దుఃఖకరము. బాల్యమందు దుఃఖము, శోకము, పారవశ్యము,

అనుసరించి ఏ మార్గంనుంచి వచ్చాడో ఆ మార్గంలోనే మరొక యోనిలో ప్రాణంతో కూడిన అవయవాలతో ప్రకటమవటం కోసం వెళ్లిపోతాడు. ప్రాణాది అవయవాలు ఉంటేనే కాని కర్మఫలాన్ని అనుభవించటానికి వీలులేదు కాబట్టి ఆ శరీరం కోసం వెతుక్కుంటూపోతాడు. ఈ ఆత్మ-జీవాత్మ దుర్బలమయినట్లుగా అయి సమ్మూర్ఛస్థితిని చెంది - వివేకంపోయి, ఏమీ తెలుసుకోలేని స్థితికి వచ్చినట్లుగా అయినప్పుడు మనం స్పృహ లేదు అంటాము. ఆత్మ దుర్భలమవటం అనేది ఉండదు. ఆత్మకు విమూఢస్థితి అంటూ ఉండదు. ఇంద్రియాలు దుర్భలమటం వల్ల అదే ఆత్మ దుర్భలమయినట్లుగా చూచేవారికి మాత్రం కనిపిస్తుంది. వాక్కు మొదలయిన ప్రాణాలు ఆ ఆత్మఎదుట చేరతాయి. కండ్లు మొదలైన ఇంద్రియాలు తమలోని తేజస్సును అంటే రూపాది గ్రహణశక్తులన్నిటిని ఉపసంహరించుకొని హృదయంలో అభివ్యక్తమయ్యే విజ్ఞానమయునిలో (ఆత్మలో) చేరిపోతాయి. ఆ స్థితిలో వారణా సన్నుడైన పురుషుడు రూపాలకు సంబంధించిన జ్ఞానాన్ని కోల్పోతాడు. మనం వాడికి కంటిచూపు పోయింది అంటాము. అంటే స్వప్నావస్థలో లాగానే నేత్రాల్లోను ఇతర ఇంద్రియాల్లోను ఉండే జ్యోతి ఉపసంహరింపబడుతుంది. అపుడు అతనికి చూపు పోయిందని, మాట పోయిందని అంటాం. అదే విధంగా ఘ్రాణేంద్రియ లింగాత్మకతో ఏకీభావం చెందగానే వాసన చూసేశక్తి పోయిందంటాం. రసనేంద్రియం సూక్ష్మ శరీరంతో ఏకీభావం చెందగానే రుచి చూసే శక్తి పోయింది మ్రింగుడు పడటం లేదంటాం. వాగేంద్రియం, శ్రోత్రేంద్రియం, మనస్సు, త్వగేంద్రియం, బుద్ధి లింగాత్మతో కలసిపోగానే, మాట పడిపోయిందని, వినిపించటం లేదని, ఆలోచనాశక్తి నశించిందని, ఏమీ తెలియని స్థితిలో స్పృహ లేకుండా ఉన్నాడని Coma లోకి వెళ్లిపోయాడని





అంటారు చూచేవారందరు. ఆస్థితిలో జీవాత్మ హృదయం నుండి బయటకు పోవటానికి మార్గం చక్కగా ప్రకాశవంతంగా ఉంటుంది. ఆ స్థితిలో ఆ జీవాత్మ నేత్రం ద్వారా గాని, శిరస్సు గుండా గాని, లేక ఏ ఇతర ఇంద్రియ ద్వారాల గుండా గాని బయటకు వచ్చేస్తుంది. జీవాత్మ బయటకు రాగానే ప్రాణం కూడ బయటకు వచ్చేస్తుంది. దానితో కూడా ఇతర ఇంద్రియాలు కూడా బయటకు వచ్చేస్తాయి. ఆ స్థితిలో ఆ జీవుడు మంచి విజ్ఞానవంతుడుగా ఉంటాడు. అతనితో పాటు జ్ఞానము, కర్మ, పూర్వజన్మలలోని అనుభవాల వలన కలిగిన సంస్కారాలు, పూర్వజన్మల కర్మల ఫలితాలు కూడా తీసుకుపోతాడు. ఇంద్రియాలలోని తేజోమాత్రల నన్నింటిని గ్రహించి ఉండటం వల్ల స్వప్నావస్థలో ఆత్మజోతిగా లేక స్వయం ప్రకాశ స్థితిలో ఉన్నట్లే లింగ శరీరాన్ని ధరించి ఉన్న ఆత్మ నిర్గమన ద్వారం వద్ద భావిదేహ విషయకమైన జ్ఞానంతో కూడిఉంటుంది. ఆ లింగాత్మలో ఆత్మ చైతన్య జ్యోతి ఎప్పుడు అధికంగా ఉంటుంది. అయితే ఆ లింగపురుషుడు స్వతంత్రుడయితే ఏ విధమయిన వాసనలు లేకుండా విజ్ఞాన వంతుడయితే కృత కృత్యుడైనట్లే ఆ స్థితి అందరికి లభించదు. ఎవరో యోగులకు తప్ప. ఆ లింగాత్మ వాసనలతో కూడి ఉండటంవల్ల జనన మరణాలు, రాకపోకలు మొదలైన వికారాలు మార్పులు కలుగుతున్నాయి. ఆ జీవాత్మ శరీర సంబంధం లేకుండా నిష్క్రమించటానికి నిర్గమన ద్వారం వద్ద భావి దేహ విషయమై తాను నిమగ్నుడై ఉంటే ఇక్కడ బంధువులందరూ శరీర సంబంధీకులు ఏడుస్తూ ఇంకా ఇంజక్షనులు ఇప్పిస్తూ, ఇంకా స్పృహలోకి వస్తాడేమోనని గ్లూకోజు వగైరాలు నరాల ద్వారా ఎక్కిస్తూ ఉంటారు. ప్రారబ్ధ కర్మ తీరిపోయిందని యోచించరు. ముందు జాగ్రత్త పరులు అతని Pass Book ఎక్కౌంట్లు, Cash మొదలైనవన్ని

జాగ్రత్త చేసుకుంటూ ఉంటారు. వారివరి ప్రయోజనాల నిమిత్తమై. అయితే ఆ జీవాత్మ ఈ శరీరం వదలి ఇంకొక శరీరం (తాను కర్మ వాసనల బట్టి అభిమానించిన) శరీరంలోకి ప్రవేశిస్తాడు. ఎలాగంటే ఒక గొంగళిపురుగు ఒక ఆకు మీద చివరకు పోయి మరియొక ఆకును పట్టుకొని ఆశ్రయాన్ని పొంది శరీరాన్ని ముడుచుకుంటుంది. దానితో మొదటి ఆకు మీద ఉన్న దాని శరీరం పట్టు తప్పిపోతుంది. రెండవ ఆకుమీద పూర్తిగా ఆధారాన్ని పొందుతుంది. అలాగే జీవాత్మలో గడుపుతున్న శరీరాన్ని చంపి దానిని అచేతనంగా చేసి రెండవ శరీరాన్ని ఆశ్రయంగా పొంది మొదటి శరీరం నుండి తన్ను తాను ఉపసంహరించుకుంటుంది. అంటే క్రొత్త శరీరంలో ఆత్మ భావాన్ని పొందుతుంది. ఇదే జీవుడు దేహాంతర ప్రాప్తి. మరియొక శరీరం పొందే పద్ధతి. కొత్త శరీరం తాను చేసుకున్న పుణ్యపాపకర్మల ఫలితాల వల్ల కలుగుతుంది. పితృదేవతల రూపంగాని, గంధర్వ రూపంగాని, దేవతారూపంగాని, మానవ రూపంగాని, ప్రేత, రాక్షస, పిశాచ, నీచ జంతువులు, వ్యాఘ్రము, నక్క, పంది, కుక్క, పక్షుల శరీరం లేదా వృక్ష సంబంధమైన శరీరం అతని కర్మని బట్టి, ఉపాసనను బట్టి లభిస్తాయి. పట్టాభిషిక్తుడయిన రాజు తన రాజ్యంలోనికి వెళ్లేటప్పుడు రాజుయొక్క సేవకులైన ఉగ్రులు, పాపకర్మ కర్మలు చేయటానికి నియక్తులయిన సూతులు ఇతర గ్రామాధికారులు భోజన భాజనాదులు నివాస వసతులు సిద్ధం చేసుకొని ఇదిగో రాజుగారు వస్తున్నారు. అదిగో రాజు గారు వస్తున్నారు, రాజు కోసం ఎదురుచూస్తున్నట్లుగా ఒక శరీరాన్ని వదలి వేరొక శరీరాన్ని పొందటానికి వచ్చే ఆత్మని చూసి సమస్త భూతాలు, ఆ శరీర అధిష్ఠాన దేవతలు ఇదిగో పరమాత్మ, పరమాత్మ వస్తున్నారు. ''బహుపరాక్'' ''బహుపరాక్'' అంటూ స్వాగతం పలుకుతూ ఎదురు చూస్తూ ఉంటారు.





ఈ విధంగా వచ్చే రాజుగారి ముందు నడుస్తూ వెళ్లే ఉగ్రులు, సూతులు ఇతర గ్రామాధికారులలాగా ఉర్ధ్వ శ్వాస తీసుకోవటం ప్రారంభించగానే అంత్యకాలంలో సమస్త ప్రాణాలు, చక్షు ఇంద్రియాలన్నీ ఈ జీవాత్మకు ముందుగా నడుస్తూ కొత్త శరీరంలో ప్రవేశిస్తాయి. అటువంటి జీవాత్మ ఇంద్రియాలతో తాదాప్యంచెంది కొత్త శరీరం మీద అభిమానంతో పాతవాసనల బలీయంగా ఉండటంవల్ల సంగమంతో కర్తృత్వంతో మళ్లీ కర్మలు చేసి మళ్లీ **"పునరపి మరణం పునరపి జననం"** అన్నట్లుగా అనేక జన్మలెత్తుతూ ఉంటాడు. మనస్సే ప్రధానంగా కల లింగ దేహం దేనియందు మిక్కిని ఆసక్తి కలిగి ఉంటుందో దానియందే అభిలాషని ప్రకటిస్తూ, కర్మతో బాటు దానిఫలాన్నికూ డా పొందుతుంది. అంటే ఆసక్తికి తగిన అభిలాష ఆ కోరికకు తగినట్టి ఫలం ఇదిక్రమం అనివార్యం.

అయితే కోరికలు లేనివాడు నిష్కాముడు. తత్త్వజ్ఞాని స్వస్వరూపానందం అనుభవించి కోరికలన్నీ వాటితో బాటు వాసనాక్షయమయి ఆగామి సంచిత కర్మలన్నీ నశించి ప్రాణఉత్క్రమణ చెందగానే మరొక దేహం పొందటం జరగదు. కర్మ శేషం లేదు కాబట్టి మరొక జన్మ ఎత్తనవసరం లేదు. అటువంటి నిష్కాముడు తత్త్వవేత్త బ్రహ్మ సరూపాన్ని పొంది బ్రహ్మమే అవుతాడు. అతడు అమృతుడు మోక్షం పొందుతాడు.

(బృహ దారణ్యకోపనిషత్తు ఆధారంగా)

# 7. సాధన చతుష్టయ సంపత్తి

సంసారబంధముల నుండి విముక్తి కలిగి మోక్షము పొందవలెనని తీవ్ర ముముక్షువు ఈ కింద చర్చించబడిన సాధన చతుష్టయ సంపత్తిని కలిగి ఉండాలి.

i. నిత్యా నిత్యవస్తు వివేకము ii. ఇహాముత్రార్థ పలభోగ విరాగము iii. శమాదిషట్క సంపత్తి (అంటే శమము, దమము, తితిక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము) iv. ముముక్షత్త్వము

ఎవరికి పై చూపిన సాధన చతుష్ట సంపత్తి సంపూర్ణముగా ఉంటుందో వానికే సంసారబంధము నుండి విడుదల అనేటటువంటి ఫలమును పొందును కాని సాధనములు తక్కువగా ఉన్నవారికి మాత్రము కాదు. అవి ఈ కింద విపులముగా చర్చించుకుందాము.

### i. నిత్యా నిత్య వస్తు వివేకము -

సచ్చిదానంద రూపమగు పరబ్రహ్మమొకటే సర్వకాలముల యందును సత్యమై ఉంది. తద్భిన్నమగు ప్రపంచమంతయు అశాశ్వతము అసత్యము అని వివేచన చేసి తెలిసికొనిటయే సత్యాసత్య వస్తు వివేకము. మట్టితో చేసిన కుండలో కుండ కూడా ఇదివరకు లేదు. మట్టి మాత్రము ఉన్నది. మట్టి కారణ పదార్థాము. కూడా పగిలిపోయినచో కుండలేదు. మట్టి మాత్రముంది. కాబట్టి మట్టి నిత్యము కుండ అనిత్యము. నామ రూపాత్మకమైన జగత్తు అంతా పరబ్రహ్మ వలన పుట్టినదగుటచే అనిత్యము. అన్ని కాలములో పరబ్రహ్మ మాత్రము స్వతఃసిద్ధమైనదగుటచే నిత్యము. సృష్టించబడినది అనే ప్రతి వస్తువు అనిత్యము. అంటే అది ఇదివరకు లేదు. కొంతకాలము తరువాత ఉండదు. అంటే సత్యము లేదన్నమాట.





త్రికాలములలో ఉన్నటువంటిదే సత్యమవుతుంది. జాగ్రదవస్థలో జగత్తు ఉంది. స్వప్నావస్థలో సప్న ప్రపంచముంది. స్వప్నంలో జాగ్రద్ప్రపంచం లేదు. జాగ్రదవస్థలో ఉన్న జగత్తు స్వప్న జగత్తులో లేదు. సుఘప్తిలో రెండు ప్రపంచములు లేవు. కాని వీటన్నటిలో జరగే కార్యకాపాలును **"నేను"** అంటే బ్రహ్మము సాక్షి రూపంలో చూస్తున్నాను. అంటే బ్రహ్మము నిత్యుడు. కాబట్టి సత్యము. పుట్టుచున్న ఘటాది పదార్థములన్ని నశిస్తున్నాయి. వైకుంఠము స్వర్గలోకములు మొదలుగా గల లోకములన్నీ అనిత్యములే. ఈ విధంగా శృతులచేత యుక్తులచేత విచారణాబలంతో నిత్యానిత్య వస్తు పరిజ్ఞానముచే ముముక్షువు నిర్ణయించుకోవాలి. అలా చేయటం వలన అనిత్య వస్తువులపై వైరాగ్యము పుట్టుకొస్తుంది.

### ii. ఇహాముత్రార్థఫలభోగ విరాగము

అనిత్య వస్తువులందు దోష దర్శనచే తీవ్ర వైరాగ్యము కలుగుతుంది. ముక్తిని గోరే వారు ఇహ పరలోకభోగ పదార్థముల నిజ స్వరూపమును బాగుగా పరిశీలించనచో వాటియందలి దోషములు స్పష్టముగా కనిపిస్తుంది. దోష దర్శనముచే ఆ వస్తువులందు వాంఛ కలుగదు. ప్రతి మానవుడు తనతల్లి గర్భమునందున్నప్పుడు మలమూత్రముల మధ్య ఉంటున్నాడు. వాటి యందలి పురుగులచే బాధింపపడుచున్నాడు. అక్కడ అనుభవించు గర్భవాసనరకములను 6వ ప్రకరణలో విపులముగా చర్చించుకున్నాము. అందుచేత ముముక్షువుకు ఈ దోషదర్శనంతో మరల జన్మప్రాప్తి లేకుండా ఉండాలని తీవ్ర వైరాగ్యము ఉదయించిక మానదు. గర్భము నుండి బైటపడిన తరువాత శిశు అవస్థలో తన మలమూత్రములో పొర్లాడుతాడు. అటు ఇటు కదలలేక వెల్లకిలా పడుకొని నల్లులు, చీమలు, దోమలు కుడుతుంటే రోదిస్తూ ఉంటాడు. చెప్పటానికి వీలు లేకుండా

ఆ స్థితిలో మాటలు రావు కాబట్టి. కౌమార స్థితిలో పెద్దలయందు గౌరవము లేక యుక్తా యుక్త వివచక్షణా జ్ఞానముండదు కాబట్టి అనేకమైన వికారచేష్టలకు, చిన్నతనపు చేష్టలకు తల్లి తండ్రి సోదరులు మొదలైన పెద్దవారందరు తిట్టి కొట్టుచుండటచేత అనేక మానసిక ఇక్కట్లు పాలవుతాడు. ఈ అవస్థలు తలచుకుంటే చాలు ప్రతి వారికి వైరాగ్యము కలుగక మానదు. యౌవనము రాగా మదమాత్సర్యాలతో, ఈర్ష్యా ద్వేషంతో కోర్కెలు తీరక క్రోధంతో అనేక దుష్టకర్మలు చేసి స్త్రీలోలుడై దైవభక్తి లేక పునర్జన్మ హేతువైన పనులు చేస్తూ ఉంటాడు. ఈ స్థితిని విచారించినచో కూడా వైరాగ్యము తప్పక ఉదయిస్తుంది. వార్ధక్యములో శరీర పటుత్వము తగ్గి ఇంద్రియములు పనిచేయక అనేక వ్యాధులకుగురియై వికృతరూపాన్ని చెందుతాడు. ఈ ముసలితనమందు మనోప్రాబల్యం ఎక్కువగా ఉంటుంది. విషయభిలాష వృద్ధి పొందును కాని ఇంద్రియ పటుత్వము తగ్గటంతో ఏమి అనుభవించలేడు. బంధువులు, మనుమలు, మనుమరాండ్రు లెక్క చేయక అవమాన పరుస్తు ఉంటారు. పైగా ఈ ముసలితనములో శరీరము శిథిలమై పోవుటచే జ్వరము, సైయాటికా, మూలవ్యాధి, గుండెదడ, క్షయ, cancer మున్నగు భయంకర వ్యాధులు సంక్రమించి మనస్తాపము కలిగిస్తాయి. అట్టి స్థితిలో తనవల్ల ఉపకారం పొందిన భార్యాపుత్రాదులు సపర్యలు చేయక నిర్లక్ష్యము చేయుటచే అంతర్గతంగా కృంగిపోతాడు. తన పరిస్థితులు ఏమగునో అని మరణము తలుచుకొని కంపిస్తాడు. అట్టివార్ధక్యము తలచుకొనినచో ఎవరికి విరక్తి కలుగకుండును? మరణము సంభవించగానే స్థూల శరీరము నుండి సూక్ష్మ శరీరము లాగుచుండగా అవయవ బాగములందు అత్యంత బాధగా ఉంటుంది. అప్పుడు కలుగు మరణ వేదన వర్ణశక్యము కాదు. అపుడు





ఎవరూ అంటే బంధుమిత్రాదులు కాని, తనసేవా బృందము కాని ఎవరూ సహాయపడరు. తానే అమిత దుఃఖముతో శరీరమును అప్పటి వరకు దేహాభిమానము కల్గి దానితో తాదాప్యము చెందిదానిని వీడుటకు మరణ బాధను అనుభవింప వలసి వస్తుంది. ఈ దేహ సంబంధీకులయిన దారాపుత్రాది బంధువులు ఏమగుదురో అని విచారము వారిగురించి చేసిన పాపకర్మలకు ఏ ఏ నరకలోములకు పోవలయునో అని పరితపిస్తాడు. ఆబాధ వర్ణణాతీతము. అందుచేతనే మరణమంటే ప్రతిజీవికి అపరిమితమైన భయము కలుగుతుంది. ఈ స్థితిని తలంచుకుంటే తీవ్ర వైరాగ్యము ఉదయించక మానదు. బాగుగా విచారిస్తే స్వగృహమునకు చెరసాలకు బేధములేదు. చెరసాలలో మానవుడు ఇనుప సంకెళ్ళతో బాధింపబడిన వాడై స్వేచ్ఛలేక ఉంటాడు. గృహములో భార్యాపుత్రాదుల యందు ప్రేమపాశముచే సంగమంతో కర్తృత్వంతో గృహమందలి అభిమానముతో, క్షణకాలము తీరికలేక వారియోగ క్షేమముల కొరకై అనేక కర్మలాచరించి సంసారము నుండి విముక్తి పొందలేక ఉన్నాడు. మలము నందుండు పురుగుల మలవాసము మలభ్రమణము సుఖంగానే ఉంటుంది. అదే విధముగా మూఢజనులకు భార్యపుత్రాదుల యందలి వ్యామోహముచే అనేక దోషములతో కూడిన సంసారమునే సుఖమని భ్రమిస్తున్నారు. అందుచేత మానవులు ఇహలోక పరలోక భోగములందు తీవ్రమయిన విరక్తి కలగాలి. దృఢవైరాగ్యమే మోక్షమునకు మూల కారణము. అందుచేత మోక్షము కోరువాడు. నిత్యా నిత్యా వివేక జ్ఞానముచే కనిపించే జగత్తును మిధ్య అని నిశ్చయించుకొని అనిత్య వస్తువులందు విరక్తి పొంది, దేహాభిమానమును తెంచుకోవాలి. తీవ్ర విరక్తితో తప్ప మరియే ఇతర మార్గముల చేతను బన్ధము తొలగదు. జ్ఞానోదయము కలుగదు. ఎన్ని

శాస్త్రములు చదువు కొనిననూ వైరాగ్యము గనుక లేనిచో ప్రయోజనమేమియు లేదు. దృఢవైరాగ్యమే మోక్షనముకు మూలకారణము.

బంధువులను త్యజించి అరణ్యములకు పోయి తపఃసాధన చేయుట వైరాగ్యమనిపించుకోదు. అక్కడ నీ మనస్సు, బుద్ధి,అహంకారము మొదలైనవన్నీ నీలోనే ఉండి నీకు అక్కడి వస్తువుల యందు కోరికలు కలిగింపచేస్తూ చిత్తంలోని వాసనలు విజృభించి చీకాకుపరుస్తూ ఉంటాయి. అహంకార నాశనము, వాంఛారాహిత్యము వలననే సరి అయిన త్యాగము సిద్దించి ప్రశాంతత పొందగలము. ఆశలను, వాంఛలను, ప్రతిఫలాపేక్షలను తెంచుట, మోహము నశింపుచేసుకొనుట, సంకల్పత్యాగమే వైరాగ్యము. రాజ్యము, భవనము, అంతఃపురము, స్నేహితులు, బంధువులు చివరకు భార్యపుత్రులు, త్యజించినప్పటికి అది నిజమైన వైరాగ్యము కాదు. అవి స్వయంగా నీ దగ్గరకు చేరాయి. ప్రారబ్ద కర్మానుసారం ఋణాను బంధాలవల్ల వాటంతట అవే పోతాయి. శరీరాన్ని శుష్కింప చేయటం వైరాగ్యము కాదు. అమాయకమైన శరీరమును శుష్కింపచేసిన ఉపయోగం ఏమి ఉంది? ఆత్మజ్ఞానమునకు అడ్డంకి కాదు కదా! ఆత్మజ్ఞానాన్ని పొందేందుకు పనిముట్టు కదా! నీవు సంసారములో ఉండవచ్చుగాని సంసారము నీలో ప్రవేశించకూ డదు. అంటే నావ నీళ్లలో ఉండవచ్చు కాని నావలోకి నీళ్లు రాకూ డదు. నదిని దాటటానికి నావ అవుసరము కదా! అందుచే సంసారసాగరాన్ని దాటటానికి శరీరమనే నావ, తీవ్ర వైరాగ్యము అవుసరము.

iii. శమదమాదిషట్క సంపత్తి

ఇది ఏమంటే 1. శమము 2.దమము 3. తితిక్ష 4.ఉపరతి 5. శ్రద్ధ 6. సమాధానము. ఇవి ముముక్షవుకు ఉండవలసిన ముఖ్య లక్షణాలు.





(i) శమము:-

చిత్తము ఇతర వృత్తులను వదలి ఒకే రూపమగు వృత్తితో మొదటనున్న దేవ విగ్రహాములందు స్థిరముగా ఉంచుటయే శమము అంటారు. ఇది మళ్లీ మూడు విధాలు. ఉత్తమము, మధ్యము, అధమము అని. మనస్సును ప్రాపంచక విషయములకు సంబంధించిన సంకల్ప వికల్పములను విడిచి బ్రహ్మాకారమగు వృత్తితో గూడుకొని ఉండుటను ఉత్తమ శమము అంటారు. ఈ స్థితిలో జీవబ్రహ్మ బేధము భాసించదు. మనస్సులోని రజోగుణతమో గుణములు నశించిన తరువాత బ్రహ్మాకార మనోవృత్తిని నిరస్తరము అనుసంధానము చేయుటయే మధ్యమ శమము అనబడుతుంది. మనస్సును విషయములందు ప్రసరింపచేయక గురువుల సమీపమున వేదాన్త ప్రవచనాలు శ్రవణము చేయుచు విచారణ చేయుట. ఈ స్థితిలో చిత్తము రజస్తమో గుణ సంబంధము కలిగియే ఉంటుంది. కాబట్టి శమమునకు ధృఢవైరాగ్యము ముఖ్యము. అదిలేనిదే ఇది సాధ్యపడదు. శమమంటే అంతరింద్రియ నిగ్రహము, కామము, క్రోధము, మోహము, మదము, మాత్సర్యమనే అరిషడ్వార్గాలను జయించటం.

(ii) దమము అంటే బాహ్యేంద్రియ నిగ్రహము:-

దీనివలన అంతరన్ద్రియ నిగ్రహ రూపమగు శమము కూ డా సిద్ధిస్తుంది. శబ్ద లౌకిక విషయాల నుండి తన మనస్సును మరలించాలి. ఈ క్రింది పేర్కొనిన వాటిని విధిగా ఆచరించాలి. బ్రహ్మచర్యము, ప్రాణులను హింసించకుండుట, భూతములను దయతోచూ చుట, కపటము లేకుండుట, విషయములందు వైరాగ్యము కలిగి యుండుట మనోదేహముల పరిశుద్ధి, డంబము లేకుండుట, సత్యము పలుకుట, మమకారము లేకుండుట, నిరభిమానము ఈశ్వరుని ధ్యానించటము, బ్రహ్మవేత్తలతో సహవాసము,

మోక్ష శాస్త్రములయందే ఆసక్తి కలిగియుండుట, సుఖ దుఃఖములయందు వికారము పొందకుండుట, ఇతరులచే గౌరవములను కోరకుండుట ఈ ధర్మములను విధిగా పాటిస్తే చిత్తము నిర్మలముగా ఉంటుంది. బాహ్యాంతర శౌచము పాటించాలి. మనస్సునందు దుష్ట సంకల్పములను విడనాడాలి. అజ్ఞాన కార్యములగు దేహేంద్రియాదు లందుగల అభిమానము పరిత్యజించి మనస్సును నిర్మలముగా ఉంచుకొనుటయే అన్తశ్శౌచ్యము అనబడుతుంది. దంభము పూర్తిగా విసర్జించాలి.

(iii) **తితిక్ష:-**

చింత దుఃఖము లేకుండా శీతోష్ణాది సమస్త దుఃఖాలను, కష్టాలను సాధించటం ప్రారబ్ద కర్మ ప్రాబల్యమున సంభవించు సర్వ విధ దుఃఖములను విచారము లేకుండగను, ప్రతి క్రియలు చేయకుండగను, సహించుచుండుటయే తితిక్ష అంటారు. ముముక్షుజనులకు "సర్వ దుఃఖ సహనమగు" తితిక్షతో సమానమైన శత్రు నాశకరమగు వేరొక సాధనలేదు. అందుచేతనే మహానుభావులగు బుద్ధిమంతులు సంసారమను మహా యుద్ధమున తితిక్షా కవచధారులై కామక్రోధాది ప్రబల శత్రువులను పరాభవించి మాయా రాక్షసుని పరిమార్చ కలుగుచున్నారు. మోక్ష సాధనలో తితిక్ష సాధనము సర్వోత్కృష్టమైన సాధనము. ఈ తితిక్ష ధృఢముగా కలుగుటకు. రెండు సహాయ కారణములున్నాయి. అవి ఏమంటే 1. తీవ్రమగు మోక్షవాంఛ 2. లోక వ్యవహారములందు ఎంత మాత్రము సంబంధము కలిగించుకొనకుండుట. సర్వసంగ పరిత్యాగులగు సన్యాసులకు తితిక్ష అత్యన్తమావశ్యకము. మోక్షము కోరువారు పూర్వ జన్మ కర్మవశమున (ప్రారబ్ద కర్మవశమున) అనుభవించుచుండు దుఃఖ శేషములనెల్ల సహించుచు, ఆ దుఃఖ కారకులయిన వారిని నిందించక,





దేహాభిమానమును వీడి ఆ బాధలు దేహమునకు అప్పగించి సాక్షిగా చూస్తూ మనస్సుని తమ శక్తిననుసరించి ఆత్మలో నిలకడ కలిగి శ్రవణమననాధి ధ్యాపనములను ఆచరించాలి. దీనినే తితిక్ష అంటారు.

(iv) **ఉపరతి:-**

అంటే మిగతా కర్మలని విధిపూర్వకంగా పరిత్యజించడం. మనో వాక్కాయముల మూడింటిచేతను, సర్వ లౌకిక కర్మలను పరిత్యజించి నిరన్తరము స్వస్వరూపము విచారించుచుండుట ఈశ్వర ధ్యానమన బడుతుంది. ఉపనిషత్తులయందు చెప్పబడిన శ్రవణ మననాదులను నిరన్తరము అభ్యసిస్తూ, భేద దృష్టితో చేయదగు కర్మలందు ప్రవర్తింపక ఎవడు ఉంటాడో వాడు జ్ఞాన నిష్ఠ కలవాడగుచున్నాడు. బాహ్య విషయాలను చిత్త వృత్తిలలో ఆశ్రయించనీయకుండా ఉంటూ నిషిద్ధ కర్మలను పూర్తిగా పరిత్యజించి మనస్సు ఎల్ల వేళలా ఆత్మయందే నిలకడ కలిగి ఉండడం ఉపరతి అంటారు.

(v) **శ్రద్ధ:-**

శాస్త్రమందు గురువు చెప్పిన ఉపదేశంలోనూ వేదాంత వాక్యాల యందు సత్యత్వబుద్ధి కలిగి ఉండటాన్ని శ్రద్ధ అంటారు. గురువుగారి ఉపదేశంలో అచంచలమైన విశ్వాసముండాలి. అనుమానాలకు తావియ్యకూ డదు. అట్టి శ్రద్ధతో ఆయన ఉపదేశించిన విధముగా తీవ్ర సాధన చేస్తే వస్తుప్రాప్తి అంటే ఆత్మోపలబ్ధి కలుగుతుంది.

(vi) **సమాధానము :-**

బుద్ధిని ఎల్లప్పుడు అన్నివిధాలా శుద్ధ బ్రహ్మమందే స్థిరంగా ఉంచుకోవటాన్నే సమాధానం అంటారు. అంతేతప్ప చిత్తం కోరిన కోరికలన్నీ

తీరుస్తూ ఉండటం (ఇచ్ఛా పూర్తి అనేది) సమాధానం అనిపించుకోదు.

పైన చెప్పబడిన సాధన చతుష్టయ సంపన్నుడైనట్టి, ఆత్మతత్వ జిజ్ఞాసువైనట్టివాడు, స్థిత ప్రజ్ఞుడైనట్టి, పాపరహితుడైనట్టి, కోరికలు లేనట్టి, బ్రహ్మవేత్తలలో అగ్రగణ్యుడైనట్టి బ్రహ్మనిష్టుడైనట్టి, కట్టెలులేని నిప్పులాగా శాంత చిత్తుడైనట్టి, దయా చిత్తుడైనట్టి, శరణుచొచ్చిన సజ్జనుల మేలుకోరినట్టి గురువు వద్దకు వినయ విధేయులతోపాటు భక్తిపూర్వకంగా పూజించి ఆయనను ప్రసన్నుని చేసుకొని భయంకరమైన ఈ సంసార సాగరాన్ని దాటటానికి ఉపాయమేదో జిజ్ఞాసతో తత్పరతతో వారిని కోరాలి.





## 8. సద్గురువు - గురుమహిమ

జనన మరణ రూపమగు సంసారమే దుఃఖములలోకెల్ల మహా దుఃఖము. ఈ మహా దుఃఖము తొలగాలంటే అద్వైత ఆత్మ జ్ఞానమే శరణ్యము. అటువంటి ఆత్మ జ్ఞానము శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులగు ఉత్తమ సద్గురువు ద్వారానే సౌలభ్యమవుతుంది. ఆత్మజ్ఞానము కలగనిదే అత్యంత దుఃఖ నిత్య నిరతి యానంద ప్రాప్తి మోక్షము కలుగదు. మరియే ఇతర సాధనాలవలనా కలుగదు. దానధర్మముల చేకాని, తీర్థ యాత్రలవలన గాని, అఖండిత పాండిత్యమున్నా, సుసంతానాన్ని కన్నా వీర శౌర్యములతో రాజ్యములను సంపాదించినా మోక్షప్రాప్తి కలుగదు. సద్గురువుని ఆశ్రయించి వారిద్వారా తత్వ బోధనను శ్రవణము చేసి, మననము చేసి, నిధి ధ్యాసతో తీవ్ర సాధన చేసి తన యందున్న అజ్ఞానాన్ని నిర్మూలించుకొని ఆత్మ జ్ఞానమును పొంది, నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మానుభూతిని పొందితే తప్ప మోక్షము కలుగదు.

మూఢజనులు మాయామోహముచే జడరూపమగు శరీరము సత్యమని విశ్వసించి దేహాభిమానియై దాని సంబంధీకులగు దారాపుత్ర బంధువులయందు మోహము పెంచుకొని మిధ్యయైన జగత్తుని శాశ్వతమని అవిద్యచే భ్రమించి అనేక కోర్కెలతో త్రిగుణాలకు తన మనస్సు బుద్ధి ఇంద్రియాలకు బానిసలయి దురహంకారంతో దైవ చింతన లేక సంగమంతో కర్తృత్వంతో అనేక కర్మలు చేసి దాని ఫలితాలను అనుభవించడానికి అనేక జన్మలెత్తుతూ మరణాలు పొందుతూ దుఃఖాలు పాలవుతున్నారు. ఈ జనన మరణ ప్రవాహమునుండి విడివడి మోక్షము పొందుటకు సద్గురువును ఆశ్రయించటమే తప్ప వేరు మార్గము లేదు

"గు"అను అక్షరము నిశ్చయముగా అన్ధకారమనే అజ్ఞానమును "రు" అను అక్షరము జ్ఞానమనే ప్రకాశమును నిశ్శేషముగా మింగుచున్నది. అందుచే గురువు అను శబ్దమును ఆవరణ రూపమయిన అంధకారమును జ్ఞాన బోధచే నశింపజేసి మోక్షప్రాప్తి కలుగజేయుచున్నారు. అందుచేతనే గురువు పరబ్రహ్మము వేరుకాదు. గురుస్సాక్షాత్ పరబ్రహ్మమగుచున్నాడు. అంటే "గు" కారము తమస్సు "రు" కారము దానిని నశింపజేయు ప్రకాశము "గు" కారము భవరోగము"రు" కారము తన్నాశకము. భవరోగము నశింపచేయువాడు గురువు."గు" కారము గుణాతీతమయినది. "రు" కారము రూపరహితుడు అనిగూడా చెప్పవచ్చును. అంటే సద్గురువు త్రిగుణములను అతిక్రమించి రూపరహితుడయిన సాక్షాత్ పరబ్రహ్మయే అని తెలిసికొన వలయును. "గు"కారము గుణభాసకం అన్నారు. అంటే మాయ అవిద్య, భ్రాంతి వాటి గుణాలయిన సత్త్వ రజసమో గుణములను దానివలన కలుగు శోక, మోహ, అన్యత జడదుఃఖాదులను బోధించుచున్నది. "రు"కారము వాటికి విరుద్ధమై మాయా భ్రాంతులను సమూలముగా ధ్వంసముచేసి వాటినుండి విముక్తులనుగావించి మోక్షప్రాప్తి కలుగ చేయునది. అంటే గురువనగా దేహేంద్రియాది సంఘాత రూపమయిన అవిద్యను మాయను వాని శోకమోహాది గుణములను నశింపచేయు సాక్షాత్ పరబ్రహ్మ అని చెప్పవచ్చును అటువంటి గురుతత్వం చాలా శ్రేష్టమయినది అందుచేతనే సకల దేవతలు, గంధర్వులు, మానవులు అందరూ గురువును పూజిస్తున్నారు. కాబట్టి మోక్షకాములందరుకు శ్రీ గురుబ్రహ్మమును ఎల్లపుడు ఉపాసించాలి. అభిమాన అహంకారములను పూర్తిగావిడిచి దేహేంద్రియాల నన్నింటినీ సద్గురువుకు సమర్పించి వారిని సేవిస్తూ వారి కృపకు పాత్రుడు కావాలి. మనసా వాచా కర్మణా సర్వదా గురువు అజ్ఞాపించిన కర్మల చేత





ఆయనవద్ద శ్రవణముచేసిన వేదాధ్యయనాది పఠనముచేత మననము చేసుకుంటూ తరించాలి. తన సర్వస్వమును సమర్పించి దేహేంద్రియాదులందున్న అభిమానమున్ను వాటి సంబంధీకుల యందు ఉండే మోహమును వీడి సద్గురువుకు తాను సమర్పించుకుని సంకోచము లేనివాడై ఉండాలి. ఈ జగత్తంతా బ్రహ్మ, విష్ణు, శివాత్మకమై ఉంది. అటువంటి జగత్తు సద్గురు పరబ్రహ్మ స్వరూపమయే ఉంది. అందుచేత గురువుకన్నా శ్రేష్ఠ పదార్థము ఇంకోటి లేదు. ఆ గురువు సకలోప ఉపనిషత్తులనెడి రత్నములచే అలంకరింపబడి ఉన్నాడు. వేదాంతములను ప్రవచించి మోక్ష ప్రాప్తిని కలుగజేయు జ్ఞానమూర్తి ఆయన. దీనులను తత్త్వ జ్ఞానోపదేశము చేసి ఉద్ధరిస్తున్నాడు. శ్రీ గురుమూర్తి నాలుగు వేదములయొక్క సారములగు మహావాక్యములయొక్క లక్ష్యార్థమును బోధిస్తున్నాడు. కావున బ్రహ్మదేవుడయి ఉన్నాడు. తత్త్వ జ్ఞానోపదేశము చేసి అజ్ఞానములో పడకుండా సర్వులను రక్షించుచున్నాడు. కాబట్టి విష్ణువై ఉన్నాడు. దీనులయి శరణుచొచ్చిన వారి అజ్ఞాన ఆవరణలను హరింప చేయుచున్నాడు. కాబట్టి మహేశ్వరుడన బడుచున్నాడు. అట్టి సద్గురువు త్రిగుణాతీతమగు బ్రహ్మతత్వమగుటచే సాక్షాత్ పరబ్రహ్మవై ప్రకాశిస్తున్నాడు. అజ్ఞానమనే నేత్ర రోగముతో అంధకారమనే చీకటిలో కొట్టుమిట్టాడే దీనులకు తత్త్వ జ్ఞానోపదేశము అనే కాటుకచే అవివేక అజ్ఞాన దృష్టిని పూర్తిగా నశింపజేసి జ్ఞాన నేత్రములను ప్రసాదిస్తున్నాడు. అఖండ బ్రహ్మాండరూపమయిన స్థావర జంగమాత్మకమగు ప్రపంచము ఏపరమాత్మచేత వ్యాపింపబడినదో అట్టి చైతన్య స్వరూపుడగు ఈశ్వరుని "తత్త్వమసి" అను మహా వాక్యార్థమును లక్ష్యార్థముచే శరీర ఇంద్రియోపాధిక చైతన్య స్వరూపుడగు జీవుడు "**త్వం**" అను పదంయొక్క

పదముచే ఉపదేశిస్తున్నాడు. ఈ మహా వాక్యార్థము పదునాలుగవ ప్రకరణమందు విపులముగా చర్చించుకుందాము. చరాచరములతో కూడిన సమస్త త్రిలోకములు చైతన్య స్వరూపమగు పరబ్రహ్మముచే వ్యాపింపబడినది. అట్టి లోకములన్నియూ దృశ్యము. ఉన్నది కేవలం చైతన్య పరబ్రహ్మమే. జీవుని ఉపాధి అవిద్య ఈశ్వరుని ఉపాధి మాయ. ఈ రెండింటిచే దృశ్యము ఏర్పడుతోంది. ఈ దృశ్యము దూరీకరించినచో మిగిలేది చైతన్యమే. ఈ విధముగా జీవేశ్వరైక్యమును సద్గురువు బోధించుచున్నారు. ఆ తత్వ బోధవలన తీవ్ర ముముక్షత్వము వలన తాను ఒక నిమిష కాలముగాని దానియొక్క సగము కాలముగాని స్వస్వరూప జ్ఞానము అనుభవించినచో తాను పరబ్రహ్మకంటే వేరు కాదు. అహంబ్రహ్మాస్మి అని అనుభవ పూర్వకముగా తెలుసుకొనుచున్నాడో అతడు అదృష్టవంతుడు. ఇది మహా మహిమ సంపన్నుడగు గురువువలనే సాధ్యము అట్టి సద్గురు తత్త్వము కేవలము ప్రకాశ స్వరూపము జ్ఞాన రూపము, త్రికాలములయందు నాశ రహితము పరమ శాంతి రూపము, పంచభూతములకు విలక్షణము, మాయా మాలిన్య రహితము, సర్వదాపరిశుద్ధము, నాదబిందు కళలకు అతీతము, వాటి అన్నిటికి సాక్షిరూపియై ఉండునది. సర్వ వృత్తుల పరమరూపమై పరమ శాంతస్వరూపము, గుణాతీతము. సకలమాలిన్య రహితమై పరిశుద్ధము. సర్వ విద్యాత్మక సర్వాంతర్యామి. ఆ సద్గురు దేవుడే తీవ్ర ముముక్షులైన పరమ భక్తునకు సదారక్షించు తండ్రి. పరమ ప్రేమతో పోషించు తల్లి. హితాహితముల విచారించు శ్రేయోభిలాషియైన బంధువు. సంసారమందున్న మోహమును పూర్తిగా నశింపచేసి అవిద్యచే జనించు సకల భ్రాంతికి నాశకుడై రక్షిస్తున్నాడు. ఆ సద్గురువు యొక్క స్వరూపలక్షణములు





సచ్చిదానందములు. కేవలము బ్రహ్మ నాద స్వరూపము. వారిని ఆశ్రయించిన తీవ్ర ముముక్షువులు కూడా వారి కృపతో అవిద్య తొలగి అజ్ఞానము నశించి నిర్వికల్ప సమాధిద్వారా స్వస్వరూపానందము అనుభవించుటచే జీవుడు కూడా ఆనంద స్వరూపుడే అనుభవము ద్వారా జీవ బ్రహ్మైక్య జ్ఞానమును పొందుచున్నాడు. సకల ప్రపంచము ఆ గురు దేవుని సత్తవలన భాసించుచున్నది. ఆ గురు బ్రహ్మ స్వరూపము సర్వ వ్యాపకము - సర్వాధారము-స్వయం ప్రకాశము - సర్వాధిష్ఠానము. సర్వాధికశ్రేయము. పరమ ప్రేమ స్వరూపము. అనేక జన్మల నుండి చేసిన సకల కర్మలవలన సంప్రాప్తమయిన బంధములను స్వస్వరూప తత్త్వ జ్ఞానమనే అగ్నియొక్క ప్రభావముచేత నిశ్శేషముగా దహింపచేసినట్టి మహనీయుడు ఆ సద్గురువు. గురువుకంటే ఉత్తమమయిన తత్త్వం లేదు గురువుకంటే శ్రేష్ఠమయిన ధ్యానము తపమూ లేదు. ఆ సద్గురువే మూల కారణుడు. మంగళ స్వరూపుడు. గురుమంత్రముకంటే వేరే శ్రేష్ఠమైన మంత్రము లేదు సర్వులకు ఆ సద్గురువే పరమ దైవము. సర్వ జగత్తంతయూ శ్రీ గురుబ్రహ్మయందే ఉంటున్నది. అట్టి ప్రపంచ మధ్యయందు శ్రీ గురుబ్రహ్మ తత్త్వముంటున్నది. అందుచేత ఈ సమస్త జగత్తు గురుతత్త్వము కంటే వేరు కాదు. అందుకే ఆయన సకలాత్మ స్వరూపుడు. సప్తసాగరం వరకు గల సకల పుణ్యతీర్థములయందలి స్నానముచేయుటచే కలుగు ఫలమేమి యున్నదో అది గురుపరమాత్మ యొక్క పాదోదక బిందువుయొక్క సహస్రాంశము పరమ భక్తితో సేవించినచో కలుగును. అందుచే అటువంటి సద్గురువు ఎన్నో పూర్వ జన్మపుణ్యపరిపాకము వలన గాని లభ్యము కాదు. అటువంటి సద్గురుని తీవ్ర ముముక్షత్వముతో అభిమాన అహంకారములను విడచి వినయ

విధేయులతో తత్త్వోపదేశం కొరకై ఆశ్రయించి ఆయనద్వారా నిర్వికల్ప సమాధివలన స్వస్వరూప జ్ఞానమును అనుభవ పూర్వకముగా తెలుసుకొని జనన మరణ రూపమగు సంసార చక్ర భ్రమణమునుండి తప్పించు కొనవలెను. అట్టి గురుదేవుని స్తుతించుటకై నిత్య పారాయణ కొరకై గురుగీతయందు కొన్ని శ్లోకములను ఈ క్రింద ఉదహరించడమయినది.

## గురుగీత

1. సంసారవృక్షమారుఢః పతన్ని నరకార్ణవే
   యస్తానుద్ధరతే సర్వాం స్తస్మై శ్రీ గురవే నమః ॥
2. గురుర్బ్రహ్మ గురువిష్ణు గురుర్దేవో మహేశ్వరః
   గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥
3. అజ్ఞానతిరాన్ధస్య జ్ఞానాఞ్జ సశలాకయా
   చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥
4. అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం
   తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥
5. స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్స చరాచరమ్
   త్వపదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥
6. చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరమ్
   అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥
7. నిమిషాన్ని మిషార్ధాద్వాయ ద్వాక్యాద్వై విముచ్యతే
   స్వాత్మానం శివమాలోక్య తస్మై శ్రీ గురవే నమః ॥
8. చైతన్యం శాశ్వతం శాన్తం వ్యోమాతీతం నిరంజనమ్
   నాద బిందు కళాతీతం తస్మై శ్రీ గురవే నమః ॥





9. నిర్గుణం నిర్మలం శాన్తం జంగమం స్థిరమేవచ
   వ్యాప్తం యేన జగత్సర్వం తస్మై శ్రీ గురవే నమః ॥
10. సపితా సచమే మాతా సబన్ధుస్సచదేవతా
    సంసార మోహనాశాయ తస్మై శ్రీ గురవే నమః ॥
11. యత్సత్త్వేన జగత్సత్త్వం యత్ప్రకాశేనభాతిత్
    యదానన్దేన నన్దన్తి తస్మై శ్రీ గురవే నమః ॥
12. యస్మిన్ స్థిత మిదం సర్వం భాతి యద్భానరూపతః
    యత్ప్రీత్యాప్రియం పుత్రాదీ తస్మై శ్రీ గురవే నమః ॥
13. యేనేదం దర్శితం తత్త్వం చిత్తచైత్యాదికం తథా
    జాగ్రత్స్వప్నసుషుప్త్యాది తస్మై శ్రీ గురవే నమః ॥
14. యస్యజ్ఞానమిదం విశ్వం నదృశ్యం భిన్న భేదతః
    సదైక రూప రూపాయ తస్మై శ్రీ గురవే నమః ॥
15. యస్యజ్ఞాతం మతం తస్యమతం యస్యన వేదసః
    అనన్య భావ భావాయ తస్మై శ్రీ గురవే నమః ॥
16. యస్మై కారణ రూపాయ కార్య రూపేణ భాతి యత్
    కార్యకారణ రూపాయ తస్మై శ్రీ గురవే నమః ॥
17. నానారూప మిదం విశ్వం నకే నాప్యస్తి భిన్నతా
    కార్యకారణ రూపాయ తస్మై శ్రీ గురవే నమః ॥
18. జ్ఞాన శక్తి సమారూఢ తత్త్వ మాలావిభూషిణే
    భుక్తి ముక్తి ప్రదాత్రేచ తస్మై శ్రీ గురవే నమః ॥
19. అనేక జన్మ సంప్రాప్తకర్మ బన్ధవిదాహినే
    జానానల ప్రభావేన తస్మై శ్రీ గురవే నమః ॥

20. శోషణం భవ సింధోశ్చ దీపనం క్షర సమ్పదాం
గురోః పాదోదకం యస్య తస్మై శ్రీ గురవే నమః ॥
21. నగురోదధికం తత్త్వం నగురోరధికం తపః
నగురోరధికం జ్ఞానం తస్మై శ్రీ గురవే నమః ॥
22. మన్నాథ శ్రీ జగన్నాథో మద్గురు శ్రీ జగద్గురుః
మమాఽత్మా సర్వ భూతాత్మా తస్మై శ్రీ గురవే నమః ॥
23. గురు రాది రనాదిశ్చ గురుః పరమ దైవతమ్
గురుమంత్ర నమోనాస్తి తస్మై శ్రీ గురవే నమః ॥
24. ఏక ఏవ పరోబన్ధుర్విషమే సముపస్థితే
గురుస్సకల ధర్మాత్మా తస్మై శ్రీ గురవే నమః ॥
25. గురు మధ్యేస్థితం విశ్వం విశ్వమధ్యే స్థితో గురుః ॥
గురుర్విశ్వంనచాన్యోస్తి తస్మై శ్రీ గురవే నమః ॥
26. భవారణ్య ప్రవిష్ణస్య దిఙ్మోహభ్రాన్త చేతనః
యేన సందర్శితః పన్థాః తస్మై శ్రీ గురవే నమః ॥
27. తాపత్రయాగ్ని తప్తానామ శాంత ప్రాణినాం ముదే
గురుదేవ పరా గంగా తస్మై శ్రీ గురవే నమః ॥
28. అజ్ఞానేన హినాగ్రస్తాః ప్రాణినస్తాన్ చికిత్సకః
విద్యా స్వరూపో భగవాన్ తస్మై శ్రీ గురవే నమః ॥
29. హితవే జగతామేవ సంసారార్ణవ సేతవో
ప్రభవే సర్వ విద్యానాం శంభవే గురవేనమః
30. ధ్యానమూలం గురోర్మూర్తిః పూజా మూలం గురోఃపద
మన్త్ర మూలం గురోర్వాక్యం ముక్తి మూలం గురోఃకృపా॥
31. సప్తసాగర పర్యన్త తీర్థ స్నాన ఫలంతు యత్





గురోఃపాదోదబిందోశ్చ సమస్రాం శేనాతత్ఫలమ్॥
32. నిత్యానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుంతం నమామి॥
33. ఓం, నమో బ్రహ్మా దిభ్యో బ్రహ్మా విద్యా సాంప్రదాయ
కర్తృభ్యో వంశ ఋషిభ్యో గురుభ్యోనమో మహాద్భ్యః
సర్వోపపద్రవ రహిత ప్రజ్ఞాన ఘనః, ప్రత్య గర్థోబ్రహ్మైవాహమస్మి॥

## 9. శుభేచ్ఛ

జన్మ పరంపరలలోచిక్కుకుంటూ విసిగిపోయి పూర్వజన్మల పుణ్య పరిపాకమువలన కించిత్ వైరాగ్యముదయించి ఏ విధంగా జన్మ పరంపరలలో నుండి తప్పించుకొని మోక్ష సిద్ధికి ప్రయత్నం చేయాలి అని సజ్జన సాంగత్యము చేస్తూ సద్గురువుకై అన్వేషిస్తాడు. అంటే అతనిలో శుభేచ్ఛ మొదలయింది. సత్సాంగత్యం ద్వారా సత్ గ్రంధ పఠనము ద్వారా సత్ పదార్ధము శ్రవణము చేస్తాడు. తాను అజ్ఞానం వలన ఇంద్రియాలకు మనస్సుకు లోబడి మాయవలన ఈ కర్మబంధంలో చిక్కుకున్నానని తెలుసుకుంటాడు. మాయ, అవిద్య, అజ్ఞానం ఒక్కటే. అదే భ్రమ. నిజంగా తాను కాని శరీరాన్ని తాను అనుకొని ప్రవర్తించటమే మాయ. సత్యత్వం లేని దానియందు సత్యమని అసత్యవస్తువుని నిత్యమని భ్రమించడం మాయ అని తెలుసుకుంటాడు. తన పతనానికి సంకల్పాలు కోర్కెలు కామము, అనురాగము, మోహము, దంభము, మద, మాత్సర్యములే కారణమని గ్రహించి ఎల్లప్పుడూ సత్వగుణాభివృద్ధి చేసుకుంటూ సంకల్ప త్యాగం చేసుకుంటూ ఉంటాడు. అయితే మోక్షసాధనకు ఏ మార్గంలో పయనించాలో కర్మ బంధాలు ఎలా నిర్మూలించుకోవాలో తెలియక వైరాగ్యము పెంచుకుంటూ ఆ వృత్తిలో సద్గురువు కోసం అన్వేషిస్తాడు. ఈ శుభేచ్ఛ ఎంతో పూర్వజన్మ పుణ్య పరిపాకం వలనగాని కలుగదు.

భగవత్ కృపవలన అతనికి సద్గురువు లభిస్తాడు. అప్పుడు వారికి సాష్టాంగ నమస్కారం చేసి వినయంతో భక్తి ప్రవృత్తులలో సంశయ నిర్మూలనకై మోక్ష ప్రాప్తికై గురువును, దేవా! నా పుణ్య పరిపాకము వలన భగవంతుని దయవలన తమ దర్శనమయినది. నేను అజ్ఞానంలో కొట్టు





మిట్టాడుతున్నాను. జన్మ పరంపరలలో చిక్కుకున్నాను. నేను తరించి మోక్షము ఏవిధంగా పొందాలి. భగవత్స్వరూపము ఏ విధంగా ఉంది? నేనెవరు? ఈ కనిపించే దృశ్య జగత్తును ఎవరు సృష్టించారు? అని అడుగుతాడు.

## సద్గురు దర్శనము - గురుబోధ

అపుడు శ్రీ గురుదేవుడు అపార ప్రేమతో, వాత్సల్యంతో, అతని సాధన చతుష్టయ సంపత్తిని పెంచుకొని తీవ్ర మోక్షేచ్ఛ కలిగి ఉన్నాడని గ్రహించికొని ఈ క్రింది విధంగా అతని అవిద్య రూపు మాపటానికి, సంశయ నివృత్తి కలగటానికి, స్వరూపజ్ఞానం కలుగుటకై బోధచేస్తాడు.

**"సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవా ద్వితీయం బ్రహ్మ"**

నాయనా! ఈ జగత్తంతా సృష్టికి పూర్వము తాను సర్వ కారణమయిన సద్వస్తువు మాత్రమే అయి ఉంది. ఆ సద్వస్తువు మాత్రము ఒక్కటే. అందు అన్యమేదీ లేదు. అది ఏకరసము. అద్వితీయము. అనగా రెండవది లేనివస్తువు అని అర్థము. అంటే ఆ సద్వస్తువు సజాతీయ, విజాతీయ భేద సూన్యము అనగా అనంతము అంటే దేశకాల, వస్తు కృత పరిచ్ఛేదములు లేనిది. నిరవయము సద్రూపము. స్వయ ప్రకాశము అదే బ్రహ్మ.

**యతోవా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవన్తి యత్ప్ర యన్త్యభి సందిశన్తి। తద్విజ్ఞానస్వ। తద్బ్రహ్మేతి।**

ఆ సద్వస్తువు నుండి భూతభౌతిక రూపకములగు సమస్త కార్యములు

పుట్టుచున్నవి. దానిచే పోషించబడుచున్నవి. దానియందే జీవించుచున్నవి. దానియందే లయమును పొందుచున్నవి. ఆ సద్వస్తువే బ్రహ్మ కాబట్టి ఈ కానవచ్చు ప్రపంచమంతయూ దృశ్యము. ఈ దృశ్యమును దర్శించునది ఆత్మ, ద్రష్ట అనబడుచున్నాడు.

## "యతోదా చోనివర్తంన్తే అప్రాప్యమనసా సహ"

ఆ బ్రహ్మ తత్వమును మాటలచేత గాని మనస్సు చేత గాని ఇట్టిది అని చెప్పలేక మరలిపోయినది. ఆత్మ సత్స్వరూపము సత్యము, త్రికాలాభాధ్యము అంటే ఎటువంటి వికారములకు లోనుకాకుండా ఎట్టి మార్పులూ చెందక భూత భవిష్యద్వర్తమాన కాలములలో ఏకరూపమున నుండినది సర్వసాక్షి - సర్వద్రష్ట - అనాది - నిత్యము - అద్వితీయము - ఆత్మ వస్తువు మిక్కలి ప్రియము. ప్రియతమమయినది - ఆనందమయము - సుఖ స్వరూపమయినది - సత్యంజ్ఞానమన్తం బ్రహ్మ - విజ్ఞానమానందం బ్రహ్మ. ఎయ్యది ఎవ్వరిచేత చూడబడినది అగుచున్నదో చూచినది మాత్రమే అగుచున్నదో, ఎవరిచేతనూ వినబడనిది అగుచూ వినునది మాత్రమే అగుచున్నదో, ఎవ్వరిచేతను ఊహింపబడనిది అగుచూ ఊహించునది మాత్రమే అగుచున్నాదో ఎవ్వరిచేతనూ ఇట్టిది, అట్టిది అని నిశ్చయింప బడనిది అగుచూ నిశ్చయించునది మాత్రమే అగుచున్నదో అది, అక్షరమగు పరమాత్మ తత్వము. స్వయంప్రకాశమానము - చైతన్యము మాత్రమే స్వరూపముగా గలది-సచ్చిదానంద ఘనము - నిర్విశేషము - నిరుపాధికము - పరిపూర్ణము - సర్వవ్యాపకము - అసంగము - చిన్మాత్రము - నిర్వికారము - బేధశూన్యము - నిష్క్రియుడు - నిర్వికల్పుడు - నిర్ధర్మకము - నిఖిలకర్మప్రదాత - సర్వేశ్వరుడు - సర్వజ్ఞుడు - సర్వ శక్తివంతుడు.





ఈ దృశ్య జగత్తు అంతా మనోసృష్టి మాత్రమే. సుషిప్తి (గాడ నిదుర) లో మనస్సు లేదు. అపుడు జగత్తు లేదు. జాగ్రదవస్థలోకి రాగానే మనస్సు విజృంభించి ఈ జగత్తును సృష్టిస్తోంది. నామ రూప రహితుడైన నిర్గుణ బ్రహ్మమందు మనం అజ్ఞానం వలన భ్రమ వలన ఈ లేని జగత్తు ఉన్నట్లుగా భ్రమిస్తున్నాము. అదే సత్యము అనుకుంటున్నాము. **"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా"** అని శ్రీ జగద్గురువు శంకరాచార్యులవారు బోధించారు. అంటే సినిమా తెరపై బొమ్మలు శాశ్వతం కాదు. ఆ బొమ్మలకు తెర ఆధారము. బొమ్మలను చూస్తున్నంతకాలం తెర కనిపించదు. అదేవిధంగా సర్వత్రా వ్యాపించి ఉన్న పరబ్రహ్మమందు సత్యత్వంలేని జగత్తు ఆరోపించబడింది. ఇది మనో విలాసము. మనస్సు, ఇంద్రియాలు, బాహ్య ప్రవృత్తి చెంది విషయ వాంఛలకు లోనవుతాయి. దృశ్యము కనిపించినప్పుడే రెండవవాడు ఉన్నాడనే విశ్వాసము కలుగుతుంది అజ్ఞానము చేత దానివల్ల బుద్ధి నిర్ధారణ చేస్తుంది. అభిప్రాయ మేర్పరచుకుంటుంది. అవే వాసనలు. ఆ వాసనలు జన్మకు కారణమవుతాయి. అభిప్రాయము కలిగినప్పుడే దోష దర్శనం చేసి ఆత్మగానే నిర్ధారణ చేసుకోవాలి. బాహ్య జగత్తులోని విషయాలయందు అభిప్రాయాలకు విలువనివ్వకూ డదు. ఉన్నది ఒక్కటే పరమాత్మ. ఎల్లెడలా వ్యాపించి ఉన్నాడు. **"ఏకమే వాఽద్వితీయం బ్రహ్మ నేహ నానాస్తి కించన"** అజ్ఞానంవల్ల అవిద్యవల్ల జగత్తుకు ఆధార భూతమైన పరబ్రహ్మను చూసే శక్తిలేక దానిమీద మీ మనోసృష్టియైన త్రిగుణాలతో నిండి ఉన్న జగత్తు సత్యమని భ్రమించి త్రిగుణాలకు లోబడి వాసనలు పెంచుకొని తద్వారా చేసిన కర్మలవల్ల జన్మ పరంపరలకు లోనవుతున్నావు. కాబట్టి నీవు చేయవలసినదల్లా నీయందున్న భ్రమను అజ్ఞానాన్ని నిర్మూలించుకోవడమే. ఎప్పుడయితే అవిద్య నశిస్తుందో అప్పుడు జగత్తు మాయమయి దానికి అదిష్ఠానమయిన పరబ్రహ్మ గోచరిస్తుంది. అంటే

అప్పటివరకు అజ్ఞానం వలన చూసిన జగత్తు ఎక్కడికో పోదు. పరబ్రహ్మలో లయమవుతుంది. ఇది ఎలాగంటే మసకచీకట్లో ఒకడు త్రాడును చూచి పాము అని భ్రమ చెంది భయకంపితాలకు లోనయ్యాడు. అయితే అక్కడ పాము ఉంది అజ్ఞానికి. ఆ స్థితిలో అది సత్యమే. అది పాము కాదురా త్రాడు మాత్రమే అని ఎవ్వరు చెప్పినా వినిపించుకోడు. ఒక దీపము తీసుకొచ్చి చూపించగా అక్కడ త్రాడు గోచరిస్తుంది. అయితే అప్పటివరకు భ్రమచేత ఊహించుకొని మనస్సుచేత కల్పించబడిన సత్యంగా ప్రకాశమయిన పాము ఏమయింది. దీపము చూపించగానే ఆ పాము త్రాడులో లయమయింది. అంటే పాముకు త్రాడు అధిష్టానము. అదేవిధంగా ఈ చూడబడే జగత్తు జ్ఞానం కలుగనంతవరకు అవిద్య మూలంగా పరబ్రహ్మము దానికి అధిష్టానమయినప్పటికీ జగత్తుని సత్యత్వంగా భ్రమించి వాసనలు ఏర్పరచుకొని త్రిగుణాలతో కర్మలు చేసి జన్మ పరంపరలలో చిక్కుకుంటున్నాడు. సద్గురు బోధ వల్ల తత్వ జ్ఞానము తెలుసుకొని నిర్వికల్ప సమాధివల్లన సమాధి పొందగానే జగత్తుకు ఆధార భూతమయిన పరమాత్మ దర్శనం అవుతుంది. కాబట్టి మనలోనున్న భ్రమను నివారించుకోవటం ఆ విద్యను రూపుమాపుకోవటం వలననే సాధ్యం.

వాసనలు పూర్తిగా వదిలివేయటమే మోక్షం. అంటే భ్రమ నివారణ చేసుకొని వెలుగువ తెచ్చుకోవటమే. వాసనా పరిత్యాగము చేయనంతవరకూ జన్మచక్ర పరిభ్రమణ తప్పదు. శుద్ధవాసనలు మలిన వాసనలు అని రెండు రకాలు. వాటి వలననే సంకల్పాలు కలుగుతాయి. సంకల్పాలలో అపారమైన శక్తి ఉంది. సంకల్ప ప్రభావము మనస్సుపై బడుతుంది. శుద్ధవాసనలు జన్మరాహిత్యానికి దోహదమవుతాయి. వాడు పరమాత్మ తత్వాన్ని తెలుసుకొని జీవన్ముక్తులుగా ఉంటారు. మనో సంకల్ప





ప్రవాహంలో ప్రేమ, త్యాగము, వినయము, క్షమ, వైరాగ్యము మొదలైన దైవ గుణములు అలవాటు చేసుకుంటే మనస్సులో శాంతి జనిత సుఖము కలుగజేసి మోక్షానికి దారి తీస్తుంది. ఈ మలిన వాసనలు పతనానికి హేతువవుతాయి. ముఖ్యంగా విషయాసక్తి పూర్తిగా నిర్మూలించుకోవాలి. **"మమ, నాది"** అనే రెండు అక్షరాలు సమానము. ఒక వస్తువుపై కాని విషయంపై కాని కోరిక లేదా అభిమానము కలిగి ఉండటము, దానిని తనది అనుకొని తాదాప్యము చెందటము, దాని హృదయంలో దాచిపెట్టుకోవటం ఆసక్తి అంటారు. ఆసక్తి అంటే రాగం, మహా క్లేశం, అవిద్య, అస్మిత, ద్వేషము. అనేక క్లేశాలు కలుగుతాయి. ఇహలోక సంపదలు ఎంతో కాలం మనతో ఉన్నా ఏనాటికయినా మనల్ని విడిచి వెళ్ళిపోయేవే. వాటంతట అవే మనల్ని విడిచిపెడితే చాలా తాపాన్ని కలుగచేస్తాయి. వాటిని మనమే విడిచిపెడితే ఎంతో మనశ్శాంతి సుఖము లభిస్తుంది. ఆసక్తి కేవలం వ్యక్తులపట్ల విషయాలపట్ల మాత్రమే పరిమితమవదు. మన గౌరవం మనం చేసిన కార్యాలు మొదలైనవి కూడా ఆసక్తి కేంద్రాలు కావచ్చు వాటిపై కూడా ఆసక్తి నశించాలి. అందుచేత ముముక్షువు అయినవాడు నిత్య నిరంతరం తను లోపల పరీక్షిస్తూ ఏవిధమైన ఆసక్తి ప్రవేశించిన దానిని నష్టపరచాలి. కొత్త రకమైన ఆసక్తి ప్రవేశించనీయకూడదు అయితే మోక్షసాధనయందు ఆసక్తి ఉండవలసినదే. లేని జగత్తు విషయాలపై సంపత్తి కారణంగా ఏర్పడిన కామోప భోగ రూప ఆసక్తి సాక్షాత్తు మృత్యు సమానము.

మనస్సు సత్కార్య ఆచరణ లేకుండా దుష్ట సంకల్పాలతో ఇటూ అటూ కుక్కలాగా తిరుగుతూ ఉంటుంది. ఎంత నీరు పోసినా బుట్ట నిండనట్లుగా ఎంత ధన భండారం లభించినా ఈ మనస్సుకు తృప్తి అనేది

ఉండదు. అయితే దీన్ని తీవ్ర వైరాగ్యంచే తృటిలో జయించగలడు. మనో నిగ్రహం లేని మానవులకు ఎప్పుడూ మోక్షం ప్రాప్తించదు.

ఈ శరీరం దుఃఖాలు కఠినమైన క్లేశాలు అనుభవించటానికి లభిస్తోంది. మల మూత్రాలతో నిండి, ప్రేగులతో నాడులతో అల్లిబిల్లిగా ఉన్నట్టి ఈ శరీరము నేను అనుకోవటం అహంకారము అవుతుంది. ఈ శరీరము నీవు కాదు మనస్సు నీవు కాదు. బుద్ధి, జ్ఞానేంద్రియాలు నీవు కాదు నీవు వాటికి సాక్షిగా ఉన్నావు. కానీ అజ్ఞానం చేత వాటితో ఏకీభవించి వాటి ధర్మాలను నీపై వేసుకొని కర్తృత్వ భావనతో కర్మలు చేస్తున్నావు. నీవెప్పుడూ జ్ఞాన స్వరూపుడవే. ఇప్పుడు నీలో ఘనీభవించిన అజ్ఞానాన్ని రూపుమాపుకొని చిత్త శుద్ధిని కలుగచేసుకోవాలి. అది అయిన వెంటనే స్వస్వరూపము అనుభవములోకి వస్తుంది. నీవు సత్‌చిత్ ఆనంద స్వరూపుడవు. నీకు పరమాత్మకు బేధం లేదు. భేద బుద్ధే అజ్ఞానం. నీవు నిర్మలుడవు, శాంతుడవు, సర్వ వ్యాపివి. నీ స్వస్వరూపము నీ లక్షణాలు గ్రహించటానికి నీకు పంచకోశ విచారణ, శరీర త్రయ విభాగము వాటి లక్షణాలు, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి అను మహా వాక్యార్ధ వివరణ క్షేత్రము, క్షేత్రజ్ఞుడు వాటి ధర్మాలు మాయ మాయా కార్యము మొదలైనవి వివరముగా తెలియచేస్తాను అని సద్గురువు ఈ క్రింది విధముగా బోధ చేస్తాడు.

### కేత్రము - స్థూల సూక్ష్మ కారణ శరీరాలు

క్షేత్రమంటే స్థూల సూక్ష్మ కారణ సంఘాతాన్నంతటిని క్షేత్రమంటారు. శరీరమని, దేహమని కూ డా పేర్లున్నాయి. జీర్ణించడం శరీరానికి నైజం. అమృతభాండంలో పెట్టినా, ఎన్ని మందులు వేసుకున్నా, ముసలితనం





వచ్చి జీర్ణం కాకతప్పదు. దహింపబడేది కాబట్టి దేహమని పేరు వచ్చింది. ఇది క్షేత్రమని ఎందుకన్నారంటే ఈ క్షేత్రంలో జీవాత్మ ఉండి క్షేత్రపాలకుడయ్యాడు. దేహము కూ డా ఒక పుణ్యక్షేత్రమే. ఈ క్షేత్రంలో పుణ్యబీజాలు నాటితే పుణ్యం వస్తుంది. పాపబీజాలు నాటితే పాపం వస్తుంది. జ్ఞానమార్గాన్ని అవలంబించి జ్ఞానాన్ని తద్వారా మోక్షాన్ని కూ డా పొందవచ్చు. క్షేత్రమంటే జీవుణ్ని కవచం వలె కాపాడేదని అంటారు. ఈ క్షేత్రాన్ని తెలుసుకునే వాడు క్షేత్రజ్ఞుడు. క్షేత్రం దృశ్యం. శరీరమనే రథానికి క్షేత్రజుడు సారథి. క్షేత్రం జడ పదార్థం. క్షేత్రజ్ఞుడు చైతన్య శక్తి. క్షేత్రజ్ఞుని సన్నిధానం వలన సామీప్యం వల్ల జడమయిన క్షేత్రం పనిచేస్తోంది. క్షేత్రజ్ఞుడు ద్రష్ట. అంటే చూచేవాడు సాక్షి అన్నమాట ద్రష్ట దృశ్య స్థానానికి ఎప్పుడూ రాడు. వచ్చిన చిక్కు అంతా ఏమంటే ద్రష్ట అయిన క్షేత్రజ్ఞుడు తన చైతన్య శక్తి వలన క్షేత్రసంఘాతము పని చేస్తుంటే క్షేత్రజ్ఞ ధర్మాలను క్షేత్రంలో అన్యోన్యాధ్యాస - కలగాపులగం చేసి నానాజన్మ మరణ యాతనలకు పాలవుతున్నాడు, అజ్ఞానం వలన, భ్రమ వలన. కాబట్టి క్షేత్రము అనాత్మ అని నిరశించి క్షేత్రజ్ఞుడగు ఆత్మయే తన స్వరూపమని తెలుసుకొని అనుభవక పూర్వకముగా స్వస్వరూప స్థితిని నిర్వికల్ప సమాధి ద్వారా అనుభవమునకు తెచ్చుకున్నవాడే పరమహంస. వాడే పరమ జ్ఞాని. ఇది ఆత్మానాత్మ వివేకము ద్వారా సాధ్యము.

ఏదేది దృశ్యమో దానిని యిది యిది అని వ్యవహరిస్తాము. ఇది ఇది అనే ఏదేది దృశ్యమానవుతుందో ఇదం కోటిలోనికి చేరిపోవుచున్నదో అదంతా క్షేత్రమే. అహంకారము మొదలుకొని అవ్యక్త ప్రకృతి వరకు క్షేత్రమే. కాబట్టి ఇదం వస్తువు క్షేత్రము. అహం వస్తువు క్షేత్రజ్ఞుడు. ఆత్మనిత్య

వస్తువు. మనస్సు, ఇంద్రియాలు, ప్రాణం, బుద్ధి, అహంకారం, ఒక అవస్థలో ఉండి ఇంకొక అవస్థలో లేవు. స్థూల ప్రపంచం జాగ్రదవస్థలో ఉంది. సూక్ష్మ ప్రపంచం స్వప్నావస్థలో ఉంది. ఈ రెండు కూ డా సుషిప్తిలో లేవు. కాని వీటన్నిటికి క్షేత్రజ్ఞుడు సాక్షి రూపంలో చూస్తున్నాడు. నేను అన్నా, ఆత్మ అన్నా, పరమాత్మ అన్నా బ్రహ్మ అన్నా ప్రత్యగాత్మ అన్నా అన్నీ ఒకటే. పర్యాయపదాలు. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞులకు సంబంధించిన జ్ఞానమే నిజమైన జ్ఞానం. అన్ని క్షేత్రాలలో ఉన్న క్షేత్రజ్ఞుడు ఒక్కడే పరమాత్మ. అండజపిండజ, ఉద్భిజ, స్వేదజాది వివిధ భేదాలతో క్షేత్రాలు అనేకములున్న క్షేత్రజ్ఞుడు ఒక్కడే. పూలు అనేకమున్నా అందులోని దారము ఒక్కటే. కుండలు వివిధ రకాలయి అందులోని ఆకాశము ఒక్కటే. అనేకరకాలయిన బల్బులు, Fans, T.V లు ఉన్నా అందులోని కరెంటు ఒక్కటే. అందుచే క్షేత్రజ్ఞునకు అంటే ఆత్మకు నానాత్వం నిషేదించబడింది. ప్రతిపనిలో **"నేను" "నేను"** అని స్ఫురించే అహం పదలక్ష్యార్థం భగవంతుడన్నమాట. జీవోబ్రహ్మైవ నాపరః. కాబట్టి మీరు మానవులు కారు. మాధవులు. మీ నిజ స్వరూపాన్ని తెలుసుకోవటమే పరమావధి. తత్త్వమసి. **అమృ తస్య వుత్రాః** అని శ్రుతిమాత ఇచ్చే బిరుదుకు తగుదురు. అల్పమానవులు ఇచ్చే బిరుదులు పద్మభూషణ్, పద్మశ్రీ వంటి కోసం దేబరించకూ డదు. అహంబ్రహ్మాస్మి అనే మహావాక్యం అనుభవంలోకి తెచ్చుకుంటే చాలు. **"సంశయాత్మా వినశ్యతి"**. శాస్త్ర వచనాలలో గాని ఉపనిషత్తులతో గాని సంశయాలు గలవాడు చెడిపోతాడు. **"క్షేత్రంజ్ఞం చాపిమాంవిద్ధి"** అన్నారు శ్రీ కృష్ణ భగవానులు.

ఏకమేవాऽ ద్వితీయా బ్రహ్మ - నేహ నానాక్తి కించన. జీవజగత్తులు బ్రహ్మమందు కల్పింపబడ్డాయి. క్షేత్రరూపమైన జగత్తు బ్రహ్మమే. క్షేత్రజ్ఞ





రూపమైన జీవుడు బ్రహ్మమే. పూర్ణమదః పూర్ణమిదం. ఎరుగబడు వస్తువులయిన ఈ క్షేత్ర క్షేత్రజ్ఞులు ఏ జ్ఞానముచే ఎరుంగబడుచున్నదో ఆ జ్ఞానమే నిజమైన జ్ఞానం. అది తెలుసుకొనకపోవటమే అజ్ఞానం. అజ్ఞానం పోనంతవరకు జన్మ పరంపరలో తిరుగవలసిందే. అజ్ఞానమే బంధము, దుఃఖము. కాని సంసారము ప్రపంచము బంధము కాదు. దేహ విలక్షణమైన ఆత్మ తాను - ఆత్మే పరమాత్మ - పరమాత్మే తాను. తానూ పరమాత్మా ఒకటే. **అహంబ్రహ్మాస్మి - సోऽహం - శివోऽహం** ఆత్మ సావరూప జ్ఞానాన్నే జ్ఞానమని పెద్దలు చెబుతారు. తక్కినది అంతా భ్రమాజ్ఞానం - మిథ్యాజ్ఞానం.

వికారాలు క్షేత్రమునకే గాని క్షేత్రజ్ఞునికి అంటవు. ఒక వస్తువు పై ఆసక్తి వదలించుకోవాలంటే ఆ వస్తువు యొక్క స్వరూపాన్నికూ లకష్టంగా తెలుసుకోవాలి. క్షేత్ర విచారణ ద్వారా క్షేత్రంమీద ఆసక్తి తగ్గుతుంది.

**శరీరత్రయం - స్థూల సూక్ష్మ కారణ శరీరాలు - పంచీకరణ**

ఇంకా విపులంగా చెప్పుకోవాలంటే స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు, పంచీకరణ అనే విషయాలు విపులంగా చర్చించుకుందాము. ఈ శరీరత్రయం పంచ మహా భూతాలతో ఏర్పడింది.

**పంచమహా భూతములు**

1) ఆకాశము 2) వాయువు 3) తేజస్సు 4) జలము 5) పృథివి

ఇవి అపంచీకృత సూక్ష్మ భూతాలు

స్థూల శరీరం పంచమహా భూతాల పంచీకరణ వలన జరిగింది. ఒక్కొక్క మహాభూతాలలో సగం ఉంచుకొని మిగిలిన సగం 4 సమభాగాలు చేసి మిగిలిన 4 పంచభూతాల కలయిక వలన ఏర్పడిన ఈ శరీరమే పంచీకరణం వల్ల జరిగింది అంటారు. ఈ క్రింది విధంగా విశదీకరించవచ్చు.

1. పృథివి 1/2+ ఆకాశం1/8 +వాయువు1/8 + తేజస్సు1/8 + జలము 1/8 = 1

2. ఆకాశం1/2+వాయువు1/8 + తేజస్సు1/8 + జలము 1/8+ పృథివి 1/8 = 1

3.వాయువు1/2+ ఆకాశం1/8 + తేజస్సు1/8+ జలము 1/8+ పృథివి 1/8 = 1

4.తేజస్సు1/2+ ఆకాశం1/8 +వాయువు1/8+ జలము 1/8+ పృథివి 1/8 = 1

5.జలము 1/2+ ఆకాశం1/8 +వాయువు1/8+ తేజస్సు1/8+ పృథివి 1/8 = 1

అదేవిధంగా ఒక్కొక్క మరో భూతం మిగిలిన భూతాలులో కలయిక వలన ఏర్పడినది స్థూలశరీరము. దీనినే పంచీకరణ అంటారు.

ఈ స్థూల శరీరం లోపల సూక్ష్మ శరీరం అని ఒకటి ఉంది. సూక్ష్మ శరీరం అపంచీకరణ వలన ఏర్పడింది. దీనినే లింగ శరీరం అనికూడా అంటారు.

ఈ స్థూల సూక్ష్మశరీరములు పంచీకరణ మూలంగా ఎలా ఏర్పడినదో ఈ కింది చూపిన చిత్రపటములు చూడగలరు.

**స్థూల శరీర పంచీకరణ**

| | | |
|---|---|---|
| ఆకాశం | 1/2 | మోహము |
| పృథివి | 1/8 | రాగము |
| జలము | 1/8 | ద్వేషము |
| తేజస్సు | 1/8 | భయము |
| వాయువు | 1/8 | లజ్జ |

పంచీకృత ఆకాశము వలన మోహము, రాగము, ద్వేషము, భయము, లజ్జ కలిగినవి.

**స్థూల శరీర పంచీకరణ**

| | | |
|---|---|---|
| వాయువు | 1/2 | చాచుట |
| పృథివి | 1/8 | పరుగిడుట |
| జలము | 1/8 | ఎగురుట |
| తేజస్సు | 1/8 | ముణుచుట |
| ఆకాశం | 1/8 | పడియుండుట |

పంచీకృత వాయువు వలన చాచుట, పరుగిడుట, ఎగురుట, ముణుచుట పడియుండుట అను క్రియలు కలిగినవి.





**స్థూల శరీర పంచీకరణ**

| | | |
|---|---|---|
| తేజస్సు | 1/2 | నిద్ర |
| పృథివి | 1/8 | ఆకలి |
| జలము | 1/8 | దప్పిక |
| వాయువు | 1/8 | ఆలస్యము |
| ఆకాశము | 1/8 | సంగమము |

పంచీకృత తేజస్సు వలన నిద్ర, ఆకలి, దప్పిక, ఆలస్యము, సంగమము కలిగినవి

**స్థూల శరీర పంచీకరణ**

| | | |
|---|---|---|
| జలము | 1/2 | మూత్రము |
| పృథివి | 1/8 | ఉమ్మినీరు |
| తేజస్సు | 1/8 | చెమట |
| వాయువు | 1/8 | రక్తము |
| ఆకాశం | 1/8 | శుక్లము |

పంచీకృత జలము వలన మూత్రము, ఉమ్మినీరు, చెమట, రక్తము, శుక్లము కలిగినవి.

**స్థూల శరీర పంచీకరణ**

| | | |
|---|---|---|
| పృథివి | 1/2 | ఎముకలు |
| జలము | 1/8 | మాంసము |
| తేజస్సు | 1/8 | చర్మము |
| వాయువు | 1/8 | నరములు |
| ఆకాశం | 1/8 | రోమములు |

పంచీకృత పృధ్వివలన

ఎముకలు, మాంసము, చర్మము, నరములు, రోమములు కల్గినవి.

## సూక్ష్మ (లింగ) శరీరము

మహా ప్రాణ వృత్తి భేధములగు ప్రాణాపాన వ్యానోదాన సమానములతోనూ, సంకల్ప వికల్పాత్మాకమగు మనస్సుతోనూ, నిశ్చయాత్మాకమగు బుద్ధితోనూ, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణములను జ్ఞానేంద్రియములు అయిందిటితోనూ, వాక్పాణిపాద పాయూప స్థలను కర్మేంద్రియములయిందింటిలోనూ, కూ డినదియు అపంచీకృత

జ్ఞాన దీపికజ్ఞాన దీపికమహాభూతములలో నుండి కలిగినదియు అగు సూక్ష్మ శరీరము అనుకూ లప్రతికూ ల వృత్తి రూపమయిన సుఖదుః ఖములను అనుభవించుటకు సాధనము. దీనినే లింగ శరీరమంటారు.

సూక్ష్మ (లింగ) శరీర అపంచీకరణము

| | | | | స్థానము |
|---|---|---|---|---|
| ఆకాశం | - | వాక్కు | - | నోరు |
| పృథివి | - | అంతఃకరణము | | |
| జలము | - | సమానము | - | నాభి |
| తేజస్సు | - | శ్రోత్రము | - | చెవి |
| వాయువు | - | శబ్దము | - | చెవి |

సూక్ష్మ (లింగ) శరీర అపంచీకరణము

| | | | | స్థానము |
|---|---|---|---|---|
| వాయువు | - | స్పర్శము | - | చర్మము |
| పృథివి | - | మనస్సు | - | కంఠము |
| జలము | - | వ్యానము | - | సర్వదేహము |
| తేజస్సు | - | త్వక్కు | - | చర్మము |
| ఆకాశం | - | పాదము | - | కాలు |

సూక్ష్మ (లింగ) శరీర అపంచీకరణము

| | | | | స్థానము |
|---|---|---|---|---|
| తేజస్సు | - | చక్షువు | - | నేత్రము |
| పృథివి | - | బుద్ధి | - | నేత్రము |
| జలము | - | ఉదానము | - | కంఠము |
| వాయువు | - | రూపము | - | నేత్రము |
| ఆకాశము | - | పాణి | - | చెయ్యి |





సూక్ష్మ (లింగ) శరీర అపంచీకరణము

| | | | | స్థానము |
|---|---|---|---|---|
| జలము | - | అపానము | - | గుదము |
| పృథివి | - | చిత్తము | - | నాభి |
| తేజస్సు | - | జిహ్వ | - | నాలుక |
| వాయువు | - | రసము | - | నాలుక |
| ఆకాశము | - | గుహ్యము | - | ఉపస్థ |

సూక్ష్మ (లింగ) శరీర అపంచీకరణము

| | | | | స్థానము |
|---|---|---|---|---|
| పృథివి | - | అహంకారము | - | హృదయము |
| జలము | - | ప్రాణము | - | హృదయము |
| తేజస్సు | - | ఘ్రాణము | - | ముక్కు |
| వాయువు | - | గన్ధము | - | ముక్కు |
| ఆకాశం | - | వాయువు | - | గుదము |

### ii. సూక్ష్మ శరీరం లేక లింగ శరీరము :

దీనినే లింగ శరీరము కూ డా అంటారు. ఇవి ఈ క్రింది తత్త్వాలతో కూ డినది.

కర్మేంద్రియాలు (5) పంచప్రాణాలు (5) జ్ఞానేంద్రియాలు(5)

మనస్సు, బద్ధి, చిత్తము, అహంకారము. ఇది జాగ్రదావస్థలోనూ పనిచేస్తుంది. ఆజాగ్రదవస్థలో జరిగిన కార్యకలాపాలన్నిటికి నేను సాక్షిగా ఉన్నాను. ప్రాణమయ కోశం, మనోమయ కోశం, విజ్ఞానమయ కోశం ఆనందమయ కోశంలోని ప్రతిబింబము ఈ శరీరములో చేరుతాయి. ఈ

శరీరము స్వప్నావస్థలో కూ డ కార్యకలాపాలు చేస్తుంది నా చైతన్య శక్తితో. కడుపునిండా ఆహారము తీసుకొని పరుండినపుడు స్వప్నంలో బాగా ఆకలిగా ఉంటుంది. దానికోసం నీ తల్లి అన్నం పెడుతూ ఉంటుంది వెండి కంచంలో మిక్కిలి ఆకలితో అన్నం తింటుండగా బందిపోటు దొంగ వచ్చి నిన్ను కొట్టి బలవంతంగా వెండి కంచం తీసుకుపోతున్నాడు. తీవ్రమయిన గాయాలు అయినాయి. ఇంతలో ఆ ప్రక్కన ఉన్న నల్గురూ చేరి దొంగను తరిమి పట్టుకున్నారు. పోలీసువారు దొంగమీదకేసు పెట్టారు. నీవు కోర్టులో సాక్షమిచ్చావు. ఈ లోగా నిద్దురలో ఉచ్చరించిన ప్రలాపాలకు నిన్ను నిద్దుర లేపారు. అంటే జాగ్రదవస్థలోకి వచ్చావు. స్వప్నంలో అనుభవించినదంతా విపులంగా చెప్పావు. అయితే ఆ స్వప్నము సత్యమా అసత్యమా? సత్యమే ఎందుకంటే ఆ స్వప్నావస్థలో అది సత్యమే కదా! అందుచేతకష్టాలు అనుభవించావు. అయినా జాగ్రదవస్థలోకి రాగానే అసత్యమని తెలుసుకున్నావు. అయితే అక్కడ నిజంగా ఉన్నది నీవొక్కడివే. ఇంకెవరూ లేరు. స్థూల శరీరము సృహలేకుండా అచేతనంగా ఉంది. నీ మనస్సే, నీవు అప్పుడే అన్నం తిని పడుకున్న వెంటనే ఆకలి సృష్టించి తానే తల్లి రూపంలోనూ, దొంగరూపంలోనూ, పోలీసుల రూపంలోనూ అయి భ్రమ కలిగించింది. ఆ అవస్థలో అది సత్యమే. దానికి కూడా నీవు సాక్షిగా ఉండి జాగ్రదవస్థలోకి రాగానే జరిగినవన్నీ చెప్పుతున్నావు. అంటే **"నేను"** జాగ్రదవస్థలో కూ డా ఉన్నావు. స్వప్నావస్థలో కూ డా ఉన్నావు. జాగ్రదవస్థ జగత్తు స్వప్నంలో లేదు స్వప్న జగత్తు జాగ్రదవస్థలో లేదు. రెండు జగత్తులు సుషిప్తిలో లేవు. అన్నిటికి సాక్షిరూపంలో **"నేను"** చూస్తూ సాక్షిగా ఉన్నావు.

iii. కారణ శరీరము :

స్వప్నావస్థలోంచి సుషుప్తిలోకి వెళ్లావు. అంటే గాఢంగా నిద్రించావు.





కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు, బుద్ధి, మనస్సు, ప్రతి బింబంతో సహా **"నేను"** లో అంటే ప్రత్యాగాత్మలో లయమయాయి. మనస్సు లేదు కాబట్టి మనోకార్యము లేదు. ఈ అవస్థలో శరీరం మీద పాము ప్రాకుతున్నా స్పర్శ జ్ఞానం లేదుఅప్పుడు అఖండానందాన్ని విఘ్నం లేకుండా నిర్విరామంగా అనుభవించావు. ఆ స్థితిలో రాజు గాని, బీదవాడు గాని, దేవత గాని, చతుష్పాద జంతువులు గాని ఒకే విధమయిన ఆనందాన్ని అనుభవిస్తాయి. శరీర సంరక్షణార్థం పంచ ప్రాణాలు మాత్రం నీ చైతన్య శక్తి వల్ల వాటి ధర్మాలు నెరవేరుస్తూ ఉంటాయి. జాగ్రదవస్థలోకి రాగానే **"నేను"** హాయిగా ఆనందం అనుభవించాను గాఢనిద్రలో అని చెప్పావు. ఆ సుషుప్తిలో ఆనందాన్ని అనుభవించటం అనే అనుభవానికి కూ డా నేను సాక్షిగా ఉండటం వల్లచెప్పగల్గుతున్నావు. అందుచేత **"నేను"** జాగ్రదవస్థలోని కార్యకలాపాలకి, స్వప్నావస్థకు కూడా సాక్షినే. వాటి వాటి పనులకు **"నేను"** కు ఎట్టి సంబంధము లేదు. కేవలం సాక్షి చైతన్యాన్ని అయి ఉన్నావు. సాక్షిగా చూస్తూ ఉండేవానికి తాను చూచే వాటి గుణదోషాలతో సంబంధం ఉండదు కదా! అయితే నీలో అన్ని లయము అయినప్పటికి అజ్ఞానం వల్ల, అవిద్య వల్ల, మళ్లీ జాగ్రదవస్థలోకి రాగానే పూర్వ వాసనలతో కర్మలు చేయటమవుతోంది. ఈ గాఢ నిద్రను జ్ఞాన సమాధిగా తీసుకోకూ డదు. అందుచే ఈ శరీరానికి కారణ శరీరమన్నారు.

వాక్కుచే ఇట్టిది అని చెప్పశక్యము కానిదియు, ఆది లేనిదియు అగు అజ్ఞానము (అవిద్య) స్థూల సూక్ష్మ శరీరాది ప్రపంచ భ్రమకు గారణమనబడు శరీరమని చెప్పబడుచున్నది.

**పంచకోశ విచారణ - అహంబ్రహ్మాస్మి**

నీ స్వస్వరూపము తెలుసుకోవటానికి పంచకోశ విచారణ చాలా

ముఖ్యము. స్థూల దేహము అన్నమయ కోశమని, దానిలోపల ప్రాణమయ కోశమని, దానిలోపల ఆనందమయ కోశమని ఒకదాని తర్వాత ఒకటి క్రమముగా లోపలవైపున్నటువంటి ఇట్టి పంచకోశ స్వరూపమునే గుహ అని చెప్పబడింది. ఈ ప్రత్యాగాత్మ (ఆత్మదేవుడు) పై పేర్కొనబడిన పంచకోశములతో కప్పబడి ఉన్నాడు. ఈ పంచకోశ విచారణ చేసుకుంటూ వాటిని దాటి ఆత్మ దేవుడితో ఐక్యమవుటయే మోక్షసాధనకు పరాకాష్ట. ఈ పంచకోశ విచారణ ఇప్పుడు విపులముగా తెలుసుకుందాము.

### i. అన్నమయ కోశము :

ఇది స్థూల శరీరము అయి ఉంది. తల్లి తండ్రులచే భుజింపబడిన అన్నము వలన పుట్టి దాని చేత పెరిగి, అన్న వికారమై ఉంది. ఇది పాంచభౌతికము, ఇది నశించునదే, ఇది పుట్టుటకు పూర్వము లేదు. నశించిన తరువాత ఉండదు. అందుచే ఇది ఆత్మ కాదు. ఆత్మ త్రికాల భాద్యుడు. ఆయనకు పుట్టుకలు లేవు. మరణము లేదు. ఎల్లవేళల ఎల్లప్పుడు ఉంటాడు. అందుచే త్రికాల భాద్యుడు కాబట్టి ఈ స్థూల శరీరము ఆత్మ కాదు. ఈ స్థూల శరీరము జడ పదార్థము. ఇది ఆత్మ చైతన్య శక్తిచే పని చేస్తున్నది. **"నేను" "నేను"** అని ఎల్లప్పుడు వ్యవహరిస్తున్న పదము ఆత్మ అని తెలుసుకోవాలి. నేను వేరు ఈ శరీరము వేరు. ఈ శరీరమునకు నేను వ్యతిరేకంగా చూస్తున్నాను. ఒక గృహంలో నేను ఉంటున్న మాత్రమున గృహము నేను కాదుకదా! అదే మాదిరిగా **"నేను"** శరీరము కాదు. ఈ స్థూలశరీరములో ఒక కాలుపోయినా, చెయ్యిపోయినా నేనున్నాను. **"నేను"** లేకపోతే శరీరము పడి పోతుంది. అందుచేతనే, నా చైతన్య శక్తి వలననే శరీరము పని చేస్తున్నది. పైగా శరీరము షడ్భావ వికారములు గలది. కావున దేహము ఆత్మ కాదు. కాని అన్యోన్యాధ్యాసచే అనగా దేహ





ధర్మములు అజ్ఞానముచే ఆత్మయందు ఆరోపించుకొని దేహము పోవుచుండగా నేను పోవుచున్నానని భ్రమ చెందుతున్నాను. **"నేను"** కి ఎప్పుడు చావు లేదు. **"అజో నిత్య శాశ్వతోయం"** అని భగవద్గీతలో చెప్పినటులాత్మ ఎప్పుడు ఉండువాడే. అతడు నిత్యశుద్ధ, భుక్త, ముక్త, స్వభావుడు, నిరంజనుడు, నిష్క్రియుడు, నిత్యుడు నిర్వికారుడు, అవ్యయుడు అని తెలుసుకొనుటచే ఈ శరీరము **"నేను"** కాదని నేను దానికి సాక్షినని గ్రహించాలి. పుట్టుక, గోత్రములు, రూపములు, కులములు, రంగులు ఇవన్ని శరీరమునకే గాని (ఆత్మకు) **"నేను"** కు లేవు. అవన్నీ అన్నమయ కోశ ధర్మములని వాటిని త్యజించి ఆ కోశములు దాటాలి.

### ii. ప్రాణమయ కోశము :

వీటి ప్రధానాంగాలు పంచప్రాణాలు, పంచకర్మేంద్రియాలు, ఈ పంచ ప్రాణాలు శరీరమందు ఆపాదమస్తకము వ్యాపించి వ్యాస రూపమున దేహమునకు బలము నిచ్చును. సకలేంద్రియములను ప్రేరిపించును చలన రూపమయినది. పంచ కర్మేంద్రియాలంటే చేతులు, కాళ్లు, మొదలైనవి అంటే ఏ ఇంద్రియాలతో అయితే కర్మ చేయునో అవి కర్మేంద్రియాలనబడుతాయి. ఆకలి దప్పులు ప్రాణమయకోస ధర్మములు. దీని ధర్మములు **"నేను"** యందు ఆత్మాధ్యాసముచే నేను ఆకలి దప్పికలు గలవాడను, శక్తీ హీనుడను, బలవంతుడను, వక్తను, దాతను, మూగను అను తనయందు ఆరోపించుకొనుచున్నాడు. ఇది ఘటపటాదులవలె ఆత్మ కాదు. నా ప్రాణము బాగాలేదు అని ఉచ్చరించు వాక్యము వలన నేను వేరు ప్రాణము వేరు అని తెలుస్తోంది కదా! కాబట్టి కొలిమి యందు తిత్తివలె జడము. ఈ ప్రాణమునకు కూడా **"నేను"** సాక్షినని తెలుసుకోవాలి. నా చైతన్య శక్తి వలననే ప్రాణమయ కోశము పనిచేస్తోంది. **"నేను"** లేకపోతే

ప్రాణమయ కోశము కూడా జడ పదార్థమే. దాని కార్యములకు సాక్షిగా ఉన్నాను.

iii. మనోమయ కోశము:

మనస్సు, పంచ జ్ఞానేంద్రియాలు (కళ్లు,. చెవి, ముక్కు, నాలుక, స్పర్శ) శరీరము తన్నుగాను గృహరామ క్షేత్రాదులు తనవిగా తోపింప చేయునది. సంకల్ప వికల్పాలు ఈ కోశ ధర్మాలు. చపల స్వభావము కలది. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు, సుఖ దుఃఖ సంకల్పాలు కలుగచేయునది, ఈ మనోమయ కోశమే. బంధమోక్షములకు కారణమవుతోంది. కాని ఆత్మ ఈ కోశ ధర్మములతో అన్యోన్య అధ్యాస ద్వారా ఏర్పడిన తాదాప్యముచే తాను గాని మనస్సును తాననుకుంటూ దాని ధర్మములతో చేరుటచే తాను సుఖినని, దుఃఖినని తలస్తున్నాడు. ఈ మనోమయ కోశము కూడా జడ పదార్థమే. ఆత్మ కాదు. ఆత్మ చైతన్య శక్తి వలననే ఇది పనిచేస్తోంది. దీనికి కూడా **"నేను"** (ఆత్మ) సాక్షిగా ఉన్నాను. నా మనస్సు బాగాలేదు అను వాక్యము వలన నేను వేరు మనస్సు వేరు అని తెలుస్తోంది కదా! ఒకచోట నిశ్చలంగా ఉన్నాడు. మనస్సు మరొక చోటకు పోయి ఆ విషయ చింతన చేయటంకూడా **"నేను"** గమనిస్తున్నాను కదా! దీని సారాంశమేమంటే **"నేను"** మనస్సుకాదు. జ్ఞానేంద్రియాలుకాదు. వాటికి సాక్షిని. అవికూడా నా చైతన్యము వలననే పని చేస్తున్నాయి. **"నేను"** లేకపోతే అవి పని చేయవు, జడ పదార్థము అవటం వలన. అందుచే మనోమయ కోశము నేనుకాదు అని నిర్ణయించుకోవాలి.

iv.విజ్ఞానమయ కోశము :

బుద్ధి, పంచజ్ఞానేంద్రియాలు ఈ కోశము యొక్క ప్రధానాంగములు. కర్తృత్వ నిశ్చయ శక్తులు కలది, విజ్ఞానమయ కోశము, బుద్ధి





జ్ఞానేంద్రియములు సుషుప్తి కాలమున అంటే గాఢ నిద్రలోలయిస్తుంది. జాగ్రదావస్థయందు చైతన్య ప్రతిబింబముతో గూడినఖ శిఖ పర్యంతము శరీర మంతయు వ్యాపించును. ఈ బుద్ధికి సంకోచ వికాసములు కలవి అగుటచే ఆత్మకాదు. నేను వేరు నా బుద్ధివేరు అని వ్యవహరించుటవలన బుద్ధి **"నేను"** (ఆత్మ) కాదు. దానికి కూడా సాక్షిగా ఉన్నాను. నా చైతన్య శక్తి వలననే ఈ కోశము పని చేయుచున్నది. అయినప్పటికి అన్యోన్య అధ్యాసముచే కర్తృత్వ భోక్తృత్వ ధర్మములు నాపై వేసుకొంటున్నాను. కాబట్టి విజ్ఞాన మయ కోశము నేను కాదు.

V.ఆనందమయ కోశము :

ఆనంద స్వరూపమైన బింబము (ఆత్మ) ఈ ఆనంద మయ కోశము బుధ్యాదుల యందు ప్రతిబింబ భావముచే వర్తించుచుండును. ఈ కోశము పుణ్యభోగ కాలమందు వ్యక్తమై అది క్షయింపగనే సుషుప్తిలో లయమొందుతుంది. ప్రియము, మోదము, ప్రమోదము అనే సుఖ వృత్తులచే తెలియబడుతోంది. అభిలాష, అహంకారము, అజ్ఞానము, భోక్తృత్వాది వికారములు గలిగి అజ్ఞానిని, భ్రాంతి గలవానిని, సుఖిని అని తామస వృత్తుల కలది ఆనందమయ కోశము.

బింబ స్వరూపుడయిన ఆత్మ దేవుడు బుద్యాదిలున్న ఈ ఆనందమయ కోశములో ప్రతిబింబరూపుడయి ఉన్నాడు. ఈ ప్రతిబింబ ధర్మాలు ప్రతిబింబమునకు వేదాంతంలో **"చిదాభానుడు"** అంటారు. అయితే బింబ ధర్మాలు ప్రతిబింబ ధర్మాలు ఒక్కటే. వ్యత్యాసము లేదు. కాని ఈ చిదాభసుడు, ఆనందమయ విజ్ఞానమయ, మనోమయ, ప్రాణమయ, అన్నమయ కోశాలతో తాదాప్యం చెంది వాటి ధర్మాలను తనమీద వేసుకొని అజ్ఞానం వల్ల సంసారంలో మునుగుతున్నాడు. నిజానికి ఈ చిదాభాసునకు

పై కోశాలతో ఎట్టి సంబంధము లేదు. నిర్వికల్ప సమాధి ద్వారా స్వస్వరూపానందము (ఆత్మ సాక్షాత్కరము) పొందిన యోగికి చిదాభాసుడు లేడు. తానులోనే తాను (ఆత్మ) లో నిలబడి ఉంటాడు. అధ్యాత్మ సాధన చేయు సాధకునికి మాత్రమే చిదాభాసుని గురించి చెప్పబడుతోంది. ఆత్మ స్వరూపమయిన ఆనంద బింబము సర్వకాల సర్వావస్థలయందు నిత్యశుద్ధ, బుద్ధ, ముక్త, నిష్కళంక, నిష్క్రియ, నిర్గుణ, నిర్వికార, పరిపూర్ణ చైతన్యము అదే ఆత్మ. అదియే సాక్షి, అదే **"నేను"**. పైపంచకోశములు "నేతి నేతి" అంటే ఇది **"నేను"** కాదు **"నేను"** కాదు అని విచారణ చేస్తూ, ధ్యానం చేయగా మిగిలినది ఏదైతే ఉన్నదో ఆత్మ. ఆయనకే ఆత్మ, సాక్షి, ఎరుక, స్వయం ప్రకాశము, స్వస్వరూపము, ప్రత్యగాత్మ, త్వం, బ్రహ్మ అని అంటారు. ఇవన్నీ ఒకటే_ఎల్లవేళల **"నేను" "నేను"** అని సంభోదించేది అదే. ఆ విధంగా **"అహం బ్రహ్మాస్మి"** అనే మహా వాక్యాము ఉపదేశిస్తాడు.

ఈ పంచకోశాలు శరీరత్రయములో ఎలా ఇమిడి ఉన్నయో ఈ దిగువున చూపబడినది.

| | |
|---|---|
| 1. స్థూల శరీరము | అన్నమయకోశము |
| 2. సూక్ష్మ శరీరము లేక లింగ శరీరము | i.ప్రాణమయ కోశము |
| | ii.మనోమయ కోశము |
| | iii.విజ్ఞానమయ కోశము |
| 3. కారణశరీరము | ఆనందమయకోశము |

**అవస్థాత్రయము మరియు తురీయావస్థ**

ముఖ్యంగా మనం చేసే కార్యకలాపాలు ఈ అవస్థలలో జరుగుతూ ఉంటాయి.





**1. జాగ్రదవస్థ** : ఈ అవస్థలో స్థూలశరీరం, సూక్ష్మ శరీరం, ఆనందయకోశం పనిచేస్తు ఉంటాయి.

**2. స్వప్నావస్థ** : దీనిలో స్థూల శరీరము పనిచేయదు. సూక్ష్మ శరీరము దాని అంగాలు ఆనందమయకోశము పనిచేస్తూ ఉంటాయి.

**3. సుషుప్తి** : అంటే గాఢనిద్ర. ఈ అవస్థలో స్థూల శరీరం గాని, సూక్ష్మ శరీరం వాటి మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తవృత్తులు అన్ని కారణ శరీరములో లయమవుతాయి. ఇక్కడ అఖండమైన ఆనందం అనుభవిస్తాడు జీవుడు. తన శరీరం మీదపాము పాకుతున్నా తెలియదు. ఇసుకదిబ్బ మీద పడుకున్న బీదవాడికి గాని హంసతూలికా తల్పముపై నిదురిస్తు అనుభవిస్తున్న రాజుయొక్క ఆనందములో గాని ఏమీ భేధముండదు. ఆ సుషుప్తిలో కూడా ఆ ఆనంద అనుభవానికి సాక్షిగా ఉండబట్టి నిదురలేవగానే హాయిగా నిదురపోయాను అని చెప్పకలుగుతున్నాను. అంటే జాగ్రదవస్థలో జరిగే కార్యకలాపాలకి స్వప్నావస్థలో జరిగే కార్యకలాపాలకి సుషుప్తి అవస్థలో పొందిన అఖండానందానికి తాను సాక్షిరూపుడయి ఉన్నాడు.

పరమాత్మ శుద్ధతత్త్వం - మాయ - ప్రకృతిలో ప్రతిబింబించిన ప్రతిబింబనమునకు ఈశ్వరుడంటారు. అజ్ఞానంలో ప్రతిబింబించిన ప్రతిబింబమునకు చిదాభాసుడంటారు. అంటే చిత్ యొక్క ఆభాసుడు. ఈశ్వరుడు చిదాభాసుడు పరమాత్మ యొక్క ప్రతిబింబాలే. బింబానికి ఉన్న లక్షణాలే ప్రతిబింబాలకుంటాయి. శుద్ధమాయలో ప్రతిబింబించిన ఈశ్వరుడు సర్వశక్తి సంపన్నుడు. ఎందుకంటే ఆయన శుద్ధసత్త్వంలో ప్రకృతిలో ప్రతిబింబినవాడు కాబట్టి. అజ్ఞానంలో ప్రతిబింబించిన చిదాభాసుడు కించిజ్ఞుడు, జీవుడు. ఈశ్వరుడు సమిష్టికి కారణ భూతుడయితే జీవుడు వ్యష్టికి కారణభూతుడవుతాడు. ఈశ్వరుడుకి జాగ్రదవస్థలో జరుగ కార్యకలాపాలకి విరాట్టు అని, స్వప్నావస్థలో హిరణ్యగర్భుడని, సుషుప్తిలో ఈశ్వరుడని అంటారు. జీవుడుకి జాగ్రదవస్థలో విశ్వుడని, స్వప్నావస్థలో తైజసుడని సుషుప్తిలో ప్రాజ్ఞుడని అంటారు. ఈ క్రింద చూపిన పటము పరిశీలించండి








అయితే పరమాత్మ స్వరూపుడయిన తాను అజ్ఞానం వల్ల, భ్రాంతి వలన ప్రకృతిలో త్రిగుణాల ప్రభావాలతో మనస్సు, బుద్ధి, ఇంద్రియాలకు లోనయి సంగమంతో కర్తృత్వ భావంతో కర్మలు తాను చేస్తున్నాని తనపై , శాశ్వతుడయినప్పటికి శరీర ధర్మాలు తనపై వేసుకొని, నేను చస్తున్నాను, పుడుతున్నానని, రోదిస్తు, జనన మరణ ప్రవాహాలకు లోనవుతున్నాడు. కాని పైన చూపిన పటంలో ఇంకొక అవస్థ ఉంది. అది తురీయమంటారు. సద్గురు తత్త్వబోధ వలన తానెవరో తెలుసుకొని ఈ శరీరత్రయ సంఘాతంతో తనకు సంబంధము లేదని తాను పంచకోశవిలక్షుణ్ని అని శాశ్వతుడని, సత్‌చిత్ ఆనంద స్వరూపుడనని **"అహంబ్రహ్మాస్మి"** అనే మహావాక్య ఉపదేశము పొంది తీవ్ర సాధనతో ధ్యానం చేసి నిర్వకల్ప సమాధి ద్వారాతన స్వస్వరూపానందమును అనుభవించుట తురీయావస్థ అంటారు. ఇది జ్ఞానానికి వరాకాష్ఠ. ఇది పొందితే సర్వకర్మల శేషం నశించి మోక్షార్హుడవుతాడు. జననమరణ సంసారం నుండి తప్పించుకుంటాడు.

### క్షేత్ర స్వరూపం

ఇంకా క్షేత్ర స్వరూపములు ఎలాగుంటుందో ఇంకా విచారించుకుందాము.

| | |
|---|---|
| సూక్ష్మ భూతాలు | 5 |
| అహంకారం | 1 |
| బుద్ధి | 1 |
| అవ్యక్తం | 1 |
| కర్మేంద్రియాలు | 5 |
| జ్ఞానేంద్రియాలు | 5 |
| మనస్సు | 1 |
| ఇంద్రియగోచరాలయిన శబ్దస్పర్శ రూపరస గ్రంధం తత్త్వాలు | 5 |
| మొత్తము | 24 |

ఇవికాక ఇచ్ఛ, ద్వేషం, సుఖం, దుఃఖం దేహేంద్రియాది సమూహం అంతఃకరణం (చేతన) ధృతి అనే వికారాలతో కూ డిన ఈ శరీరాన్నే క్షేత్రమంటారు. **మహాభూతాల (భూత సూక్ష్మాలైన పంచతన్మాత్రలు).** పంచతన్మాత్రలకు కారణమైన బుద్ధి (మహతత్త్వం) మహతత్త్వానికి కారణమైన అవ్యక్తం (మూలప్రకృతి, ఇదే అవ్యాకృతం, జగద్బీజం, త్రిగుణాత్మకం అయిన పరమేశ్వర శక్తి దీనినే అపరా ప్రకృతి అంటారు.

అంతఃకరణ ధర్మమైన ఇచ్ఛ (కోరిక) జ్ఞేయం కాబట్టి క్షేత్రమే. అనుకూ లాత్మకమైన సుఖం, ప్రతికూ లాత్మకమైన ద్వేషం, దేహేంద్రియాది సమూహం, ధృతి (ధైర్యరూపమయినబుద్ధి వృత్తి) చేతన అంటే ఆత్మచైతన్యా భానలోఉండే బుద్ధి వృత్తి ఇవన్నీ జ్ఞేయాలే. ఈ విధంగా ఆత్మకు జ్ఞేయాలైనవన్నీ క్షేత్రమే. వికారాదులతో కూ డిన మహ దాదులతో (బుద్ధి మొదలైన వాటితో ) కూ డి ఉన్నందున క్షేత్రం సవికారమే. ఇటువంటి ధర్మాలతో కూ డినటువంటిది క్షేత్రమే. క్షేత్రజ్ఞ ధర్మాలుకావు.

**శరీరములోని అవయములకు అధిభూతములు అధిష్టాన దేవతలు, ఈ కింద చూపబడినది**

| | ఆధ్యాత్మికము | అధిభూతము | అధిదైవతలు |
|---|---|---|---|
| 1 | శ్రోత్రము | శబ్దార్థము | దిక్కులు |
| 2 | శరీరము | తాకదగినది-స్పర్శ | వాయువు |
| 3 | కన్ను | కాంచదగినది | సూర్యుడు |
| 4 | నాలుక | ఆస్వాదింపదగినది | వరుణుడు |
| 5 | ముక్కు | ఆఘ్రాణింపదగినది | అశ్వినులు |
| 6 | పలుకు | పలుకదగినది | అగ్ని |
| 7 | చేతులు | చేకొనదగినది<br>ఈయదగినది | ఇంద్రుడు |
| 8 | పాదము | రాదగినది - పోదగినది | విష్ణువు |
| 9 | పాయువు | విసర్జనీయము | మృత్యువు, మిత్రుడు |
| 10 | ఉపస్థము | ఆనందింపదగినది | ప్రజాపతి |
| 11 | మనస్సు | మననమొనరింపదగినది | చంద్రుడు |
| 12 | బుద్ధి | బోద్ధవ్యము | బృహస్పతి |
| 13 | అహంకారము | స్థూల శరీర అహంకర్తవ్యము | రుద్రుడు |
| 14 | చిత్తము | చైతన్యము | క్షేత్రజ్ఞుడు (ప్రత్యాగాత్మ) |
| 15 | తమస్సు | వికారము | ఈశ్వరుడు |
| 16 | అంతఃకరణము | నిర్వికల్ప స్ఫురణము | నారాయణుడు |
| 17 | సత్త్వము | జ్ఞత్వము | విష్ణువు |
| 18 | రజస్సు | వికృతి పొందదగినది | ఈశ్వరుడు |





క్షేత్రజ్ఞుని లక్షణాలు

ఇక క్షేత్రజ్ఞుణి లక్షణాలు తెలుసుకుందాము.

క్షేత్రజ్ఞ లక్షణాలు

1. **అమానిత్వం** : తన్నుతాను పొగడుకోకుండా ఉండటం

2. **అదంభిత్వం** : లాభంకోసంగాని, కీర్తికోసంకాని తన ధర్మాన్ని ప్రకటించుకుండా ఉండటం

3 **అహింస** : మనోవాక్కాయములతో ఇతర ప్రాణుల్ని పీడించుకుండా హింసించుకుండా ఉండటం

4 **క్షాంతి** : ఇతరులవల్ల తనకు అపరాధం కల్గినపుడు ఏ విధమయిన వికారము చెందుకుండా సహించకలగటం

5 **ఆర్జవం** : కుటిల స్వభావం లేకుండా ఉండటం

6 **ఆచార్యోపాసనం**: మోక్షసాధనాలను ఉపదేశించే గురువును శుశ్రూష చేయటం

7 **శౌచం**: బాహ్య శారీరక మలాలను లోపల ఉండే రాగం మొదలైన మలాలనుపోగొట్టుకోవటం

8 **స్థైర్యం**: మోక్షమార్గమందు నిశ్చయాన్ని కలిగి ఉండటం

9 **ఆత్మనిగ్రహం**: ఇంద్రియాలను మంచి మార్గంలో ఉంచటం

10 **వైరాగ్యం**: శబ్దస్పర్శరూప రసగంధాలనే ఇంద్రియ విషయాల ఎడల వాటిభోగాల ఎడల తీవ్ర వైరాగ్యం

11 **అనంహంకారం**: అహంకారాము లేకపోవటం

12 **జన్మ మృత్యు్య జరావ్యాధి దుఃఖదోషాను దర్శనం**: జన్మాదులన్నీ స్వరూపం చేత దుఃఖాలు కాకపోయినాదుఃఖాలకు కారణాలవుతున్నాయి కాబట్టి దుఃఖ రూపాలే.

**జన్మ దుఃఖం**: గర్భవాసము మల మూత్రాల మధ్య తొమ్మిది మాసాల నివాసం, జన్మ సమయంలో కలిగే దుఃఖం వీటిని గురించి సమాలోచన.

**మరణ దుఃఖం**: ఇంద్రియాలు పనిచేయక, నాడులన్నీ బిగిసి పోవటం మర్మచ్ఛేదనం, ప్రాణాలు బిగుసుకుపోవటం ఊర్ధ్వ శ్వాస మరణ తాపం వీటిని గూర్చి సమాలోచన.

**జరాదుఃఖం**: శరీరేంద్రియాదుల శైథిల్యం, మాంద్యం, కంపం వగైరావార్ధక్య బాధల అనుశీలనం.

**వ్యాధి దుఃఖం**: దేహతాపం, శీతల, శ్వేదాకం, దేహ దౌర్గ్యంధ్యం, జ్వర అతి సారాధి వ్యాధి బాధల అనుశీలనం చేయటం అవసరం. ఈ





దుఃఖాలను మళ్ళీ మళ్లీ ఆలోచిస్తూ ఉండటం వల్ల వివేకవంతునికి వైరాగ్యం, మోక్ష కాంక్ష కలిగి ఆత్మదర్శనం కోసం ఇంద్రియాలకు ప్రత్యాగాత్మయందు ప్రవృత్తి కలుగుతుంది. ఇవన్నీ జ్ఞాన హేతువులయినందున ఈ గుణాలను జ్ఞానం అంటారు.

13. **అసక్తి** : పుత్రులు, భార్య, ఇల్లు మొదలైన వాటి యందు ప్రీతి లేకపోవటం.

14 **అభినష్వంగం**: పుత్రదార గృహాదులు ఇవన్నీ మంచివనే తలంపుతో వాటియందు మమకారంతో అంటిపెట్టుకొని ఉండకుండా ఉండటం. ఈ ఆసక్తి అనేది జ్ఞానం కోసం కాబట్టి ఇదికూడా జ్ఞానమే.

15. **నిత్యమూ సమచిత్తం కలవాడై ఉండటం**

16. **పరమేశ్వరునియందు అవ్యభిచారియైన భక్తి**

17. **వివిక్త దేశ సేవిత్యం**: జన సమర్ధము లేనట్టి, సర్ప వ్యాఘ్రాదులు లేనట్టి ఉపద్రవాలు లేనట్టి ఏకాంత ప్రదేశంలో నివశించటం.

18.**ప్రాకృత జన సభలయందనాసక్తి** : సంస్కార హీనులు అవినీతులు అయిన ప్రాకృత జనుల సమావేశాలలో ప్రీతి లేకపోవటము

19. **ఆద్యాత్మ జ్ఞాన నిత్యత్వం.**

20. **తత్వ జ్ఞానార్ధ దర్శనం**

పైవన్నీ జ్ఞానం కలగటానికి ఉపకరించే విషయాలు కాబట్టి జ్ఞానమేవీటికి వ్యతిరిక్తమయినవన్నీ అజ్ఞానములు.

**జ్ఞేయము - బ్రహ్మము**

జ్ఞేయమైనట్టి బ్రహ్మము సత్తు అనటానికి వీలులేదు. అసత్తు అనటానికి వీలులేదు. అందుకే ''**యతో వాచో నివర్తంతే**'' అని

చెప్పబడినది. అనాది అయినట్టిది. ఉత్పత్తి తెలియబడనట్టిది. నిరతిశయమైనట్టిది. అది వాక్కుకు విషయంకాదు. స్థూలము కాదు, అణువూ కాదు, ఇంద్రియాలకు అగోచరం కాబట్టి అస్తి, నాస్తి అనే రెండురకాల జ్ఞానానికి అతీతమైంది. అందుచే అవాఙ్మనస గోచరం. ఆ బ్రహ్మము తెలిసిన దానికంటె తెలియని దానికంటె అతీతమైంది. అంతటా చేతులు కాళ్లు కలది. అంతటా నేత్రములు, శిరస్సులు, ముఖములు కలది. అంతటా శ్రోత్రేందియములు కలది. ప్రాణి సమూహమంతటా వ్యాపించి ఉన్నది. జ్ఞేయమైన బ్రహ్మము (జీవాత్మ) కర్మేంద్రియ జ్ఞానేంద్రియ, మనోబుద్ధుల యొక్క క్రియలతో గుణాలతో కూడిన నదిగా కనిపిస్తుంది కాని ఆజ్ఞేయానికి ఏ ఇంద్రియాలు లేవు. నిజానికి అది ఇంద్రియ వ్యాపారాదులతో కూడినది కాదు. ఆజ్ఞేయమైన బ్రహ్మము సర్వకరణ వివర్జితము. దానికి ఏ ఇంద్రియమూలేదు. దీనిని అంటకుండానే సంబంధము లేకుండానే ఉంటుంది. ఇట్లా ఉన్నా సమస్తాన్నీ భరించేది అదే. సత్త్వరజస్తమాలతో కూడివుండి కూడా వాటికి అతీతంగా ఉంటూ సుఖ దుఃఖమోహరూపంలో పరిణమించిన సత్త్వరజస్తమో గుణాలను శబ్ద స్పర్శ రూప రస గంధ ద్వారము అది - ఆజ్ఞేయ బ్రహ్మము - సాక్షాత్కరించు కొనగలదై వాటికి సాక్షిగా ఉంటుంది. అది వెలుపలా లోపల కూడా వ్యాపించబడింది. దేహభాసరూపమైన చరాచరాలన్నీ జ్ఞేయరూపమైన బ్రహ్మమే. అయితే అది ఆకాశం కంటే సూక్ష్మమైనందున అందరకూ కనిపించదు. స్వస్వరూపం చేత జ్ఞేయమే అయినప్పటికి అవిద్యాంసులకు అజ్ఞేయంగా ఉంటుంది. అవిద్వాంసులకు అనేక కోట్ల సంవత్సరాలకయినా అప్రాప్యంగా ఉంటుంది. కాబట్టే దూరస్థం అన్నారు. విద్వాంసులు జ్ఞేయరూపులే కాబట్టి వారికి సమీపంలోనే ఉంటుంది. ప్రాణుల





ఏకాదశేంద్రియాలు స్థూలభూతాలు ఇవి వికారములైనందున ఆత్మకు దూరంగా ఉంటాయి. మహత్తు (బుద్ధి), అహంకారం, పంచతన్మాత్రలు, శబ్దస్పర్శ రూప రస గంధాలు) అవ్యక్తం ఇవి ఆత్మకు సన్నిహితంగా ఉంటాయి. కాబట్టి అంతఃశబ్దంతో లోపల ఉండేదిగా చెప్పబడ్డాయి. చరాచరాలు అంటే జీవులు అన్నీను.

జ్ఞేయమైన బ్రహ్మము ప్రతి దేహమందూ అకాశంలాగా అవిభక్తంగా - ఏకంగా వున్నట్లు ఉంటూనే విభిన్న ప్రాణులందు వేరువేరుగా-విభజింపబడి ఉన్నట్లుగా ఉంటుంది. ప్రతిదేహమందూ ఉన్నది బ్రహ్మమే అయినా దేహములందే తాదాప్య ప్రతీతి కలగటంవల్ల - దేహాలకు సంబంధించిన జ్ఞానం మాత్రమే మనకు కలగటం వల్ల - విభక్తమై ఉన్నట్లుగా కనిపిస్తుంది. ఆ బ్రహ్మమే స్థితికాలంలో నిఖిల భూతాలను భరిస్తుంది. ప్రళయకాలంలో నిఖిల భూతాలను లయం చేస్తోంది. ఉత్పత్తి కాలంలో భూతాలను సృష్టించే స్వభావం కలదిగా ఉంటోంది.

జ్ఞేయమైన ఆ పరబ్రహ్మము ఆదిత్యాది జ్యోతిస్సులకు కూడా జ్యోతిగను. వాటిని కూడా ప్రకాశింపచేస్తోంది. ఆత్మ చైతన్య జ్యోతిస్సు చేతనే వ్యాప్తమై ఆదిత్యాది జ్యోతిస్సులన్ని ప్రకాశిస్తున్నాయి. అంధకారానికి (అజ్ఞానానికి) అవతల అసంస్పృష్టంగా వుంటుందంటారు. అమానిత్వాది 20 గుణాలతో చేప్పబడిన జ్ఞానాలు, జిజ్ఞాస్యం అని చెప్పబడిన జ్ఞేయము, జ్ఞానానికిఫలంగా చెప్పబడిన పరబ్రహ్మం (జ్ఞానగమ్యం) ఈ మూడూ అంటే జ్ఞానం, జ్ఞేయం, జ్ఞానగమ్యం ప్రతిప్రాణి హృదయమందూ ఉన్నాయి.ఈ మూడు అక్కడే ప్రకాశమౌతూ ఉంటాయి. ఈ మూడింటిస్థానం బుద్దిగుహ. ఈ మూడింటి అభేధాన్ని గుర్తించాలి. ప్రకృతి, పురుషుడు (జీవుడు) ఈ

ఇరువురు ఈశ్వరుని ప్రకృతులే. ఈ రెండు అనాదులు కాబట్టి నిత్యాలు. వాటికి కారణం లేదు. ఈశ్వరుడు నిత్యమే కాబట్టి ఈశ్వర ప్రకృతులు కూ డా నిత్యాలే.

బుద్ధి మొదలుకొని దేహేంద్రియాల వరకూ కల వికారములు సుఖ దుఃఖ మోహరూపములైన గుణాలు ప్రకృతి వల్ల కలిగేవే. బుద్ధ్యాది వికారాలు గుణాలు మాయా పరిణామాలే. శరీరం కార్యం దానిలో ఉన్న దశేంద్రియాలు మనస్సు, బుద్ధి, అహంకారం ఈ 13 కరణాలు. వీటికి కారణం ప్రకృతి. అంటే వీటి కర్తృత్వం ప్రకృతిది. ఆ కార్యకరణాలను ఉత్పత్తి చేసే కర్తృత్వ భావాన్నే కార్యకారణ కర్తృత్వం అంటారు.

పురుషుడు, జీవుడు, క్షేత్రజ్ఞుడు, భోక్త, ఇత్యాదులన్ని సమానార్థకాలే. సుఖ దుఃఖాల భోక్తృత్వం జీవునికి ఎట్లా వస్తోంది? భోగ్యరూపమయిన ప్రకృతితో దానికి విపరీత ధర్మాలు గల పురుషునికి అవిద్యారూపమయిన సంయోగంతో భోక్తృత్వభావం వస్తోంది. సంసార సంభవిస్తోంది. ఈ విధంగా ప్రకృతికి కార్యకరణ కర్తృత్వం పురుషునికి సుఖ దుఃఖ భోక్తృత్వం సంభవిస్తున్నాయి.

భోక్తయైన పురుషుడు అవిద్యా స్వరూపమై కార్యకారణ రూపంలో పరిణమించినట్టి ప్రకృతియందు ఉంటూ, ఆ పకృతివల్ల కలిగినట్టి సుఖమూ, దుఃఖము మోహము రూపంలో ఉండే సత్త్వరజస్తమో గుణాలను పొంది నేను సుఖిని నేను దుఃఖిని, నేను మూఢుణ్ని నేను పండితుణ్ని అని అనుకుంటూ అనుభవిస్తున్నాడు. ఆయా భావాలను సాక్షాత్కరించుకుంటున్నాడు. అవిద్యతో సుఖదుఃఖ మోహరూపమైన గుణాలను అనుభవించటంలో ఉండే సంగమమే సంసారానికి కారణం.





భోక్త అయిన పురుషునికి గుణాలయందు ఉండుడే సంగమమే దేవ-మనుష్య-పశు తిర్యగ్యోనులందు పుట్టటానికి కారణమౌతోంది. గుణ సంగమమే బంధకమౌతోంది. అంతే తప్ప గుణసాన్నిధ్యం బంధకంకాదు. విద్వాంసులకు గుణ సాన్నిధ్యం ఉన్నా గుణ సంగమం ఉండదు. కాబట్టి పునర్జన్మ, సంసారం ఉండదు.

పై విధంగా "**నేను**" సాక్షాత్తు పరమాత్మనే అని తెలుసుకుంటాడో, అంతేకాక అవిద్యా రూపమయిన ప్రకృతిని వికారములతో కూ డి నశించిపోయే దానినిగా తెలుసుకుంటాడో అట్టివాడు రకరకాలుగా సంచరిస్తున్నా ఆవిద్వద్దేహం నాశనమయిన పిమ్మట మళ్ళీ జన్మను పొందదు. దీనిని బట్టి జ్ఞానోత్పత్తి అయిన పిమ్మట జన్మలేదని చెప్పబడ్డది. వదలి పెట్టిన బాణం, దాని వేగం తగ్గి ఆగిపోవలసిందే తప్ప మధ్యలో ఉపసంహరించటానికి వీలు లేదు కాబట్టి సంసారక్షయ పర్యంతం ప్రారబ్ధకర్మ క్షయం కాదు. ఎక్కుపెట్టబడి ఇంకా వదలి పెట్టబడని బాణం లాగా ఆగామి సంచిత కర్మలు జ్ఞానాగ్ని చే దగ్ధమైన బీజం లాగ జన్మను ఇవ్వలేవు, కాబట్టి విద్వాంసుని ప్రస్తుత శరీర పతనానంతరం మళ్ళీ జన్మ ఉండదు. కొందరు ధ్యానం చేత సంస్కృతమైన అంతఃకరణతో బుద్ధి యందు ప్రత్యాగాత్మను చూస్తారు. ఇది ధ్యానయోగం. మరికొందరు సాంఖ్యంచేత (జ్ఞానంచేత) సంస్కృతమైన అంతఃకరణంతో (సాంఖ్య యోగంతో) ప్రత్యాగాత్మను చూస్తారు. మరికొందరు ఈశ్వరార్పణ బుద్ధితో చేసే కర్మ ద్వారా (కర్మ యోగం ద్వారా) సత్త్వశుద్ధి కలిగి జ్ఞానోత్పత్తి కాగా సంస్కృతాంతః కరణంతో ప్రత్యాగాత్మను దర్శిస్తారు.మరికొందరు పై విధానాలేవీ ఆచరించలేకుండా గురువు వల్ల ఉపదేశాన్ని పొంది ఆ ఉపదేశం మీద

శ్రద్ధతో ఉపాసించి ఆ సాధన ద్వారా మృత్యు సంసార సాగరాన్ని దాటుతున్నారు. స్థావర జంగమాత్మకమైన ఎంతటి అల్పమైన వస్తువైనప్పటికి క్షేత్రజ్ఞ సంయోగం వలనే జనిస్తోంది. చీమలు మొదలైన అల్పప్రాణుల్లో సైతం క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగం ఉన్నదని గ్రహించాలి.

ఈ క్షేత్ర క్షేత్రజ్ఞన సంయోగం మిధ్యాజ్ఞానమయింది. రజ్జుసర్ప భ్రాంతిలాగ, శుక్తి రజత భ్రాంతిలాగ. మిధ్యాజ్ఞానం జన్మహేతువు. మిధ్యాజ్ఞానం తొలగిపోవటంతోనే క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగం తొలగిపోతుంది. స్వస్వరూపస్థితి కలుగుతుంది. బ్రహ్మాది స్తంభ పర్యతం నిఖిల భూతము నందు నిర్విశేషంగా ఉండే (ఒకే రూపంలో ఉండే) నిఖిలభూతాలు నశించినప్పటికీ తాను మాత్రం నశింపకుండా ఉండునట్టియు, దేహేంద్రియాదులు, బుద్ధి అవ్యక్తులకంటె పరుడైనట్టి ఏకమూ, అవ్యక్తమూ అయిన పరమాత్మను తెలుసుకున్నవాడే సమ్యగ్దర్శనం కలవాడు. ఇటువంటి సమ్యగ్దర్శనం వల్ల జన్మహేతువులైన మిధ్యాజ్ఞానం తొలగిపోతుంది. క్షేత్ర క్షేత్ర సంయోగం ప్రాప్తించకుండాపోతుంది. అందుచేత ఎల్లప్పుడూ ఆత్మ స్వరూపంగా ఉండాలి.

అజ్ఞానులైన వారు ప్రసిద్ధము ప్రత్యక్షము అయినట్టి ఆత్మను తిరస్కరించి అనాత్మలైన శరీరాదుల్ని ఆత్మగా భావించి ధర్మాధర్మాలు-పుణ్యపాపాలు ఆచరిస్తూ వాటికి ఫలంగా ఒక శరీరమనే ఆత్మను నాశనం చేసి వేరొక శరీరమనే ఆత్మని పొందుతున్నారు. ఇటువంటి అజ్ఞానులు ఈ విధంగా మాటిమాటికి తమ శరీరమనే ఆత్మను పొందుతూ దానిని మళ్లీ నాశనం చేస్తూ ఉంటారు కాబట్టి వారందరూ ఆత్మహంతకులు





అవుతున్నారు. జ్ఞానులు ఆ విధంగా తమ్ముతామే హింసించుకోరు.పరమాత్మ యొక్క త్రిగుణాత్మకమైన మాయనే ప్రకృతి అంటారు. ఆ ప్రకృతి ద్వారానే సమస్త కర్మలు(మనస్సు, వాక్కు, శరీరంతో జరిగే కర్మలన్నీ) అన్ని విధాలా జరుగుతూ ఉంటాయని, క్షేత్రజ్ఞుడు ఉపాధి రహితమైన అకర్త అని తెలుసుకొన్న వాడే పరమార్ధాన్ని తెలుసుకున్నవాడు. అతడే సమ్యగ్దర్శనుడు. నిర్గుణుడు, అకర్త, నిర్విశేషుడు ఆత్మకు ఆత్మకు ఆకాశంలాగా బేధభావం ఉండదు. స్థావర జంగమాత్మకములైన సమస్త భూతాల్లోనూ పరస్పరం కనిపించే భిన్నత్వాన్ని, సద్రూపమైన ఆత్మయందున్న దానినిగా శాస్త్రాచార్యోపదేశం వల్ల తరించి ఆత్మను ప్రత్యక్షంగా ఇదంతా ఆత్మ స్వరూపమే అని తెలుసుకున్నప్పుడు ఆ ఆత్మ వలననే ప్రాణము, సమస్త భూతవిస్తారమూ (పృధివ్యస్తే జోవాయురాకాశాలు) పరస్పరభిన్నత్వము కూడా కలిగిందని వీటి అవిర్భావాలన్ని స్వప్నంలో జరిగేలాంటిదని తెలుసుకున్నవాడు బ్రహ్మమే అవుతున్నాడు.

పరమాత్మ అనాది అయినందున అవ్యయుడు . క్షయం లేనివాడు కాబట్టి అవయవరహితుడు. పరమాత్మ నిర్గుణుడు కాబట్టి అవ్యయుడనే అనవచ్చు. గుణాలతో కూడిన వస్తువయితే ఆ వస్తువుకు క్షయం ఉంటుంది. ఆత్మ గుణరహితుడు కాబట్టి క్షయం లేదు. అయితే ఆత్మ యొక్క ఉపలబ్ది ఉనికి శరీరాల్లో సంభవిస్తుంది కాబట్టి శరీరస్థుడంటున్నాము. పరమాత్మ స్వరూపంలో శరీరంలో ఉంటూ కూడా అవ్యయుడు. అనాది, నిర్గుణుడు, నిర్వికారుడు కాబట్టి తాను కర్మలను చేయడు. అసంగుడు కాబట్టి దేహేంద్రియాదుల కర్మల వల్ల కలిగే దోషం అతనికి అంటదు. అంతటా వ్యాపించి ఉన్నప్పటికి ఆకాశం సూక్ష్మ రూపంలో ఉండటంవల్ల దేనినీ సోకకుండా ఉంటూ దేనితోనూ సంబంధం లేకుండా

ఉంటుంది. అలాగే పరమాత్మ దేహమందు అంతటా ఉన్నప్పటికీ అన్ని శరీరాలలో ఉంటుకూ డా శరీరాలను అంటకుండా ఉంటాడు. సూర్యుడు ఈ సమస్త లోకాలను ఎట్లా ప్రకాశింప చేస్తున్నాడో, ఘటాదులైన అన్ని వస్తువుల్లోనూ ప్రతిఫలిస్తూ ప్రతిబింబిస్తూ వాటిని అంటకుండా వుంటున్నట్లు గానే పరమాత్మ మహా భూతాలు మొదలుకొని ధృతిపర్యంతమైన క్షేత్రాన్ని ఈ క్షేత్రజ్ఞుడొక్కడే ప్రకాశింప చేస్తున్నాడు సూర్యుడిలాగ. ఈ విధంగా క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగాన్ని (ప్రకృతి పురుష లక్షణాలు) ప్రకృతి మాయాశక్తి నుండి తప్పించుకొనే ఉపాయాన్ని జ్ఞాన చక్షువుతో తెలుసుకోగలిగిన వారు ముక్తిని పొందుతారు. అయితే కేవలం ప్రకృతి పురుష భేధ విజ్ఞానం చేత మాత్రమే జ్ఞానం సిద్ధించదు. సర్పం కాదనే జ్ఞానంతో అంతవరకు ఉండినట్టి సర్పమనే భ్రాంతిని తొలగించుకోగా రజ్జు యొక్క యధార్ధ జ్ఞానం వల్ల భయం పోయినట్లుగా ప్రకృతి యందలి భ్రాంతిని తొలగించుకొని దాని యధార్ధ జ్ఞానాన్ని పొందటంవల్ల సంసారం తొలగి కైవల్యం సిద్ధిస్తుంది. (భగవద్గీత ఆధారంగా).





## 10. మాయ - అధ్యారోపవాదము-అపవాదము-వాటి భ్రమలు -మాయను దాటుటెలాగా -మాయకు నిత్యత్వము ఉన్నదా?

మోక్షం కోరేవాడు అధ్యారోప వాదం వల్ల బ్రహ్మ విచారణ చేసి క్షేత్రం క్షేత్రజ్ఞ విభాగము చేసుకొని తత్త్వ విచారణలో సాధన చేసి మోక్షం పొందాలి. అధ్యారోపవాదం అంటే అసలు వస్తువుని దానిమీద ఆరోపించి వ్యవహరించటం. **ఉదాహరణ** (i) మసక చీకటిలో ఒక త్రాడు చూసి పాముగా భ్రమించి అజ్ఞానంతో భయ కంపాలకు లోను కావటం ఎండలో ధగధగలాడుతున్న ఆలిచిప్పను చూసి వెండి అని భ్రమించి దాని కొరకు ఆశపడటం (iii) ఎడారిలో తీవ్రమయిన ఎండమావులను చూసి జలమని భ్రమించటం. (iv) చీకటిలో చెట్టు మోడుని చూసి దొంగ అని భ్రమించి కేకలు వేయటం. (v) అదే విధంగా చూడబడే జగత్తు అంతా ఆత్మ మీద ఆరోపించి వ్యవహరించడం.

ఇది అసలు వస్తువు ఎరుగక చేసే ఆరోపం. ఆ ఎరుగక పోవడాన్నే అవిద్య అని, తమస్సు అని, మోహమని, మూల ప్రకృతి అని అవ్యక్తమని, మాయ అని ఇంకా ఎన్నో పేర్లతో వ్యవహరిస్తారు. ఏదిలేదో అది ఉన్నట్లుగా కనిపించేది మాయ. **"యామాసాయా మావిద్యతే సా అవిద్యా"** ఈ మాయకు రెండు ప్రబల శక్తులున్నాయి. ఆవరణశక్తి అని విక్షేపణశక్తి అని. ఉన్న వస్తువుని ఆవరించిలేనట్లు చేసేది ఆవరణ శక్తి. ఈ ఆవరణ శక్తి కార్యమే సంసారవృక్షానికి మూలం. లేని వస్తువును ఆరోపించి ఉన్నట్లు చేసేది విక్షేపణ శక్తి. తాడును పాము అనుకున్నప్పుడు తాడుని కనపడకుండా చేసి పాముగా చూపినది ఈ రెండు శక్తులే. ఈ శక్తులవలననే ఉన్నది పరబ్రహ్మ మైనప్పటికి దానిమీద జగత్తుని అజ్ఞానంచేత, అవిద్యచేత

ఆరోపించుకొని వ్యవహరిస్తున్నాము. జన్మ పరంపరలకు లోనవుతున్నాము. ఈ అవిద్య నశించగానే జ్ఞానోదయమయి, మాయాకార్యమయిన జగత్తు పరబ్రహ్మలో లయించి పరబ్రహ్మము అనుభవములోకి వస్తుంది. అదేమోక్షానికి హేతువు. త్రాడులో చూసిన పాముకు సత్యత్వమున్నట్లా అంటే అవిద్య ఉన్నంతవరకు అది సత్యమే. దాని వలన కలిగే భయభ్రాంతులు కుడా నిత్యమే. దీనినే విక్షేపశక్తి అంటారు. అపుడు దానికి అధిష్ఠానమయిన తాడు గోచరించదు. ఆవరణ శక్తివల్ల. ఎప్పుడయితే గురువు వలె ఒకరు దీపం చూపించి అది పాము కాదురా తాడురా నాయనా అని చూపించాడో భ్రాంతి లేక అవిద్య పోయి జ్ఞానోదయమవటం వలన పాము దాని అధిష్ఠానమయిన త్రాటిలో లయమయింది. అందుచేత భయభ్రాంతులు పోయాయి. కాబట్టి మాయా కార్యానికి సత్యత్వము లేదు. జ్ఞానోదయమవగానే అంటే అజ్ఞానము నశించగానే మాయా లేదు, మాయాకార్యము లేదు. అందుచే **"బ్రహ్మ సత్యం జగన్మిథ్య"** అన్నారు జగద్గురువు శ్రీ శంకరాచార్యులువారు.

అయితే ఈ చూడబడే జగత్తు అధ్యారోపవాదం వల్ల ఏ విధంగా ఎవరిచేత సృష్టించబడిందో విచారించుకుందాం. ఈ విచారణ ఆత్మ జ్ఞానానికి ఉపయోగము. ఈ దృశ్యమాననామ రూపాత్మకమైన జగత్తు సత్యస్తువు అయిన, నిర్వికారమయన, నిశ్చలమయిన, భేధవర్జితమైనటు వంటి పరబ్రహ్మము మాయచే ఆరోపింపబడింది అజ్ఞానులకు. అయితే సద్గురువు తత్త్వబోధ వలన జ్ఞానోదయమయి నామరూపాత్మకమైన జగత్తు మిథ్యయని నిశ్చయించుకొని నిర్వికల్ప సమాధి ద్వారా ఆత్మానుభూతిని పొందిన వెంటనే నామ రూపాత్మకమైన జగత్తు కల్పితమని జీవుడు బంధ విముక్తుడవుతాడు. కాబట్టి ఈ దృశ్యమాన జగత్తు అధిష్ఠాన బ్రహ్మము కంటేవేరు కాదు. ఎలాగ అంటే కుండలు మట్టి కంటె వేరు కాదు.





రకరకాలయిన ఆభరణములు బంగారము కంటె వేరు కాదు. కెరటములు సముద్రము కంటె వేరుకాదు. అందుచే సాధకుడు నామరూపాత్మకమైన జగత్తును మిధ్య అని తెలుసుకొని వాటియందు దృష్టిని ఉంచక దానికి అధిష్ఠానమయిన సత్యమయిన పరబ్రహ్మము యందు ఎల్లవేళల నిలకడ కలిగి తరించాలి. అంతేకాని నామ రూపాత్మకమైనజగత్తుని శాశ్వతమని భ్రమించి మోహంతో కోర్కెలతో త్రిగుణాలకు లోనయి దాని వెంట పరుగిడితే జనన మరణమనే సంసార చక్రమందు తిరుగాడుతూనే ఉండాలి. భ్రాంతిజన్యమైన జగత్తు యందు విరక్తి కలిగి సత్యవస్తువైన ఆత్మయందే మనస్సు లగ్నపరచి ఆత్మానుభూతిని పొంది తరించాలి. ఇదే మానవ జన్మ ముఖ్య లక్ష్యం.

వ్యష్టి దేహేంద్రియాలంటే జీవులందరకు వేరువేరుగా ఉన్న వారి దేహములు, ఇంద్రియములు, మనస్సు, ప్రాణము మొదలుగునవి. సమిష్టి దేహేంద్రియాంద్రులు అంటే సర్వలోక సర్వజీవరాశుల యొక్క దేహేంద్రియాలతో కూడుకున్న పరమేశ్వరుని విరాట్ పురుషుని దేహేంద్రియాదులు అని చెప్పుకోవాలి. **ఉదాహరణకు** వనము అన్నాము. అది వృక్షముల సముదాయము. అందులోఅనేక రకములయిన వృక్షములు ఉండవచ్చును. అంటే మామిడి అని, సపోటా అని, కొబ్బరి అని ఈ విధంగా వనము సమిష్టి. ఫలానా వృక్షము వ్యష్టి. ఈ సమిష్టి దేహాదులకు మూలము మాయ. మాయ ఉపాధిగా కలవాడు ఈశ్వరుడు. అవిద్యను ఉపాధిగా కలవాడు జీవుడు. ఇద్దరూ పరమాత్మ ప్రతిబింబ స్వరూపులే. కాబట్టి జీవేశ్వరులు ఇద్దరూ అభిన్నులు. అదే మాదిరిగా అవిద్య అన్నా మాయ అన్నా ఒకటే అని గ్రహించాలి. అంతేకాని అది వేరు వస్తువు కాదు.

"సదేవ సోమ్యేదమగ్ర ఆశీత్ ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ-నేహ నానాస్తి కించన". "యతో వాచో నివర్తంతే అప్రాప్యా మనసా సహ"

మనస్సు గాని వాక్కుగాని ఎవ్వని చెంతకు పోలేక మరలునో అట్టివాడు పరబ్రహ్మ. ఈ కనబడు ప్రపంచమంతయు సృష్టికి పూర్వమున సద్రూపుడు, సజాతీయ విజాతీయ,స్వగత భేధములు లేని వాడుగను పరమేశ్వరుడు (సత్తా మాత్రమున) గానే ఉండెను. అతిస్థిరమైనదియు, గంభీరమైనదియు, సర్వ వ్యాపకమైనదియు, చీకటి వెలుతురు కానిదియు, నామరూపము లేనిదియు ప్రజ్ఞాన రూపమైనదియు ఒకానొక పదార్థముంది. ఆ విధంగా ఉన్న వస్తువుకే వ్యవహారార్థమై విద్వాంసులు ఋతమని, ఆత్మ అని, పరబ్రహ్మ అని, సత్యమని, అనేక విధములైన సంజ్ఞలు కల్పించారు. ఇది దేనితోను సంబంధింపక అద్వీతీయమై ఉన్న వస్తువు స్వయముగా గోచరించుట మొదలిడెను. **"తదైవ క్షతసో కామయత, బహూంస్యాంం ప్రజాయేంతి తదైవాను విశత్".** పరమాత్మనుండి అచింత్యమైన ఇచ్ఛాశక్తి స్వరూపమగు మాయాశక్తి పరిణామము మూలంగా ఈశ్వర రూపముగా, జీవ రూపముగా, నానావిధ భోగ్యాత్మకమును ఈ విధము అనేక చిత్ర విచిత్రములైన జగజ్జాలము సముద్భవించింది. ఈ అఖిలద్వైత ప్రపంచమునకు పరమాత్మయు, మాయయు కారణమగునని చెప్పుకోవాలి. ఈ మాయ ఊహింపనలవికానిది. ఈ మాయాశక్తి వలన కలిగిన విజృంభణము జగత్తు రూపకముగా గోచరిస్తోంది. దీనికి అదిష్టానము పరమాత్మయే. మాయాశక్తి వలన కలిగిన దగుటచే దానిని మాయికము అంటారు. కాబట్టి జగత్తును లేని దానిని మాయాశక్తి సృష్టించిదను కుంటాము కాబట్టి అసత్యమే. అంటే సత్యము కానిది. గారడీవాడు తన శక్తిచే లేని వస్తువులను ప్రదర్శించిన వస్తువులు మాయికములు కదా! అది అసత్యములే కదా ఆ సమయములో. అవిద్య





వలన సమ్మోహంతో ఉన్నట్లుగా గోచరించటం చేత సత్యములను కుంటున్నాము కాని అవి సత్యంకాదు. మిధ్యా వస్తువు. అదే విధంగా ఈ జగత్తు అంతా మాయికము కాబట్టి అసత్యము. వాస్తముగా లేనిది. అయిననూ వ్యవహారకాలమున గోచరించుచున్నది కాబట్టి మిధ్య అని నిర్ణయించాలి. ఈ మాయ 1. సద్రూపము అని కాని, అసద్రూపము అనికాని 2. ఆత్మ కంటే వేరైనది అని కాని వేరుకానిది అనికాని 3. సావయవము అనికాని నిరవయము అనికాని నిరూపించటానికి వీలులేదు. కారణములు ఈ కింద చర్చించుకుందాము.

1. మాయస్వకార్యమైన దృశ్య ప్రపంచము అందరకూ కనిపిస్తోంది కాబట్టి **"అసత్తు"** లేనిది అనిచెప్పటానికి వీలులేదు. అసత్తు అంటే లేనిది అని అర్థము. అదే విధంగా మాయసత్తు అంటానికి కూడా వీలులేదు. ఎందుకంటే ఆత్మతత్త్వ విజ్ఞానము కలుగగానే అది తొలగిపోతోంది. **"సత్తు"** అంటే ఎల్లప్పుడూ అంటే భూత, భవిష్యత్తులో వర్తమానంలో నశించక మార్పు చెందక ఒకే విధంగా ఉండేది. ఆత్మ వస్తువు, సద్రూపము, సద్వస్తువు అది ఎన్నడునూ నశించదు. మార్పు చెందదు. ఉన్న పదార్థముల యొక్క ఉనికిని, నశించుపదార్థముల యొక్క నాశనమును, లేని పదార్థముల యొక్క లేనితనమును (అభావమును) తెలియపరస్తూ సర్వదా ఏక రూపంలో భాసిస్తుంది. అదియే విజ్ఞానము చేతను ఎన్నడైనను నశింపదు. ఆత్మ సద్వస్తువు. మాయ అటువంటిది కాదు. అందుచే "సత్తు" అని చెప్పడానికి వీలులేదు.

2. అదేవిధంగా మాయ ఆత్మకంటే వేరైనదని అనుటకు వీలులేదు. ఎందుకంటే ఆత్మ సత్తకంటే వేరుగా ఈ మాయకు సత్తలేదు కనుక. సత్త అంటేఉనికి అని అర్థము. ఉదారహరణకు త్రాడును మసక చీకటిలో చూసిపామని భ్రాంతి కలుగుట. ఆ చీకటిలో కనిపించిన పాము సత్త(ఉనికి)

లేదు. అసలా పాము లేదు కాని ఆ పాము కనిపించిన వారందరికీ ఉంది అనే భావము మాత్రము స్ఫుటముగా తెలుస్తోంది.''ఉన్నది'' అను భావమునకు సంబంధించిన ఉనికి (సత్త) పాముది కాదు. అది ఎక్కడిది అని విచారిస్తే ఏ నిజమైన వస్తువు (త్రాడు) అక్కడ ఉందో ఆ వస్తువు యొక్క నిజరూపమును గుర్తింపలేక ఇది పాము అని భ్రాంతిని అతడు పొందెనో ఆ వస్తువుకు సంబంధించిన ఆ ఉనికి (అసత్తు) అనియు ఆ సర్పమే భ్రాంతి వలన కనిపిస్తోంది కాని, ఆసత్తు (ఉనికి) సర్పమునకు సంబంధించినది ఏ మాత్రమూ కాదనియును తెల్తుంది. సర్పమునకు సంబంధించిన సత్త (ఉనికి) త్రాడుకు సంబంధించిదియే. త్రాడు ఉన్నప్పడే పాము గోచరించుటమూ, సర్పము ఉన్నది అను భావము కలుగటయు సంభవిస్తోంది. త్రాడు లేనపుడు ఏమీ లేదు. భ్రాంతి అంటే ఆరోపము - అధ్యాస. భ్రాంతి ఏర్పడినపుడు త్రాడు మొదలగు వాస్తవమైన వస్తువులకు అధిష్ఠానమని వానియందు అజ్ఞాన వశమున కల్పింపబడిన సర్పాది పదార్థములకు ఆరోప్యములని, ఆరోపితములని, అధ్యస్తములని ఈ విధంగా వ్యవహరిస్తున్నారు. ఆరోపిత పదార్థాలకు అధిష్టాన వస్తువు యొక్క సత్త కంటే (ఉనికి) వేరుగ వాటి సత్త ఉండదు. ఆ విధంగానే పరమాత్మ యందు కల్పింపబడిన మాయయు ఆత్మ సత్త కంటే వేరుగ తద్వ్యరిక్తమైన సత్త లేనిది కనుక ఆత్మకంటే వేరు కానిది అని చెప్పవలయునే కాని వేరైనది అని చెప్పుట వీలులేదు. అట్లే మాయ ఆత్మకంటే వేరు కానిది అని అనుటకు వీలు లేదు. ఎందుకంటే మాయ జడము. ఆత్మ చేతనము.మాయ తమో రూపము. ఆవరణ స్వభావము కలది. ఆత్మవిమల బోధఘనము, ప్రకాశమాత్ర స్వభావకము. ఇట్లు విరుద్ధ స్వరూప స్వభావములు కల మాయ ఆత్మ కంటే వేరు కానిది యెట్లు కాగలదు? చీకటి వెలుతురు ఏనాడయినా ఒకటి అవదు కదా! అట్లే





మాయ ఆత్మ కంటే వేరు కానిది అని చెప్పటానికి వీలు లేదు.

3. అట్లే మాయ సావయవము (అవయనులు కలది) అని అనటానికి కూడా వీలు లేదు. ఎందుకంటే అది అనాది పదార్థము కనుక దానికి కారణములగు అవయవములుండవు. అనాది అంటే పుట్టుక లేనిది. కారణము లేనిది అని అర్థము. అందుచే మాయ సావయమని చెప్పటానికి వీలు లేదు. అట్లే మాయ నిరవయవమని చెప్పటానికి కూడా వీలు లేదు. ఎందుకంటే మాయా కార్యాములగు (మాయ వల్ల పుట్టుచున్న) ఘటపటాది పదార్థములు సావయవములుగా కనిపిస్తున్నాయి. కనుక సావయములగు మొలకలు మొదలైనటువంటి కార్యవస్తువులకు అంటే పుట్టుచుండెడి వస్తువులకు కారణమైన విత్తనములు మొదలైనవి సావయములై ఉన్నట్లు చూస్తున్నాము. కాబట్టి సావయవములగు ఘటాది సర్వ పదార్థములకు మూలకారణమైన మాయయు సావయవము అని చెప్పవలసి వస్తుంది. అందుచేత మాయ నిరవయము అని చెప్పటానికి వీలు పడదు. ఈ విధంగా విచారిస్తే ఇట్టిది అని నిరూపించుటకు వీలుకానిదిగా ఉండుటచే అచింత్యము అని చెప్పబడుచున్నది. **''అచింత్యము''** అవిచారణీయమగు ఈ మాయ స్వవిలాసముచే సర్వజీవులను సమ్మోహింప చేయుచు జనన మరణ పరంపర లక్షణము, సర్వ అనర్థ సఙులము అగు సంసారమందు నిమగ్నులను చేస్తోంది. భ్రాంతి వలన పాము కాని త్రాడునందు సర్ప స్వరూపము గోచరించగా దానిని స్వరూపాధ్యాస అనియు, సర్పము అను జ్ఞానము కలుగగా దానిని జ్ఞానధ్యాస అనియు అంటారు. ఈ స్వరూపాధ్యాస జ్ఞానాధ్యాస లేర్పడుటకు మూలము త్రాడు. దానిని సాధారణముగా అధిష్ఠానమని, ఆరోపాధిష్ఠానమని వ్యవహరిస్తారు. ఈ మానవులు ఆత్మ యందలి యథార్థమైయున్న బ్రహ్మత్వమును గుర్తింప నేరక దాని అజ్ఞానవశమున బ్రహ్మత్వ విపరీతములగు కర్తృత్వ, భోక్తృత్వాది,

విపర్ణాంశములను విశేషాంసములగ గ్రహించి భ్రాంతిని పొంది నేను భోక్తను. ఇట్టి విరుద్ధ ప్రతిపత్తి కలవారై జనన మరణాది సర్వానర్థ సంకులమగు సంసారమును పొందుచున్నారు. ఇట్టి సర్వానర్థములును (సంసార మంతయు) సర్వ వ్యవహారముల యందును **"నేను"**, **"నేను"** అని వ్యవహరింపబడుచున్న ఆత్మ వస్తువునందలి విశేషాంశమగు బ్రహ్మ స్వరూప జ్ఞాన మూలకములే కాబట్టి తన్నివృత్తి - ఆత్మతత్త్వ (బ్రహ్మ స్వరూప) జ్ఞానమువలన కలుగ గలదని తెలియవలయును. "ఇది త్రాడు" అని ఇదం వస్తువు యొక్క యథార్థ స్వరూపము తెలియబడగా, ఇంతకు పూర్వము గోచరించిన పాము కాని భయకంపాదులుగాని ఏమియు మిగులక మటు మాయమైనట్లు **"అయమాత్మా బ్రహ్మ", అహం బ్రహ్మాస్మి, బ్రహ్మైవాహమస్మి"** అను ఇట్టిశృతి వాక్యముల వలన **"నేను బ్రహ్మ వస్తువునే"** అయి ఉంటిని అని ఆత్మ వస్తువు యొక్క యధార్థ స్వరూపమగు బ్రహ్మత్వము తెలియబడిన వెంటనే ఆత్మయందు ఇంతకు ముందున్న అజ్ఞానకాలమున గోచరించిన కర్తృత్వ భోక్తృత్వాది విపరీత ధర్మములను తత్ప్ర యుక్తమగు నానావిధ అనర్థ భయమును మటుమాయమై స్వరూపము వెలుగొందును. ఇది యే ముక్త స్థితి - ముక్తికి కారణమగు ఆత్మ యొక్క యధార్థజ్ఞానము, శ్రుతి వాక్యము వలన గాని కలుగదు. గాన శృతి సారభూత మహా వాక్యార్థము విచారణ 14 వ ప్రకరణలో చర్చించుకుందాము.





## 11. ఈ సంసారము ఎవరికి?

కర్తృత్వ భోక్తృత్వాది నానావిధ, అధర్మ, ధర్మములతో కూ డినది, బహు దుఃఖములలో నుండునది, జనన మరణ ప్రవాహాముతో కూ డినది సంసారము. ఈ సంసారము శుద్ధ చైతన్య ఆత్మ వస్తువుకు సంభంధిచినదా లేక అహంకార వృత్తులతో కూ డుకొని ఉన్న అహంకారాత్మకు సంబంధిచినదా? అనే సమస్యను చర్చించుకుందాము. ఈ రెంటిలో ఏ ఒక్కదానికి సంబంధించినది కాదు. ఎందుకంటే శుద్ధాత్మకే వలము సత్‌చిత్ సుఖాత్మకము, అసంగము, అద్వితీయము, విమలము, పరిపూర్ణము కాబట్టి నానావిధ ద్వైతధర్మములతో అనర్థములతో గూడి అత్యంత మలినమైన సంసారము ఆ శుద్ధాత్మకు సంబంధించినది కాదు. అహంకారాత్మ అంటే లింగ- సూక్ష్మ దేహము ఆత్మేతరములు జడములు అయినట్టి అపంచీకృత పంచమహాభూతముల వలన పుట్టునది కాబట్టి ఇదియు గోడలు, శిలలు, మొదలగు వాటివలె జడమే. కాబట్టి కర్తృత్వ (పుణ్యాపాపాది కర్మలు ఆచరించుట) భోక్తృత్వ (సుఖ దుఃఖాలు అనుభవించుట) జ్ఞాతృత్వ (తెలిసికొనుట) దృష్టృత్వ (చూచుట) శ్రోతృత్వాది (వినుట మొదలగు) నానావిధ వ్యాపారములతో గూడిన సంసారము. ఇట్టి లింగ భూత అహంకారము సంబంధిచినది కాదు. ఎందుకంటే అవి అస్వతంత్రులైన జడ వస్తువులు. కర్తలు అగుట గాని భోక్తలు అగుట గాని యెన్నడు సంభవించదు. అంటే సంసారమనునది అసలేలేనిది. అత్యంత అసత్తు, అని అంటే వీలుకాదు. ఎందుకంటే ఈ సంసారమును అందరూ అనుభవించుచున్నారు కదా! జడమైనను స్వచ్ఛముగా నున్న అంతఃకరణ మందు శుద్ధ చైతన్య ప్రతి బింబమును గ్రహింపగల

సామర్ధ్యము అంతఃకరణకు లేదు. ఆ చైతన్య ప్రతిబింబమునకు చైతన్యాభాసమనియు- చిదాభాసమనియు అంటారు. ఈ అంతఃకరణ ప్రతిబింబత ఆత్మ చైతన్యవేం జీవాత్మ. అంటే ఈ జీవాత్మనే చిదాభాసుడంటారు. ఈ చిదాభాసుని సాన్నిధ్యము వలన ఆ అంతః కరణాదుల యందు చలన క్రియలు ఏర్పడి **"అహం" "నేను"** అను వృత్తి వ్యాపారాలు యేర్పడుతున్నాయి. అయస్కాంతము ఇనపగుండు సూదుల సాన్నిధ్యము వలన అంతవరకు జడపదార్ధములుగా ఉన్న గుండు సూదులకు చలన క్రియ ఏర్పడిన విధముగా అహంకార వృత్తియే క్రమముగా, బాహ్యములు, స్థూలములు అగు దేహేంద్రియాదులందు గూడా ప్రసరించి, కర్తృత్వ, భోక్తృత్వాది నానావిధ వ్యాపారములతో కూ డియున్న సకల సంసారమునకు ప్రవర్తకమగు చున్నాయి. ఈ అహమాకాశ వృత్తిని అహమాధ్యాసయని అంటారు.

ఇదియే సంసార మహా సౌధనముకు మూలస్తంభము. పునాది రాయి. ఆ అంతఃకరణమునకును అందు ప్రతిఫలించిన ఆత్మ చైతన్యమునకు గల భేధమును గుర్తింపగల్గు వివేక జ్ఞానము లేక మిధ్యా జ్ఞానం వలన సర్వ సాక్షియగు చిద్రూప ఆత్మ వస్తువునందు ఆ భాసయుక్తా హంకారములకు సంబంధించిన ఆ సంసారము అజ్ఞులచే ఆరోపించబడుచున్నది. ఒకటి జడము ఇంకొకటి చేతనము. కనుక రెండునూ పరస్పరము భిన్నములు. అది గుర్తించలేక దేహాదులందు ఆత్మ బుద్ధి కలవారై దేహాదులకు సంబంధించిన పొడవు, నలుపు, కులము, జాతి మొదలుగా కల ధర్మములను ఆత్మయంధు అరోపించుకొని వ్యవహరించుటయే కాక ఆ దేహ సంబంధీకులు భార్య పుత్రాది పరదేహ ధర్మములను కూ డా ఆత్మయందు ఆరోపించుకొని ఆత్మగా భావించి వారి





వృద్ధిని తన వృద్ధిగాను వారి వికలత్వము తన వైకల్యముగాను, వారి కష్టములు తనవిగాను ఆరోపించుచు సుఖ దుఃఖ మోహాది రూప నిర్వధిక సంసారము అనుభవించుచున్నారు. కాబట్టి ఆలోచించి తీవ్ర విచారంచే సంసారమనే మిధ్యా జ్ఞానమని తేలింది. అట్టి మిధ్యా జ్ఞాన వస్తువును సంసారము అనర్ధకారి ఎలా అవుతుందంటే మిధ్యాజ్ఞాన వశమున కనిపించిన సర్పము మిధ్యయే. ఆ సర్పము అసత్యమే అయినను భయకంపాదులనెడి అనర్ధములు కలిగించు చున్నది. తన్ని వృత్తికై సాధనమును అన్వేషింపవలయును. లేనిదానిని విచారించిన ఏమియు ప్రయోజనము లేదు. సంసారము అనునది కేవలము శుద్ధాత్మకు సంబందించినది కాదు. జడమైన కేవలము అంతఃకరణకు సంబంధిచినది కాదు. అశుద్ధమైన మనస్సే సంసారములో తిరిగాడటానికి సర్వానర్ధాలకు ఏకైక కారణము. రజ్జు సర్పమువలె సంసారము అనునది లేనిదియే అసత్తే. అయితే వాస్తవముగు రజ్జు జ్ఞానము కలిగినంత మాత్రమున మిధ్యా జ్ఞానము నశించి భయకంపాది సర్వానర్ధములును నశించినట్లు, ఆత్మ తత్త్వ జ్ఞానము, బ్రహ్మాత్మైక్య జ్ఞానముదయించిన సంసారమగు మిధ్యాజ్ఞానము తజ్జన్య సంసారమును నశించును. కాబట్టి బ్రహ్మాత్మైక్య విజ్ఞానము కొరకు ఆత్మ తత్త్వ జ్ఞానమునకై విశేషముగా యత్నించాలి. అపుడు సద్గురువు తత్త్వోపదేశముతో జీవాత్మ పరమాత్మల అభేధజ్ఞానము అనుభవపూర్వకంగా తెలుసుకొనుటయే సంసారమునశించి ముక్తి కలగటానికి వీలవుతుంది. ఆత్మకు (మాయా కార్యమగు) మనస్స బంధము వలన సంసారమేర్పడుతోంది. మనస్సనగా అనేక కామ వాసనల యొక్క సముదాయమే. ఇట్టి మనస్సుతో తాదాప్యము చెందుట వలన ఆత్మయొక్క సచ్చిదానంద స్వరూపము తిరోహితమగుతోంది. మనః కల్పితముగు

ప్రపంచధర్మములే ఆత్మయందు భాసిస్తున్నాయి. దానివలన ఏర్పడు ప్రపంచము పరిత్యక్తమైనదై ఆత్మయొక్క నిత్యచైతన్య ప్రకాశము పరిశిష్టమగుచున్నది. అందుచే ముక్తి కోరువారు తన ప్రేమా స్పదములగు ప్రాపంచిక పదార్ధమందలి అభిమానమును పరిత్యజించినచో సునాయాసముగా మోక్షమును పొందగలరు. ఎప్పుడు సర్వకామ పరిత్యాగమనే ఆయుధముచే హృదయగ్రన్థి (ఆత్మకు మనస్సునకు గల అన్యోన్య తాదాత్మ్య సంబంధము) ఛేదింపబడుతుందో అపుడే జీవుడు నిష్క్రియుడు సర్వవ్యాపకుడు అయినట్టి సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపము పొందును.





# 12. మోక్షసాధనకు ముముక్షువు పాటించవలసిన కొన్ని ముఖ్య నియమాలు

## మోక్షసాధనకు ఉండవలసిన ముఖ్య లక్షణములు

1. తీవ్ర వైరాగ్యము కలగాలి మానవ లోకము మొదలు బ్రహ్మ లోకము వరకు గల సమస్త లోకములయందలి సమస్త భోగములందును తత్సాధనములయందు, అనురాగము, ఇచ్ఛ, కోరిక అణుమాత్రము లేకుండుట.

2. విషయాలయందు దోష దర్శనముచే వైరాగ్యము అభివృద్ధి పరచుకోవాలి

3. నాలుగవ ప్రకరణలో చర్చించుకున్న దైవీ సంపదను సంపాదించి అభివృద్ధి పరుచుకోవాలి. ఎట్టి పరిస్థితులలోనూ అసురీ సంపదను దగ్గరకు రానీయరాదు.

4. నిత్యానిత్య వస్తు వివేకము, ఇహాముత్ర ఫలభోగవిరాగము, శమాదిషట్కసంపత్తి తీవ్రముముక్షత్వము, బ్రహ్మ జిజ్ఞాస 7 వ. ప్రకరణలో చర్చించుకున్న సాధన చతుష్టయ సంపత్తిని కలిగి ఉండాలి.

5. సజ్జన సాంగత్యము - వేదాంత శ్రవణము విడనాడకూ డదు. ఆత్మానుభవము అయ్యేటంతవరకు శ్రవణము, మననము, నిధిధ్యాస వదలకూ డదు.

6. ముఖ్యంగా గురుబోధమీద నమ్మకం ఉపనిషత్తు వాక్యాల యందు అచంచల విశ్వాసం ఉండాలి.

7. ఎట్టిపరిస్థితులలోనూ విషయ వాంఛలకు లోనుకాకూ డదు.

8. త్రిగుణాలు అంటే ఏమిటో 3. వ. ప్రకరణలో వివరించబడ్డాయి. వాటికి అతీతంగా ఉంటూ చేసే కర్మలు విహిత కర్మలే అయి ఉండాలి

గాని నిషిద్ధ కర్మలందు ప్రవేశించరాదు. పునర్జన్మ కలుగచేసే ప్రవృత్తి మార్గము విడనాడి నివృత్తి మార్గమువలంబించాలి. చేసే కర్మలు కూ డా ఈశ్వరార్పణ బుద్ధితో కర్తృత్వం సంగమము లేకుండా చేయాలి.

9. ఎట్టి పరిస్థితులలోనూ దేహాభిమానము పనికి రాదు. దేహాభిమానమున్నంత వరకూ మోక్షము కలుగదు.

10. బేధభావన ద్వైతభావన పూర్తిగా విడనాడాలి.

11. **అహంబ్రహ్మాऽస్మి, తత్త్వమసి, అయమాత్మ బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ, సత్యం జ్ఞానం బ్రహ్మ, బ్రహ్మసత్యం జగన్మిథ్యా, సర్వంఖల్విదం బ్రహ్మ, ఏకమేవాऽద్వితీయంబ్రహ్మ, జీవో బ్రహ్మైవ నాపరః, ఆత్మై వేదం సర్వం, వాసుదేవస్సర్వం** అనే మహా వాక్యాల మీద అచంచల విశ్వాశం కలిగి లక్ష్యార్థాలను అనుభవంలోకి వచ్చేటంత వరకూ నెమరు వేసుకుంటూ ఉండాలి. ఆత్మ విచారమే **"మహా తపస్సు" "అత్యంత ఫలప్రదం" "మోక్షప్రదం"**.

12. సాధనలో ఎట్టి పరిస్థితులలోనూ తమోగుణ రూపమయిన నిద్ర అలసత్వము పనికిరాదు. ఉత్సాహంతో పట్టుదలతో తీవ్ర ముముక్షంతో సాధన చేయాలి.

13. ఎల్లవేళల అన్ని పరిస్థితులలోను అన్ని సంఘటనలలోనూ సాక్షి రూపంగా ఉదాసీనంగా కర్తృత్వం లేకుండా సంగమం లేకుండా ఉండటం అలవాటు చేసుకోవాలి.

14. **తత్పరత**: సర్వసాధన సంపత్తికి మూలమైనది, ముముక్షుత్వం. ఇది సాదనలన్నిటిలోనూ ముఖ్యమైనది. ఇది ఎంత తీవ్రమయితే అంత త్వరగా ఫలం లభిస్తుంది. ఈ అత్యంత ముముక్ష ప్రవృత్తినే **"తత్పరత"** అంటారు. మోక్షం కంటే ఇతరమైన దానియందు ఆసక్తి లేని ఇచ్ఛనే





తత్పరత అంటారు. మోక్షం తప్ప ఇతరమైన వాటియందు తీవ్రవైరాగ్యం, ఉన్నప్పుడే మోక్షం మీద ఆసక్తి పెరుగుతుంది.

15. **సత్సాంగత్యము**: ఆత్మ విచారానికి సత్సాంగత్యము అవసరము. ఈ సంసారమనెడి మహా సాగరం దాటటానికి సత్పురుషుల సాంగత్యము ఒక్క క్షణమైన అద్భుతంగా ఉంటుంది. కొంతమంది మహాత్ముల దర్శనం చేత పాప క్షయమై బుద్ధి వికసిస్తుంది. వారి సన్నిధిన విజ్ఞాన తరంగములు వెలువడుతాయి. వారి సహవాసము ఋజు మంచి మార్గము చూపించి శాంతి దాయకమై ఉంటుంది. ముముక్షువులకు మోక్ష ప్రాప్తి మార్గములో ప్రయాణమునకు అనుకూ ల పడుతుంది. ఈ భయంకరమైన మనస్సును జయించటానికి మహాత్ముల సాంగత్యమొక్కటే గురి తప్పని సాధనము. ఇది ఎంతో పుణ్యము చేసుకుంటేనే కానీ లభ్యముకాదు పురుషయత్నంతో సత్సాంగత్యము చేయాలి. సద్గ్రంధాలు పఠించాలి. ఆచరణలో నిరంతరం పెట్టటానికి అలవరచుకోవాలి. సత్సాంగత్యము యొక్క మహిమను ఈ క్రింది విధంగా చెప్పారు, శ్రీ జగద్గురు ఆది శంకరా చార్యుల వారు.

**సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం**

**నిర్మోహత్వే నిశ్చల తత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥**

16. **ప్రేమ**: ఎంత శ్రమకైనా ఓర్చి సాధించవలసింది ఒకే లక్ష్యం. అదే ప్రేమ. ప్రేమ అనంతమయింది. విస్తారమయింది. ఆకాశంమాదిరి సువిశాలమయింది. సముద్రం వలె అగాధమయింది. మహోత్కృష్టమైన జీవిత సాఫల్యము అది ఒక్కటే. ఎవరికి ఇది లభిస్తే వాడు ధన్యుడు. సకల జీవరాసులలో ఉన్న చైతన్యము నీలో నున్న ఆత్మచైతన్యము ఒక్కటే.

నీ పై ఉన్న పాంచభౌతిక శరీరము రక్త మాంసాదులు ఎముకలు పోతే మిగిలేది ఆత్మ చైతన్యమే. అదేవిధంగా ఒక జంతువుగాని క్రిమి కీటకాదులలోని శరీరము తీసివేస్తే వాటిలోనున్న ఆత్మ చైతన్యమే మిగులుతుంది. ఆ ఆత్మ చైతన్యానికి నీ ఆత్మ చైతన్యానికి బేధంలేదు. ఈ చైతన్య శక్తివలననే ఆయా శరీరాలు, అంతఃకరణలు ప్రవర్తిస్తున్నాయి. ఈ ఆత్మ చైతన్య శక్తి సర్వే సర్వత్ర బయట లోపల అవకాశం ఉన్న చోటల్లా వ్యాపించి ఉంది. సూటిగా చెప్పాలంటే ఈ ఆత్మ చైతన్య శక్తి లోనే ఉన్నాము. అదే భగవంతుని లక్షణము సర్వవ్యాపి. ఆయన లేనిచోటు లేదు. అయితే మనం ఆయనలో ఆయన మనలో ఉంటున్నా ఈ తోలు చక్షువులతో అజ్ఞానం వలన గ్రహించలేక భగవంతుడు ఎక్కడో ఉన్నాడని ప్రాకులాడుతున్నాము. ఎంత హాస్యాస్పదము! నిర్వికల్ప సమాధి పొందిన జ్ఞాని సాధనా బలంతో **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** అనే మహావాక్యాన్ని అనుభవంలోకి తెచ్చుకొని ఆ మహాయోగి ఎక్కడ చూస్తే అక్కడ బ్రహ్మగా చూస్తాడు. ఇక అతని సమాధి సహజ సమాధి అవుతుంది. జగత్తు అంతా బ్రహ్మమయంగా తిలకిస్తాడు. తానే బ్రహ్మైపోతాడు. అజ్ఞాని మాత్రం జగత్తు జగత్తుగానే చూస్తాడు. విద్యుచ్ఛక్తి ఉంది. అది తీగలో ప్రవహిస్తోంది. అది మనకు గోచరము కాదు. కాని బల్బు పెడితే ఆ బల్బు వెలగటం బట్టి అందులో విద్యుచ్ఛక్తి ఉందని తెలుస్తుంది. అంటే ఇక్కడ ఉపాధి బల్బు కాంతినిస్తుంది. ఈ విద్యుత్తు రేడియాలో ప్రసరిస్తే పలుకుతుంది. టి.వి.లో ప్రసరిస్తే బొమ్మ కనిపిస్తుంది కాని వీటన్నిటిలో ప్రవహించే విద్యుత్తులో భేదం లేదు. అది ఎందులో ప్రవహిస్తుందో ఆ ఉపాధి ధర్మం వలన అవి పని చేస్తున్నాయి. ఉపాధి లేకపోతే విద్యుత్తు ఉందో లేదో తెలుసుకోలేము. అందుచేత ఈ ఉపాధి అంటే మన శరీరము





ఉండగానే ఆ ఆత్మ చైతన్యాన్ని గ్రహించాలి, అనుభవించాలి. అది ఒక్క మానవ శరీరానికే సాధ్యం. కాబట్టి ఉపాధి భేధంతో ఉండే నామరూపాలకు ప్రాధాన్యత ఇవ్వకుండా వాటిలో ఉండే చైతన్యశక్తి నీలో ఉండే చైతన్యశక్తికి భేధం లేదు కాబట్టి సర్వాత్మ భావన చేస్తు సకల జీవరాశిని ప్రేమించాలి. అదే దైవత్వము. **"జీవో బ్రహ్మైవ నాపరః"** ప్రతి జీవికుడా పరబ్రహ్మ స్వరూపమే. అందుచేత ద్వేష భావము లేకుండా ప్రేమ భావన అలవరచుకోవాలి. ఇది చాలా ముఖ్యం.

17. **నీ మీద నీకు విశ్వాసము** : తనమీద తనకు అచంచల విశ్వాసముండాలి. తాను శరీరానికి, మనస్సుకి, బుద్ధికి వాటి సంఘాతానికి తాను కాదనన్ని వాటి కన్నింటికి విలక్షణమైన సాక్షి చైతన్యాన్ని అని గమనించినప్పటికి నీ మీద నీకు నమ్మకం లేక అవే నీవనుకొని భ్రమించి వాటి ధర్మాలు నీమీద వేసుకొని వాటితో దాతాప్యం చెందుతూ కర్మబంధంలో చిక్కుకొని జన్మ పరంపరలో తిరుగాడుతున్నావు. కాబట్టి చేయవలసినదేమంటే నీ మీద నీ స్వస్వరూపము మీద పంచకోశ విచారణ ద్వారా, అహంబ్రహ్మాస్మి తత్త్వమసి వాక్యార్థముల ద్వారా తెలుసుకున్నావు కాబట్టి నీలో నీవు ఉండుటం అలవర్చుకోవాలి. నీ స్వస్వరూపము మీద విశ్వాసం కుదరాలి.

18 **విపరీత భావనలు - సంశయ భావనలు** : పంచకోశ వివరణ చెప్పి. శరీరత్రయ విభాగము చేసి **"అహం బ్రహ్మాస్మి"** **"తత్త్వమసి"** మహా వాక్యబోధ విన్న తరువాత సంశయ భావనలు విపరీత భావనలు విడనాడాలి. గురువు యందు ఉపనిషత్తులయందు పూర్తి విశ్వాసము కలిగి ఉండాలి. అహంబ్రహ్మాస్మి అను మహా వాక్యార్థము పూర్తి అనుభవంలోకి తెచ్చుకోవటానికి తీవ్ర సాధన అవసరము. నేను

ఫలానా కులమునకు చెందినవాడిని, పొట్టి పొడుగువాడిని, అనే విపరీత భావనలు, నేను బ్రహ్మ ఎలా అవుతాను అనే విపరీత భావనలు, సంశయ భావనలు, పూర్తిగా విస్మరించాలి. అటువంటి విపరీత సంశయ భావనలున్నంత వరకు మోక్షానికి అర్హుడు కాడు.

19. **చిదాభానుడు**: నీవు చిదాభానుడు కూడా కాదు. చిదాభానుడు అంటే ఆత్మకు ప్రతిబింబమే కదా! ప్రతిబింబానికి వ్యక్తిత్వమేముంది అది ఎప్పుడూ బింబంలో కలసి పోతుంది.అద్దంలో నీ మొహం చూసుకుంటే నీ ప్రతిబింబం కనిపిస్తుంది కదా! అద్దం తీసివేస్తే ప్రతిబింబం, బింబంలోనే లయమవుతుంది కదా. అందుచేత చిదాభానునికి ప్రత్యేక వ్యక్తిత్వం లేదు. అందుచేత నీవు నిజానికి కూ టస్థుడవు. సాక్షి చైతన్యానివి. దీనిపై పరిపూర్ణ విశ్వాసముంచి బుద్ధి, మనస్సు, ఇంద్రియ సంఘాతానికి వాటి వ్యాపారాలకు లోను కాకుడదు.

20. **ప్రకృతి** : ప్రకృతి పరమాత్మ యొక్క ప్రతిబింబమే. పరమాత్మ కంటే వేరు కాదు. **"పశ్యన్న పచనపశ్యతి మూఢో"** భగవత్ స్వరూపమైన ఈ ప్రకృతిని చూస్తున్నప్పటికి ఇంకా భగవంతుని చూడాలి, భగవంతుని చూడాలి అని ఆశిస్తూ ఉండటం అవివేకము. ప్రకృతి భగవత్సరూపము. భగవంతుడు కారణము. కార్య కారణరూపమే జగత్తు. ప్రపంచం అంతా దైవత్వము యొక్క ప్రతిబింబమే. అన్యచింతన లేకుండా సర్వదా సర్వకాలేషు సర్వత్రా ఆత్మ చింతన చేయడమే అనన్య భక్తి, భగవంతుడు నిర్వికారుడు, నిర్గుణుడు, సర్వాంతర్యామి. అన్ని జీవులలో **"నేను నేను"** అని తెలియబడుతున్నాడు. అందుచే నీలో ఉన్న ఆత్మదేవుని నీలోనే అంతర్ముఖము అయిధ్యానం ద్వారా ఆయనతో ఐక్యమవడానికి బదులు బయట ఆయనకోసం వెతుకునంతవరకు నీకు దొరకదు. ఆత్మ దేవునకు





నీకు మనస్సే అడ్డు, సంకల్పాలు లేకుండా ధ్యానంలో మనస్సును అంతర్ముఖం చేసి ఆయనలో ఐక్యమవటమే మోక్షం. అప్పుడే సర్వకర్మలు దగ్ధమవుతాయి.

21. **బాహ్య గురువు - అంతర్గురువు** : బాహ్య గురువు యొక్క సహాయము మోక్ష మార్గాన్ని చూపించేవరకే గాని ఆ మార్గము ద్వారా తీవ్ర సాధనతో తత్పరతతో ఎవరి వివేకాన్ని వారు ఉపయోగించుకొని అంతర్ముఖం అవుతే అంతర్గురువు (ఆత్మదేవుడు) యొక్క అనుగ్రహం తప్పక కలుగుతుంది. మన హృదయంలో శుద్ధ చైతన్యంగా ప్రకాశిస్తున్న ఆత్మే సద్గురువు. ఆయన నిత్య నిరంతరం మనకు బ్రహ్మోపదేశము చేస్తూనే ఉంటాడు, ఉచ్ఛ్వాస నిశ్వాసముల ద్వారా సోऽహం మంత్రం గుర్తు చేస్తూ. ఆ మంత్రమే, ఉచ్ఛ్వాస, నిశ్వాసములతో అనుసంధానము చేసే తరించాలి. సోऽహం అంటే సః = వాడు (ఆత్మ దేవుడు) అహం = నేను అయి ఉన్నాను, ఒక్కటే అని అర్థము .

22. **హృదయము**: ఆత్మ సర్వవ్యాపకము. మనహృదయంలో రొమ్ముకు కుడి భాగమున ఉంది. దీననే ఆధ్యాత్మిక హృదయమంటారు. అతి సూక్ష్మ రూపంలో వాసనలు నిక్షిప్తమై ఉంటాయి. హృదయమే సమస్త శక్తికి కేంద్రం. ఆత్మ హృదయంలో ఉండి సకల కార్యకలాపాలకు ఆధారభూతంగా ఉంటుంది., కాబట్టి హృదయమే ఆత్మ. దీని చైతన్య శక్తివల్లనే జడాలయిన ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, పంచ ప్రాణాలకు శక్తి వస్తుంది.

23. **భగవంతుడు - భగవచ్ఛక్తులు** : జ్ఞానపిపాసి విద్వత్తును కోరుకుంటాడు. చాలామందికి భగవంతునికన్న భగవంతుని శక్తులంటేనే

ఇష్టపడుతారు, భగవంతుని ఇష్టపడే వారు చాలా అరుదుగా ఉంటారు. భగవంతుని కోరుకుంటే మనకు భగవంతుని లభించటమే కాదు ఆయన శక్తులు కూడా లభిస్తాయి ఈ విషయం తెలియక ఆయన శక్తులను కోరుకొంటే బంధించి వేస్తాయి. కొంతమందికి సాధన తీవ్రత బట్టి కొన్ని సిద్ధులు లభిస్తాయి. వాటి మాయలో పడి వాటిని ఉపయోగించటం మొదలు పెడితే అధః పతనానికి హేతువవుతుంది. మోక్షం కలుగదు. అటువంటి సిద్ధులను కూడా తృణీకరించి మోక్షసాధనకు పురోగమించాలి.

24. **"నాది" "ఇది" భావన** : నాది అనే భావాన్ని నాశనం చెయ్యాలి. పేరు, ఆకారమే దుఃఖానికి కారణం, మనో సృష్టి అయిన బొమ్మల మీద బుద్ధి యొక్క నమ్మకం చేత బంధుత్వ వాసన పెట్టుకొని అహంకరించి తద్వారా రాగ ద్వేషాలు, పెంచుకొని భ్రమకు లోనవుతున్నాడు. ఈ నామ రూపాలు నిజంగా లేనివే అయినప్పటికి అభిప్రాయ దృష్టితో చూడటం చేత అహంకారానికి గురి అవుతున్నాడు. నేను ఆత్మను అంతేకాని **"నేను ఇది"** అనుకోవటం కూడా అహంకారము. నేను కేవలం ఆత్మగా భావించినపుడు ఆత్మ మాత్రమే. కాని ఆ విషయాన్ని మరచి పోయి ఇక్కడ అక్కడా పరుగెత్తుతూ నేను ఇది, అది అని అనుకుంటూ ఇలా ఉన్నాను. అలా ఉన్నాను అని భావించటము అహంకారమే. ఈ అహంకారత్యాగం చెయ్యాలి.

25. **ఇంద్రియలోలత్వం-బాహ్య విషయ నిగ్రహం**: మనస్సు బుద్ధి ఇంద్రియాలు ఎపుడూ బాహ్య విషయాలపై ప్రవర్తిస్తాయి. ప్రకృతి త్రిగుణాలతో నిండిఉంది. ప్రకృతి అంతా కూడా నామరూపాలతో నిండి ఉంది. ఈ నామరూపాలన్ని మధ్యలో వచ్చాయి. మధ్యలోనే నశించిపోతాయి. అంటే అవి ఆత్మ కావు అని నిర్ధారణ చేసుకొని





నామరూపాలమీద నమ్మకం లేకుండా ఉండటమే వైరాగ్యం. విషయాలపై దోష దర్శనం చేసి విచారణ ద్వారా వాటిని త్యజించాలి. ఇంద్రియాలు మహ బలవత్తరమైనవి. అవి సాధకుని విషయలోలత్వమునకు బానిసను చేసే అవకాశముంది. సత్యవస్తువుని అసత్యంగాను అసత్య వస్తువుని సత్యంగానూ భ్రమింప చేస్తాయి. అదే మాయ. ఆ విధంగా భావించటమే అహంకారం. అందుచే ఎల్లప్పుడు సాధకుడు కడు జాగ్రత్తగా ప్రతి సంకల్పము కలుగగానే విచారణా బలంచే విషయ వాంఛలను విడనాడాలి. సంకల్ప రాహిత్యము చేసుకోవాలి. ఉన్నది ఉన్నట్లు తాను ఆత్మగా నిర్ధారణ చేసుకొని అందులో నిలకడ గలిగి ఉంటే త్యాగం అవుతుంది. కొంచెం సేపు విషయ వాంఛలమీద కొంత కాలం ఆత్మపై నిలకడకల్గి ఉంటే మోక్షమెన్నటికీ రాదు.

26. **మనో ప్రవృత్తి**: సుఖ దుఃఖాలు మనో ధర్మాలు. సంకల్పాత్మకమైన మనస్సు అది కావాలి ఇది కావాలి దాన్ని చెయ్యాలి దీన్ని చెయ్యాలి అని సదా సంకల్పిస్తుంది. ఆ మనస్సుకు నిశ్చయాత్మక బుద్ధితోడైతే వెంటనే సంకల్పం నెరవేరడానికి ఇంద్రియాలను ప్రేరేపించి దాని ద్వారా ప్రవృత్తమైనపుడు తన ఇష్టానికి అనుకూలంగా ఉంటే సుఖాన్ని అనుభవిస్తుంది. ఆ అనుభూతి వలన మరల మరల విషయాలను అనుభవించాలని ప్రబల కోర్కె కలుగుతుంది. ఆ అనుకూల ప్రబల ప్రవృత్తి రాగమవుతుంది. రాగం వల్ల కామం కల్గుతుంది. తన ఇష్టానికి కామానికి వ్యతిరేకత ఉంటే దుఃఖం కల్గుతుంది. ఈ దుఃఖానికి కారకులయిన వారిపై ద్వేషం కల్గుతుంది. ద్వేషం వలన క్రోధం దానివలన సమ్మోహం దాని వలన స్మృతి భ్రష్టత, దానివలన బుద్ధి నాశనం తద్వారా వినాశనం కల్గుతుంది. **"బుద్ధి నాశా ప్రణశ్యతి"** కాబట్టి దీనివలన ముముక్షువు గ్రహించవలసిన

విషయమేమంటే మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు ఎల్ల వేళల బయట ప్రసరించి విషయ జ్ఞానానికి వాంఛలకు ప్రోత్సహిస్తాయి. ఇతర విషయాలన్నీ నీకంటే వేరుగా ఉన్నాయి. కాబట్టి అవన్నీ అనాత్మ పదార్థలే. శాశ్వతంకాదు. అందుచే బుద్ధి, మనస్సు, ఇంద్రియాలు కల్పించే సంకల్పాలను అవి కలుగ గానే దోష దర్శనంచే తీవ్ర వైరాగ్యంతో త్రుంచివేయటమే కాకుండా ఆ మనస్సును అంతర్ముఖం చేసుకోవాలి.

27. **మోక్షమంటే ఏమిటి**: మోక్షమంటే బంధాలనుండి విడివడటమే మోక్షము. ఆ బంధాలను నీ అంతట నీవే నీ కర్తృత్వ భోక్తృత్వ కర్మలవల్ల ఆ కర్మల వాసనలవల్ల బంధించుకున్నావు. ఈ బంధాలు ఇతరులెవ్వరూ కల్పించలేదు. నీవు దుష్టమనస్సుతో ఏకీభవించి తాదాప్యం చెంది కర్తృత్వ భావనలతో కర్మలు చేయటం వలన ఆ కర్మ ఫలితాలను అనుభవించటానికి పెక్కు యోనిలలో పుట్టుచూ మరణిస్తు తిరుగుచున్నావు. కాబట్టి నీ స్వప్రయత్నం వలననే ఈ కర్మ బంధాలను మెళుకవ తెచ్చుకొని బయట పడాలి. అంతేకాని మోక్షమనే పరమ పదం కర్మల వల్లగాని, యజ్ఞయాగాదుల వలన గాని, తీర్థయాత్రల వలన గాని, ధనం వలన గాని, సంతానం వలన గాని సిద్ధించదు. అహంకార త్యాగము, సంకల్ప త్యాగము, చిత్తశుద్ధి వాసనా క్షయం ద్వారానే లభిస్తుంది. దీనికి తోడు గురుకృప పరమేశ్వరుని అనుగ్రహము ఉండాలి. నీలో తీవ్రతత్పరత, సాధన ఉంటే తప్పక లభిస్తాయి. "**నకర్మణా నప్రజాయాధనేనత్యాగేనైకే అమృతత్వమానశుః**" (కైవల్యోపనిషత్తు) గురువు గారి చేత ఉపదేశింపబడిన వేదాంత మహావాక్యార్థమును మాటి మాటికి శ్రవణము చేస్తూ శ్రవణం చేసిన దానిని మననం చేస్తూ నిధి ధ్యాస చేయగా కల్గిన నిశ్చయం వల్లనే ఆత్మ తత్వ అవరోక్షజ్ఞానం కల్గుతుంది.





28. **సాధన విధానము**: ఎపుడయితే సద్గురువు ద్వారా పంచకోశ విచారణ, శరీర త్రయ ధర్మాలు, "**అహంబ్రహ్మాస్మి**", "**తత్త్వమసి**" మహా వాక్యార్థము ఉపదేశము చేయబడుతుందో వెంటనే ఆ తత్పదార్థము సర్వే సర్వత్ర వ్యాపించి ఉన్న దనిన్నీ నీలోనున్న ఆత్మ దానికంటే భిన్నము కాదని తెలుసుకు ంటున్నావు. అప్పటినుండి ఈ క్రింది విధముగా ఎల్లవేళల మననం చేస్తూ నిదిధ్యాసలో ఉండాలి.

నేను శరీరమును కాను. నేత్రము మొదలైన ఇంద్రియములుకాను. పంచ ప్రాణములను కాను. బుద్ధియును మనస్సును కాను. వీటన్నిటికి సాక్షి స్వభావుడను. నేను కర్తను కాను, భోక్తను కాను. నాకు బంధమోక్షములు లేవు. కర్తృత్వ భోక్తృత్వములు లేవు. అహంకార ధర్మములు నాకు లేవు. పుట్టుట పెరుగుట, చచ్చుట ఇవి శరీర ధర్మములు. క్షుత్ పిపాసులు ఆకలిదప్పులు ప్రాణమయ కోశధర్మములు. శోక మోహ ధర్మములు చిత్తము యొక్క ధర్మములు, నేను శరీరము కాదు కాబట్టి నాకు శరీర సంబంధీకులు లేరు. వీటన్నిటికి సాక్షిభూతుడను. రక్త, మాంస, మేధోస్థితి, మజ్జారస శుక్రములు నేను కాను. సప్తధాతువులు నేను కాను. వాక్కు, హస్త పాదములు మొదలైన కర్మేంద్రియాలు నేను కాను. నాకు పుణ్యపాపములు లేవు. సుఖదుఃఖములు లేవు. మృత్యు భయము, జాతి భేధము నాకు లేవు. అవి శరీర ధర్మములు. తల్లిలేదు. తండ్రి లేడు. బంధుమిత్రులు లేరు. వీటన్నిటికీ సాక్షిని. నాస్వరూపము నిత్యజ్ఞాన స్వరూపము. కేవలం శివ స్వరూపుడను. నిశ్చలుడను, అద్వితీయుడను. నిత్యుడను, శుద్ధుడను, పూర్ణుడను. నిత్యశుద్ధముక్త స్వరూపుడను, నిర్మలుడును, అచ్యుతుడను. సర్వసముడను. అఖండా నందస్వరూపుడను. నిర్వికల్పుడను. వికల్ప రహితుడను. నిరాకార రూపుడను, నిర్గుణుడను, సర్వవ్యాపిని.

**"అహంబ్రహ్మాస్మి"** ఈ విధంగా నిత్య నిరంతరం ఆత్మ విచారము సాగించెడి వ్యక్తికి ఎన్నడూ సంసార సుఖ దుఃఖములకు లోనుగాడు. సమదృష్టి నిశ్చలమయిన మనస్సుతో ప్రశాంతంగా తానులో తానుంటాడు. ఈ విధంగా ఇంద్రియాలను బుద్ధితో లయం చేసి బుద్దిని పరమాత్మలో లయం చేసి ధ్యానం చేయగా చేయగా సవికల్ప సమాధి సిద్ధిస్తుంది. పరమాత్మ కోసం బయటకు వెతికినంత వరకూ ఆయన లభ్యంకాడు పరమాత్మకు మానవునకు ఏమీ దూరంలేదు. అతః కరణ అంటే బుద్ధి మనస్సు చిత్తం మాత్రమే అడ్డు. మనస్సును పురుష యత్నంతో నిస్సంకల్పస్థితిలో ఉంచితే ఆయన లభ్యమవుతాడు. ఆయన వద్దకు మనస్సు, బుద్ధి ఇంద్రియాలు వెళ్లలేవు. ఆయన అవాఙ్మానస గోచరుడు. ఈ చర్మచక్షువులకు కనిపించడు. ఇంద్రియాలు అంతఃకరణ అంతర్ముఖం చేసి శుద్ధ మనస్సుతో తీవ్ర ప్రయత్నం చేస్తే ఆయన అనుగ్రహం వలన నిర్వికల్ప సమాధి ద్వారా అనుభవింపగలము. అందుచేత మనస్సు త్రిగుణాల ప్రభావం ఉన్నంతవరకూ ఆయనను చేరలేరు. ఆయన నిర్వికారుడు. అంటే ఆయనకు ఆకారములేదు. మోక్షం నిర్వికల్ప సమాధి ద్వారానే సంభవము.

నిర్వికల్పమును, ఏక స్వరూపమును, అద్వితీయమును, అఖండమును అయిన సచ్చిదానంద బ్రహ్మమును బాహ్యపూజలెట్లు చేయగలము. పూర్ణ వస్తువును, సర్వాధారమగు నిర్మలమయ అద్వితీయ పరబ్రహ్మమును ఎలా ఆహ్వానించాలి, ఆసనమియ్యాలి, ఎటుల అర్ఘ్య పాద్యములివ్వాలి. పవిత్రమగు పరబ్రహ్మ ఇతరులను పవిత్రము చేయగల సమర్ధత ఉండుటచే ఆయనకు స్నానమెందుకు. విశ్వోదరుడుకు వస్త్రమొసగుట ఎట్లు. గోత్రవర్ణ రహితునకు ఉపవీతము ఎందుకు. నిర్లేపునకు గంధమునలముటెట్లు. గంధ రహితునకు పుష్పములెందుకు.





నిర్విశేషునకు భూషణాలు ఏమిటి, నిరాకారుడుకు అలంకారములు అవసరములేదు కదా. నిరంజనుడుకు ధూపమెందుకు. సర్వసాక్షికి దీపమెందుకు. నిత్యానందసంతృప్తునకు ఏమి నైవేద్యము పెట్టగలము. ఆ ఇచ్చు నైవేద్యములుకూడా ఆయన సృష్టియే కదా సమస్త విశ్వములకు ఆనందము ఒసగు వానికి తాంబూలము అవసరమేమి. స్వయం ప్రకాశ చిద్రూపుడై సూర్య చంద్రాదులను భాసింప చేయువానికి హారతి వల్ల ప్రయోజనమేమిటి. లోపలను, వెలుపలను అంతటా నిండి ఉన్నవానికి ఏవిధంగా ఉద్వాసన చెప్పగలము. అనంతునకు సర్వేత్ర వ్యాపించి ఉన్న పరమాత్మకు ఏ విధంగా ప్రదక్షిణములు చేయగలము.

ఈ విధంగా నిర్గుణ, నిరాకార, సర్వవ్యాపి, స్వయం ప్రకాశ పరమాత్మకు శ్రీ శ్రీజగద్గురువు శంకరాచార్యుల వారు ఆత్మ పూజలో బోధించునట్లు మానసిక పూజ సర్వదా చేయవలెను.

29 **బ్రహ్మానందం** : మానవులలో మంచి శరీర దారుఢ్యం, అవయవ సౌష్టవం, సమస్తభోగాలు, ఆరోగ్యము కలిగి స్వతంత్రుడై ఇతరులను పాలించే అధికారము కలిగి సమస్త భోగ పదార్థాలు కలిగి ఉండి, అంగబలం, అర్థబలం సమృద్ధిగా కలిగి, జీవించే వాని ఆనందాన్నిమానుష ఆనందమంటారు. అంటే మానవ లోకంలో ఇటువంటి ఆనందం అన్నిటికంటే ఎక్కువ. ఇటువంటి ఆనందానికి 100 రెట్లు ఎక్కువగా ఎంత ఉంటుందో అంత ఆనందం పితృలోకంలో ఉండే పితృగణానికి అంత ఆనంద మవుతుంది (100 X 100 పితృలోకం) గంధర్వ లోకంలో ఉండే ఒక గంధర్వునికి ఉండే ఆనందం పితృలోకంలో ఉండే పితృగణం ఆనందం కంటే 100 రెట్లు ఎక్కువ. (100 X 100 X 100 గంధర్వలోకం) అటువంటి గంధర్వ లోకంలో ఉండే ఆనందం కంటే 100 రెట్లు అధికంగా అగ్నిహోత్రాది

కర్మల ద్వారా దేవత్వాన్ని పొందిన కర్మ దేవతల ఆనందమౌతుంది.(100 X 100 X 100 X 100 కర్మ దేవతల ఆనందం) కర్మదేవతల ఆనందం కంటే 100 రెట్లు అధికంగా అజాన దేవతల ఆనందమౌతుంది. అజాన దేవతలంటే పుట్టుకతోనే దేవతలగా పుట్టినవారు. (100 X 100 X 100 X 100 X 100 అజాన దేవతానందం). అట్టి అజాన దేవతల ఆనందంకంటే 100 రెట్లు అధికంగా ప్రజాపతి యొక్క ఆనందమౌతుంది. (100 X 100 X 100 X 100 X 100 X 100 ప్రజాపతి ఆనందం) పాపరహితుడు కోరికలు లేనివాడు, శ్రోత్రియుడు, విద్వాంసుడు అయినవాని ఆనందంకూడా ఇదే. ఈ ప్రజాపతి ఆనందంయొక్క 100 రెట్లు అధికమయిన ఆనందం హిరణ్యగర్భుని యొక్క ఆనందమౌతుంది. (100 X 100 X 100 X 100 X 100 X 100 X 100 - హిరణ్య గర్భుని ఆనందం) శ్రోత్రియుడు, కోరికలు లేనివాడు, విద్వాంసుడు అయిన జ్ఞాని అనుభవించే (నిర్వికల్ప సమాధి ద్వారా) ఆనందం కూ డా ఇదే.ఇదే పరమోత్కృష్టమైన బ్రహ్మానందం. ఇదే బ్రహ్మలోకం (బృహదారణ్యకోప నిషత్తు ఆధారంగా) అటువంటి ఆనందం అనుభవించిన యోగికి పునర్జన్మ లేదు. దాని కొరకే నిరంతరం సాధన చేయాలి.

30. **ముఖ్యగమనిక** : ఈ లోకంలో ఎవరైనా ఆ అక్షర పురుషుణ్ణి తెలుసుకోకండా, నిర్వకల్ప సమాధి ద్వారా ఆత్మానుభూతిని పొండకుండా అనేకమైన హోమాలు యజ్ఞాలు వేలకొలది సంవత్సరాలపాటు చేసినా, అనేక తీర్ధ యాత్రలు చేసినా, అనేక వ్రతాలు ఆచరించినా జీవితం వ్యర్ధమే. ఎందుకంటే వాటివలనపరలోకాల్లో ఉండే భోగాలు వెంటనే వినాశనం కూ డా ఉంటుంది. అందుచేత పరబ్రహ్మ (అక్షరుణ్ణి) తెలుసుకోకుండానే స్వస్వరూప అనుభవపూర్వక జ్ఞానం పొందకుండానే చనిపోయి వెళ్లిపోతే అటువంటి వాడు చాలా దీనుడు. మళ్లీ మళ్లీ సంసారంలో అనేక జన్మలకు





మరణాలకు లోనవుతాడు. ఒకవేళ ఎవరయినా చేసిన పుణ్యకార్యాలకు దేవలోకాలకు పోయినప్పటికి అక్కడ డబ్బుపెట్టి కొన్న బానిసలాగ ఉంటాడు. అంటే బానిస భాగ్యవంతుని ఇంట్లో ఉన్న ఆ భాగ్యం సంపద వానిది కాదు కదా! వాడు నిష్ప్రయోజనమైన బ్రతుకు బ్రతికి పుణ్యఫలం క్షయమవగానే కిందకు తోయబడుతాడు. మళ్లీ పునర్జన్మ ఎత్తవలసిందే. కాబట్టి పునర్జన్మ లేని మోక్షం పొందాలంటే ఆ అక్షరుణ్ణి, ఆత్మభావంతో అనుభవక పూర్వకంగా తెలుసుకోవాలి.

## 13. అహంబ్రహ్మాఽస్మి మహా వాక్యమహిమ

1. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం దృశ్యపాపం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం అన్యమత్రం వినాశయేత్॥
2. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం దేహదోషం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం జన్మపాపం వినాశయేత్॥
3. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం మృత్యుపాశం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం ద్వైతదుఃఖం వినాశయేత్॥
4. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం భేధబుద్ధిం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం చింతాదుఃఖం వినాశయేత్॥
5. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం బుద్ధి వ్యాధిం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం చిత్తబంధం వినాశయేత్॥
6. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయగ్ం సర్వవ్యాధీన్ వినాశయేత్॥
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయగ్ం సర్వశోకం వినాశయేత్॥
7. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం కామాదీన్నాశవేత్ క్షణాత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం క్రోధవృత్తిం వినాశయేత్॥
8. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం చిత్తవృత్తిం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయగ్ం సంకల్పాదాన్ వినాశయేత్॥
9. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం కోటిదోషం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయగ్ం సర్వతంత్రం వినాశయేత్॥
10. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం ఆత్మ అజ్ఞానం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం ఆత్మలోక జయప్రదః॥





11. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం మప్రతర్క్య సుఖప్రదః
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయమ జడత్వం ప్రయచ్ఛతి॥
12. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం మనాత్మా సురమర్ధనః
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం మనాత్మాఖ్యా గిరీన్ హరేత్॥
13. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం మనాత్మాఖ్యా సురాన్ హరేత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయగ్ం సర్వాగంస్తాన్మోక్షయిష్యతి॥
14. అహంబ్రహ్మాఽస్మి మంత్రోఽయం జ్ఞానానందం ప్రయచ్ఛతి
సప్తకోటి మహామంత్రం జన్మకోటి శతప్రదమ్॥
15. సర్వమంత్రా న్స ముత్సృజ్య ఏతన్మంత్రగ్ం సదాభ్యాసేత్
సద్యోమోక్షయవాప్నోతి నాస్తి సందేహ మణ్వ పీతి॥
(తేజో బిందోపనిషత్తు నుండి)

పై శ్లోకములు అర్ధమగునటుల సరళముగా ఉన్నవి. అయిననూ క్లుప్తముగా వాటి తాత్పర్యము విశదీకరించుచున్నాను.

అహంబ్రహ్మాఽస్మి (నేనే బ్రహ్మను) అనే మహా వాక్యమునెడి మంత్రము నిరంతరము సాధన వలన దృశ్యమంతయు (జగత్తు) భ్రమవలన అజ్ఞానము వలన శాశ్వతమనుకొను చిత్తవృత్తులు దాని యందలి దోషములు నశింపచేయును. అన్యమంత్రములను నాశనము చేయును. దేహమే నేను అనెడి దేహాత్మ భావాలను నశింపచేసి జన్మ పరంపరలనుండి విముక్తి కలిగించి మోక్షమును పొందించును. ద్వైత్యబుద్దిని నిర్మూలించి దానివలన కలుగు దుఃఖములను నాశనమును చేయును. భేధబుద్దిని, కామాదులను సంకల్పములను, పునర్జన్మకు హేతువులయిన క్రోధవృతులను, వాటివలన కలుగు సకల దోషములను, సర్వశోకములను, సర్వవ్యాధులను

నశింపచేయును. జన్మ పాపము అంటే జన్మ పరంపరలనుండి విముక్తి కల్గించి సర్వబంధములను నశింపచేసి మోక్షమును పొందించును. మృత్యు పాశమును, ద్వైత దుఃఖమును నశింపజేయును. కోటిదోషములను, సర్వతంత్రములను నశింపచేయును. తనకున్న అజ్ఞానము నశింపచేయును, ఆత్మ లోకజయమునిచ్చును ఊహింపశక్యము గాని సుఖమునిచ్చును. బుద్ధిమాంద్యము నిర్మూలించును. అనాత్మ జ్ఞానమనే రాక్షసుని మర్ధించును. అనాత్మాగిరులను ఎగురగొట్టును. అందరకూ మోక్షము కలిగించును. జ్ఞానానందము ఇచ్చును. ఇది సప్తకోటి మహామంత్ర సమమైనది. జన్మకోటి శతములనిచ్చును. అన్ని మంత్రములను వదలి ఈ మంత్రమునే ఎల్లప్పుడు అనుష్ఠించిన వెంటనే మోక్షము పొందుననుటలో అణు మాత్రమైనను సందేహములేదు.





## 14. తత్త్వమసి

పై విషయాల్ని భోధ చేస్తూ సద్గురువు నీ మీద అపారమైన కరుణతో నీ తత్పరతను గుర్తించి **"తత్త్వమసి"**, అనే మహావాక్యాన్ని కూడా ఉపదేశిస్తాడు. నీ యందు జాగ్రత్త స్వప్నములు సుషుప్తి అవస్థలు మూడు కల్పితములు. నీవు అవస్థా త్రయ విలక్షుణడవు. స్వయం జ్యోతి స్వరూపుడవు. కేవలం పరబ్రహ్మ స్వరూపుడవు.

తత్ = ఆ పరమాత్మ
త్వం = నీవు
అసి = అయి ఉన్నావు

తత్త్వమసి మహా వాక్యము వలన ఉత్పన్నమగు ఏ జీవ బ్రహ్మైక్య జ్ఞానముకలదో అటయే ముక్తి సాధనము. **"నేను నేను"** అను సంభోదించు బ్రహ్మమువై ఉన్నావు. సందేహము లేదు. అంతఃకరణమునకు దాని వృత్తులకు సాక్షివగుచూ, జ్ఞానమూర్తియు, ఆనందరూపుడవగు నీవు **"నేను నేను"** ఆత్మ అయి ఉన్నావు. నీవు ఎల్లవేళలా ఉన్నావు. జాగ్రద్, స్వప్న, సుషుప్తి అవస్థలలో కూడా ఉన్నావు. ఆ కాలములో జరుగు విషయములకు సాక్షివై ఉన్నావు. అంతఃకరణ వృత్తులకు, కర్మేంద్రియాలకు, జ్ఞానేంద్రియాలకు నీ చైతన్యశక్తి వలనే ప్రవృత్తి చెందుతున్నాయి. అవి స్వతహా జడ పదార్ధములే. నీవుదేహము కాదు. దానికి సాక్షివి. నీవు మనస్సుకు, బుద్ధికి, పంచప్రాణములకు కూడా విలక్షణుడుగా సాక్షిగా ఉన్నావు. నీవు సత్యానంద స్వరూపుడవు. ఆత్మవు, నిరాకారుడవు, నిర్గుణుడవు, అవ్యయుడవు, నీవు చైతన్య శక్తివి. నీవు అంతఃకరణలో (బుద్ధి) ప్రతిబింబంవల్ల ఆ ప్రతిబింబం స్వయంగా నీకున్న ధర్మాలన్ని ఆ

ప్రతిబింబానికి ఉన్నప్పటికి భ్రమతో అవిద్యతో అజ్ఞానంచే బుద్ధి, మనస్సు, జ్ఞానేంద్రియాలు ఈ సంఘాతం వల్ల చేయబడిన వృత్తులు, ధర్మాలు అనీ నీ మీద ఆరోపించుకొని, నేను ఫలానా కులస్థుణ్ని, నేను చస్తున్నాను, నేను పుడుతున్నాను. అని రోదిస్తున్నావు. నీకు పుట్టుక లేదు. చావులేదు. నీవు అవినాశివి. చావు పుట్టుకలు శరీర ధర్మాలు నీవి కావు. అని గురువు బోధ చేస్తాడు.

## సర్వం ఖల్విదంబ్రహ్మ

నిత్య నిరంతరం జగత్తు కూ డ పరబ్రహ్మకంటే వేరుకాదు, అని తాను ఎక్కడెక్కడ చూస్తాడో అక్కడక్కడల్లా సహజ సమాధి స్థితి పొందే వరకు కడు జాగ్రత్తగా తన సంకల్పాలపై విచారణ చేసుకుంటూ మనస్సు సాధనలో పెట్టి తురీయ భూమికకు చేరునంతవరకు తీవ్ర ప్రయత్నము తప్పదు. ఆ విధంగా తీవ్ర సాధన చేయు ముముక్షువునకు తన స్వస్వరూప అనుభవము నిర్వకల్ప సమాధి ద్వారా కలుగబట్టి సంచిత కర్మ భస్మమవుతుంది. ఇక ప్రారబ్దము విడిచి పెట్టిన బాణము కాబట్టి దానిని అనుభవించటాన్ని శరీరానికి అప్పచెబుతాడు. తాను సాక్షిచైతన్యాన్ని అని అనుభవంలోకి తెచ్చుకున్నాడు కాబట్టి, శరీరము తాను కాదు అని నిశ్చయాత్మక బుద్ధికలవాడగుటచే ప్రారబ్దకర్మ ప్రకారం శరీరానికి వచ్చిన దానికి అప్పచెప్పి ఉదాశీనంగా ఉంటాడు. వాటిలో తగుల్కొని విక్షేపాలు రానీయడు. తాను మహావాక్యం అనుభవంలోకి తెచ్చుకున్నాడు కాబట్టి శ్రీ గురువు గారి తత్త్వభోధ వల్ల కనిపించే జగత్తు అంతా బ్రహ్మ పదార్థమని నిదిధ్యాసతో **"తత్త్వమసి"** అను మహావాక్యం అనుభవంలోకి తెచ్చుకుంటాడు. తాను చూసిన చోటెల్లా బ్రహ్మ పదార్ధమే గోచరిస్తుంది. జగత్తు కన్పించదు. జగత్తు బ్రహ్మకంటే వేరుకాదు, అని అనుభవంలోకి తెచ్చుకుంటాడు. సర్వం





ఖల్విదం బ్రహ్మ అనే మహా వాక్యం అనుభవంలోకే వస్తుంది. ఆ విధంగా తాను సహజ సమాధి స్థితికి చేరుకుంటాడు.

## ప్రజ్ఞానం బ్రహ్మ

తనలోని కన్ను ద్వారా చూసిన జ్ఞానం చెవి మొదలగు ఇంద్రియాల ద్వారా తెలిసికొన్న జ్ఞానం అన్నిటికి మూలాధారమైన ప్రజ్ఞానం అనేది ఏదయితే ఉన్నదో అది ఎరుక అనిన్నీ ఇవన్నీ తనలోనే తానై ఉన్నాడని నిర్ధారణ చేసుకొని "ప్రజ్ఞానం బ్రహ్మ" అని అనుభవంలోకి తెచ్చుకుంటాడు.

## అయమాత్మ బ్రహ్మ

ప్రతి జీవరాశిలోనూ ఉన్న చైతన్య శక్తికూ డా ఆ పరమాత్మేనని అవి తన కంటే వేరు కాదని తాను అందరిలో ఉన్నానని అవి తనలో ఉన్నవని నామరూపాలకు ప్రాధాన్యత ఇవ్వకుండా, ఆ పరబ్రహ్మ సర్వేసర్వత్రా నిండి ఉన్నట్లుగా తీవ్ర సాధన వల్ల "అయామాత్మ బ్రహ్మ" అను మహా వాక్యము అనుభవంలోకి తెచ్చుకుంటాడు. ఇది సమాధి అని ఇది సంసారమని ప్రత్యేకత పోయి సహజంగా నిర్వికల్పంలోనే ఉటాడు. ఎందుచేతంటే భ్రాంతి వల్ల బుద్ధిచే తెచ్చుకున్న మానసిక సంసారం విడిబడుతుంది. ఇక సంసారధ్యాస ఉండదు. పాలలో నుండి వచ్చిన వెన్నను కాయగా నెయ్యి అవుతుంది. అది మళ్లీ పాలలో కలవదు. అదేవిధంగా తాను నిర్వికల్ప సమాధి ఆ తరువాత సాధనాబలంతో సహజ సమాధి స్థితిని పొందిన యోగి పూర్ణుడవటం మూలంగా సంసారంలో కలవడు. తీవ్ర సాధన వలన రెండవ వాడులేడు. ఏకమే వాऽద్వతీయం బ్రహ్మ, ఉన్నది ఒక్కడే అది తాననే నిత్యనిరంతరం అనుభవంతో ఉండటం వలన పూర్ణుడవుతాడు.

అయితే చంద్రుడు చంద్రుని యొక్క వెన్నెలకు భేదంలేదు. చంద్రుడు సత్తు, వెన్నెలచిత్తు. సత్తు లేకుండా చిత్తులేదు. ఆ రెండూ అభేదము. తాను పూర్ణస్థితిలో ఉన్నప్పటికి ఇంకనూ శరీరము ఉంది కాబట్టి, దానికున్నవి హిత కర్మలాచరించాలి కాబట్టి, తనను ఆశ్రయించిన ముముక్షువులు తరించుటకై తత్త్వబోధ చేయాలి కాబట్టి పూర్ణుడైనప్పటికి శుక్ల చతుర్దశి చంద్రుడివలె వ్యవహరిస్తాడు. ఇక అతను చేయవలసిన కర్మలేవీ ఉండవు. శారీర ధర్మాన్ని బట్టి ఏమి కర్మలు చేసినా చేయనట్లే లెక్క. అందుచే ఆగామి కర్మ ఫలితాలు అతనికి ఉండవు. కర్మ ఫలమంతా నిశ్శేషమవుతుంది. తనవద్దకు వచ్చిన వారిపై జ్ఞానదృష్టి ప్రసరించడం వలన ఆ వచ్చిన వారికి శీతలము, శాంతము చిక్కుతాయి. అటువంటి మహాయోగి యొక్క కృపా వీక్షణాలచే వారి పాపసముదాయము కూడా పటాపంచలవుతాయి. వారుద్ధరింపబడుతారు. అటువంటి యోగి ఎల్లప్పుడు నిశ్చల సమాధిలో ఆనంద సముద్రంలో ఈదుతూ ఉంటాడు. లోక వ్యావాహారార్థం బలవంతంగా బయటికి వస్తాడు. ఒక్కొక్కసారి తానులోనే తాను మాట్లాడుకుంటాడు. నవ్వుకుంటాడు. శరీరము మీద ఈగలు మొదలైనవి వాలినా శరీర స్పృహ ఉండదు కొందరికి వారి సాధనానుసారంగా ఘనసత్కారాలు జరిగినా ఉప్పొంగరు. అవమానాలు జరిగినా కృంగిపోరు. అతినిర్మల హృదయుడై, సహనపరుడై ఉంటాడు. అతని వద్ద బద్ధవైర జంతువులుకూడా మైత్రితో మెలగుతాయి. తీవ్ర సాధన వల్ల కొన్ని సిద్ధులు పొందినప్పటికి అవి ఎన్నటికి ప్రదర్శించడు. ఈ స్థితిలో సప్త భూమికలలో విశద పరచినటుల ఒక భూమికను దాటి మరో భూమికి చేరుకుంటాడు.

నేను అద్వితీయుడను, నాశరహితుడను, విశ్వరూపుడను, మంగళాకరుడను, శాశ్వతుడను, అనంతుడను, అచ్యుతడను, అవినాశిని,





నిత్యుడను, ముక్తుడను, పరిశుద్ధుడను, నిర్వికారుడను, నిర్గుణుడను, స్వయం ప్రకాశకుడను, నిరాకారుడను, జ్ఞాన స్వరూపుడను, తత్త్వ స్వరూపుడను, అచలుడను, అమృత స్వరూపుడను, అవాఙ్మానస గోచరుడను, అభిన్నుడనుఅని ఎల్లవేళల అనుసంధానము చేసుకొనుచు ఆనందసాగరములో వోలలాడుతాడు ఆత్మారాముడై వెలయును.

అటువంటి అవధూత ఆశా పాశములు లేనివాడై, పరిశుద్ధుడై, అంతటను సమభావముతో మునిగిన వాడై విదేహ కైవల్యము పొందుచున్నాడు. నియతి ప్రకారముశరీరము త్యజించగానేఆ అవధూత పునర్జన్మ కలుగచేయు బీజాలు, వాసనలు అన్నీ దగ్ధమయ్యాయి కాబట్టి పునర్జన్మ లేదు. ఆయన పరమాత్మలో కలసిపోతాడు ఏ విధంగానంటే ఘటాకాశము అనంతాకాశము ఒకటే కదా! ఘటము భంగమవగానే ఘటాకాసము అనంతాకాశములో కలిసిపోతుంది. ఇక అక్కడావరణ లేదు. దానినే పునర్జన్మ లేని మోక్షము అంటాం.

ఎన్నో పూర్వ జన్మలలో చేసిన పుణ్యమును వెచ్చించి మానవ శరీరము తీసుకొని సాధించవలసిన గమ్యము ఇదే. అలా చేయకపోతే జన్మపరంపరలలో చిక్కుకొని పతనమవుతాడు.

## 15. సాధనలో కలుగు అవరోధాలు - సవికల్ప సమాధి - నిర్వికల్ప సమాధి

సాధకునికి ప్రారంభదశలో ధ్యానము చేయునపుడు అనేక విఘ్నములు కలుగవచ్చును. ఆ ధ్యానము చేయుటకు తనకు సుఖకరమగు ఆసనముపై కూర్చోన వచ్చును. పద్మాసనవే వేయువలయునని నియమములేదు. వేసిన మంచిదే. యోగాసానాలు వేయలేని వానికి ఏవిధంగా కదలక కూర్చుంటే సుఖముగా ఉంటుందో ఆవిధంగా కూర్చోవచ్చు. సాధారణంగా భూమికి ఎత్తుగా ఒక చాపపై మెత్తగా వస్త్రములు పరచి గోడకు ఆనుకొని కూర్చోవచ్చు. కళ్లు మూసుకొని పెదవులు కదలకుండా జిహ్వాతో తనకు వినబడునట్లుగా "అహం బ్రహ్మాస్మి" అను వాక్యమును అర్ధముతో ఎడతెరపి లేకుండా తైల ధారవలె ఉచ్చరించాలి. ఈ శబ్దము బైటకి వినపడరాదు. పెదిమలు కదుపరాదు. ఈ విధంగా చేస్తోంటే మనస్సు సంకల్పాలు చేస్తు ఉంటుంది. ఇది మొదటి విఘ్నము. ఆ మనస్సును బలవంతంగా తీసుకురాకూడదు. దానిని దాని సంకల్పాలను ఉదాసీనంగా చూస్తూ దానిని కూడా ధ్యానం చేసే మహావాక్యార్థంపై తీసుకురావాలి. ధ్యానకాలము రోజు నిర్ణీత సమయములో చెయ్యాలి. రోజురోజుకూ ధ్యాన సమయముపెంచుతూ ఉండాలి. ఈ విధంగా చేస్తూ ఉంటే శరీరము కంపించటం, కాళ్లు నెప్పి పెట్టటం కలుగవచ్చును. శరీరము నీవు కాదు కాబట్టి వాటికి కూడా సాక్షి రూపములో ఉంటివి కాబట్టి వాటిని కూడా నిర్లక్ష్యము చేయాలి. ఈ విధంగా చేస్తున్నప్పుడు కొంత మంది సుషుప్తిలోకి జారుతారు. ఇది తమో గుణరూపమయిన నిదుర. అంతే కాని సమాధికాదు. అపుడు జాగ్రత్తగా మెలుకువ తెచ్చుకొని ధ్యానము కొనసాగించాలి. గుటకలు వేయరాదు. నాలుక అంగట్లో అదిమిపెట్టి జిహ్వా, మనస్సుతోనే మహావాక్యము చెయ్యాలి. ఈ విధంగా





చేయగా కొన్ని రోజుల తరువాత జ్యోతి కనిపించటం, శరీరము తేలిక అయి ఎగురుతున్నట్లు అనిపించటం, చిత్కళలు కనిపించటం మొదలెడుతాయి. కాని ఇవి కూడా సమాధి స్థితి కానేరదు. ఇక్కడ కూడా ద్రష్ట దృశ్యము చూచుట అనేత్రిపుటి ఉన్నాయి. వాటికి కూడా నీవు సాక్షివి కాబట్టి తృణీకరించి ధ్యానం కొనసాగించాలి. కొంత మందికి ఏమీ కనిపించక శూన్యములో తిరుగాడినట్లు అనిపిస్తుంది. ఇది కూడా సమాధి కాదు. ఇక్కడ కూడా చూసే నీవు, చూడబడే శూన్యము, ఉన్నది. త్రిపుటి ఒకటి అపలేదు. ఏ విధమయిన సంకల్పములు లేకుండా చూడబడే తాను (ద్రష్ట) చూడబడే వస్తువు (దృశ్యము) చూచుట అనునది మాత్రమే మిగులుతుందో దానిని సవికల్ప సమాధి అంటారు. అక్కడ సంకల్పాలుండవు. అయినప్పటికి ఈ సమాధి వల్ల ఉపయోగము లేదు. నేను భగవంతుణ్ని చూశాను అని ఎవరు అంటారో వారు చూడనట్లే. కొంతమందికి ఈశ్వరుడు లేక ఇష్టదేవత ధ్యానంలో కన్పిస్తారు. అది భావసమాధి మాత్రమే. ఇది కూడా ఉపయోగకారికాదు. కొంతమంది ఈధ్యాన తీవ్రతను బట్టి కొన్ని మహిమలు కల్గవచ్చును. అవి పతన హేతువులు. వాటిని కూడా తృణీకరించాలి. ఆవిధంగా ధ్యానము చేయగా చేయగా చేసిన తీవ్ర సాధన వలన, గురుకృప వలన, ఈశ్వరానుగ్రహము వలన ధ్యానం చేయు తాను బుద్ధిగుహలో ప్రవేశించి అఖండ జ్యోతిలో ప్రవేశించి తానుకూడా జ్యోతిగా మారి దుఃఖ నివృత్తి అయి అఖండానందం అనుభవిస్తాడు. ఇచ్చట త్రిపుటి నశిస్తుంది. తాను దృశ్యములో లయమవుతాడు. వారి వారి శరీరధర్మము బట్టి కొంతమంది రోదిస్తారు. కొంతమంది ఆనందంతో పకపక నవ్వుతారు. వారిని చూసే వారు కంగారు పడవచ్చు. కంగారు ఏమీ లేదు. కొంతసేపు అయ్యాక మళ్లీ మన జాగ్రదావస్థలోకి వచ్చి తనే అనుభవాన్ని చెబుతాడు. దీనిని నిర్వికల్ప సమాధి అంటారు. ఇది ఒక క్షణము సేపు కలిగినా పునర్జన్మ ఉండదు.

# 16. సప్త జ్ఞాన భూమికలు

పై విధముగా తీవ్ర సాధన చేయు ముముక్షువు తాను ఏ స్థితిలో నుండెనో నిర్ణయించుకొనుటకు ఆధ్యాత్మిక సాధనలో ఎంతవరకు పురోగమించినది తెలుసుకొనుటకు ఈ కిందనుదహరించిన సప్త జ్ఞాన భూమికలు తోడ్పడగలవు. అవి (1) శుభేచ్ఛ (2) విచారణ (3) తను మానస (4) సత్త్వాపత్తి (5) అసంసక్తి(6) పదార్థభావన (7) తుర్యగ. ఈ భూమికలను అధిరోహించిన మహాత్ముడు పునర్జన్మలేని మోక్షమును పొందుచున్నాడు.

(1) **శుభేచ్ఛ**: ఈ భూమికలో వారు ఈ దృశ్యమాన ప్రపంచము అంతయు మిథ్య అయినప్పటికి సత్యమని భ్రమించితిని. ఇది నిస్సారము కదా! నాకు వైరాగ్యము ఎట్లు దృఢపడగలదు. ఈ దుఃఖరూప సంసారము నుండి ఎట్లు తరించగలను. ప్రేయో మార్గము అవలంబించి జన్మ పరంపరలలో చిక్కు పడితిని. పునర్జన్మలేని మోక్ష స్థితికి దారియేది. జీవుడు శరీరము వదలినంతనే వేరొక శరీరములో కర్మానుసారము ప్రవేశించు చుండగా ఈ మరణము శరీరమునకే కదా! జీవుడు కూ డా శాశ్వతుడే కదా! జీవత్వము పొందు పరబ్రహ్మలో లీనమగుట ఎట్లు? నాకు ఈ మోహం ఎట్లు నివారణమగును? ఆత్మ నశించదు కదా! ఇట్టి ఇచ్ఛకలుగుటచే సర్వ విషయములందు తీవ్ర వైరాగ్యము కలుగుటచే తత్ పదార్థమెరుగుటకు సత్ గురువుల అన్వేషణ ప్రారంభించును. ప్రేయో రూపమయిన స్వర్గాదులు కూడా అనిత్యమనే బుద్ధి కలిగి దానియందుఇచ్ఛ సమూలముగా నశించును. ధర్మాత్ముడై మెలగుచు మూఢ కార్యముల జోలికి పోక, పరులకు అపకారము తలపెట్టక సజ్జన సహవాసము





చేయుచూ, సత్ గ్రంధపఠనము చేయుచూ తన స్వస్వరూపము ఎట్టిదో తెలిసికొన ప్రయత్నించును. మోక్ష పదమునకు బ్రహ్మ జ్ఞానమే శరణ్యమని నిశ్చయించుకొని ఆ తత్త్వజ్ఞానము తెలుపుగురువు కోసం పరితపించును.

(2) **విచారణ**: ఈ విధంగా శుభేచ్ఛలో పరిపక్వ స్థితిని పొందిన విచారణ అనే భూమికలో ప్రవేశించుచున్నాడు. ఈ భూమికలో అనుభవనీయుడైన పుణ్యపరిపాకవశమున సద్గురువును ఆశ్రయించి వేదాంత విచారణ ప్రారంభించును. అంటే శృతి స్మృతుల రూపశాస్త్ర పరిచయము, ధ్యానము మొదలగు యోగపరిచయము, సజ్జన సాంగత్యము ద్వారా గురువు ద్వారా తత్త్వ రహస్యములన్నీ తెలిసికొనును. అట్టివాడు తీవ్రవైరాగ్యముచే విషయములను దోషదర్శనముచే విచారించి విడిచి, రాగద్వేషములకు అతీతుడై, కామము జ్ఞానమునకు నిత్యవైరి అని తెలిసికొని, దేహాత్మ బుద్ధిని తగ్గించుకుంటూ జ్ఞానము పవిత్రమైనది, పరమ శాంతమయినది, మోక్షసాధనమని గ్రహించును. జ్ఞానబలముచే కర్మ నాశనమునకు ప్రయత్నించును. ఈ భూమికలో కార్యవ్యవస్థ కర్మవ్యవస్థ బాగుగా తెలుసుకున్న వాడగును. అందుచే కర్మవలన గాని, పుత్రులవలన గాని, ధనముచేగాని ముక్తి కలుగదని నిశ్చయించుకొని ఒక్క త్యాగము ద్వారానే అంటే అహంకార, మమకార కర్తృత్వ త్యాగము ద్వారానే మోక్షప్రాప్తి కలుగునని నిశ్చయించుకొని **"నకర్మణా నప్రజయా, ధనేన త్యాగేనైకే న అమృతత్వ మానసుః"** దీనిలో ముముక్షువు పురాణ శ్రవణము చేయుచూ మంచి కర్మలను శాస్త్రముల ద్వారా నెరిగి అనిష్ఠించు చుండును. వాదము అభిమానము, మాత్సర్యము, రోషము, అసూయ, ఓర్వలేనితనము, ఈర్ష్య మొదలైన అసురగుణములను దూరము చేసుకొనుచూ అటువంటి విషయములపై ఏ మాత్రము మమత్వము, అభిమానము చూపక నిర్మల

చిత్తముతో తత్సంగము ద్వారా సర్వ ప్రపంచమందును బ్రహ్మరూపమున నిశ్చయించుకొను చుండును. ఈ భూమికలో చిత్త శుద్ధిని పొంది విచారణ ద్వారా సమాధి ద్వారానే జ్ఞానము పొందవచ్చుననే నిశ్చయమునకు వచ్చును. అట్టి జ్ఞానముద్వారానే సర్వకర్మలు ధ్వంసమైనర్చునని **"జ్ఞానాగ్ని దగ్ధసర్వకర్మాణాం"** పునర్జన్మలేని మోక్షమునకు హేతువు అగునని తెలిసికొనును. ఈ ఆత్మతత్త్వము గురుకృప, ఈశ్వరకృప, ఆత్మకృపలేనిదే కలుగదని నిశ్చయించుకొని సర్వకర్మలు బ్రహ్మ భావముతో చేయును. **"జీవో బ్రహ్మైవనాపరః"** అను శృతులయందు దృఢ విశ్వాసము కలిగి యుండును. అరిషడ్వర్గములు విడనాడును. నిష్కామకర్మ ద్వారా కర్తృత్వమును విడిచి కర్మాచరణ చేయుచుండును. సిద్ధ పురుషుల సాంగత్యము కోరుచుండును. జ్ఞానియొక్క ప్రవర్తను తెలుసుకొనుచుండును, జ్ఞానమందు ఆసక్తిచే జితేంద్రియుడై అనన్య భక్తిచే వస్తు సమ్యజ్ఞానము పొందుచున్నాడు. ఈ విధంగా జ్ఞాన సముపార్జనకు సర్వవస్తు సామాగ్రిని సిద్ధపరచుకొని ఈ భూమికయందు పరిపక్వత చెంది తరువాత భూమిక అయిన తను మానసి అనే భూమికను పొందుటకు అర్హుడు అగుచున్నాడు.

(3) **తనుమానసి**: పై విధంగా శుభేచ్ఛ, విచారణ బలంతో సర్వ వస్తు సంబంధ రాహిత్యము చేసుకొని ఈ భూమికను చేరుచున్నాడు. ఈ భూమికను ఆశ్రయించిన వ్యక్తి విషయాలయందు విజృంభించు మనస్సును స్థిర పర్చుకుంటాడు. గురు శాస్త్రాల యందు శ్రద్ధా వంతుడవుతాడు. తత్త్వ వస్తు పరిజ్ఞానము దృఢమవుతుంది. అందుచే సర్వ భోగములనుమిధ్యాత్మ నిశ్చయము చేయుటచే వాటిని పరిత్యజిస్తాడు. సత్సంగంలో పాల్గొంటూ బ్రహ్మ ప్రసంగాలలో కాలము గడుపుతాడు. ఇంద్రియాలనువిషయముల మీదికి పోనీయక వాటి గోళముల యందు నిలుప గలుగుతాడు. వస్తులబ్దికి





సత్వగుణ ప్రధానుడుగా మనస్సు స్థిర పరచి స్వస్వరూపమయిన ఆనంద రూప సమాధి ఎపుడు కలుగునా అని తపన పొందుతూసాధన తీవ్రత చేస్తాడు. మానసిక కోరికలుకూ డా ఉండకూ డదని, నిగ్రహం, అమనస్క స్థితిని పొందించు సత్వ గుణమును ఆశ్రయించును. భగవద్గీతలో చెప్పబడిన దైవీ సంపద యొక్క ప్రాధాన్యతను గుర్తించి తదనుగుణంగా ప్రవర్తిస్తూ జ్ఞాన పరికరములన్నీ చేర్చుకొని శ్రవణము చేస్తూ ఉంటాడు.

(4) **సత్వాపత్తి**: సత్వాపత్తి అంటే సత్య స్వరూపుడగు ఆత్మయందు నిలకడ కలిగి ఉండటం. క్రిందటి భూమిక దాటిన వానికి నేను కర్తను కాను, భోక్తను కాను, సుఖదుఃఖములన్నియు పూర్వజన్మకృతములై ఈశ్వరాధీనములయినవి. అందుచే నేను నిమిత్త మాత్రుడను. సంపత్తు, భార్యా, పుత్ర మిత్రాదులు, గృహారామక్షేత్రాదులతో కలుగు సంయోగములన్నీ వియోగము కొరకే. అవి దేహ సంబంధములే. ఈ అహంకార రూపమై ఉండు ఈ శరీరము సత్యము కానపుడు మమకార రూప "నాది" అనే ప్రతి ప్రదార్థమందు దోషనిర్ణయము చేసి తీవ్ర వైరాగ్యముతో ఉంటాడు.ఇది దృఢ పడుతూరాగా దుష్టుల విడనాడి సజ్జనుల నాశ్రయించుటే మూడవ భూమిక దాటిన వానికి తత్త్వమసి అను వాక్యార్థముపదేశమునకు అర్హుడౌతాడు. నాల్గవ భూమికకు చేరుకుంటాడు ఈ భూమికలో సాధన చతుష్టయ సంపత్తిని పూర్తిగా పొందికర్తృత్వరహితుడై అహం మమలను విడనాడి **"తత్త్వమసి"** మహా వాక్యార్థమును గ్రహించి **"అహం బ్రహ్మాస్మి"** వృత్తిని స్వీకరిస్తాడు. ఈ రీతిగా మనస్సును ఆద్యంత శూన్యము అఖండై కరసము, శాశ్వతము, సర్వోత్కృష్టము, పూర్ణ చంద్రోదయమువలె నుండు పరబ్రహ్మ స్వరూపముగా అనగా "ఇదియే నేను" అనే సమాధి రూప అనుభూతిని గురుశక్తి పాతముద్వారా ఆనంద

రూపమును అనుభవమునకు తెచ్చుకుంటాడు. ఈ విధంగా సంసారమూలా జ్ఞానముతో సహా **"జ్ఞానాగ్ని సర్వ కర్మాణాం భస్మసాత్కురేర్జున"** అని నటుల సంసారము పూర్తిగా విలయమై ఉత్కృష్టమైన సద్ఘన, చిద్ఘన, ఆనంద ఘనరూప బ్రహ్మ తన స్వరూపముగా అనుభవిస్తాడు. అంటే నిర్వికల్ప సమాధి అనుభవిస్తాడు. ఈ విధంగా తాను అనుభవిస్తున్న స్థితియే నాల్గవ భూమిక అయిన సత్వాపత్తి. ఈ భూమిక యందున్న వానిని బ్రహ్మ విదుడుగా పేర్కొనబడుతాడు. అటువంటి యోగి **"నచర పునరావర్తతే"** అని నటుల తిరిగి జన్మను పొందడు.

(5) **అసంసక్తి**: ఈ భూమిక చేరిన యోగిని **"బ్రహ్మ విద్వరుడు"** అంటారు. ఎల్లవేళలా అంతర్ముఖుడై సుషుప్తావస్థ యందుండు వానివలే ఉంటాడు. మరియు ముముక్షులయిన వారికి ఉపదేశము చేయుచు శౌచ స్నానాదులయందు ప్రవృత్తి కలిగినను తాను చేయు కొద్దిపాటి వ్యవహారములున్నూ అహంకారమే చేయుచున్నదని సర్వ ఇంద్రియ వ్యాపారాన్ని వాటివాటి గోళములకు అంటగట్టి తాను మాత్రము నిత్యము సుఖము జనన మరణ రూప సంసారంగాని బ్రహ్మయే నేనని అఖండాకార వృత్తినవలంబించి నిత్యము బ్రహ్మయంధే చలించుచూ ఉంటాడు. ఏకాంత నిష్టుడయి సదా బ్రహ్మరూప సమాధి యందుండును. ఈ భూమికయందు చిత్తము బొత్తిగా ఉండదు. తాను సత్తామాత్రముగా ప్రతీతి అగుచుండును. మరియు నిత్య తృప్తుడు సంక్షోభ శూన్యుడై సర్వ భేధములు లేక పరబ్రహ్మయందే నిలచి యుండుటచే నిదురించిన వానివలె కానవచ్చును. విషయములందు అనాసక్తుడై ఉండును. ఈ భూమికలో చేరిన మహాత్ముని ఏ విషయములు బంధింపవు వారిని **"తత్వదర్శిని"** అని అనుచున్నారు. ఏకస్వరూపమయిన **"ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మనేహ నానాస్తికించన"**





అనినటుల ద్వితీయవస్తు రహిత శుద్ధ చైతన్య ఆనంద రూపాత్మ తాననే నిశ్చయము కలిగి సర్వ పరిత్యాగముచే కర్తృత్వ భోక్తృత్వములు లేక తామరాకుమీద నీటి బిందువు లాగా ఉంటాడు. శరీరాన్ని ప్రారబ్దానికి విడుస్తాడు. **"సర్వమిదం అహంబ్రహ్మైవ"** అని బ్రహ్మతో ఐక్యమును పొందుతాడు. నామ రూపాత్మకమైన జగత్తును కూడా బ్రహ్మగా గాంచుచూ **"బ్రహ్మ విద్వరుడని"** ఖ్యాతి పొందుతాడు. బాహ్య వ్యాపారమంతయూ గుణకార్యములని నిశ్చయించుకొని సర్వదా ఏకాంతనిష్టుడై ఉంటాడు. ఈ విధంగా అసంసక్తిని అధిరోహించిన నిర్గుణభక్తుడు సర్వ భూతములయందు ద్వేషభావము లేక మైత్రి కలిగి ఉంటాడు.

(6) **పదార్థ బావన**: ఈ భూమికను పొందిన మహాత్ముడు బాహ్యాంతర విచక్షణ లేక పదార్థములన్ని బ్రహ్మ భావన చేస్తాడు. అమనస్కయోగము నాశ్రయించిన వాడై ఆత్మ క్రీడ ఆత్మరతి ఆత్మానందమునే నిత్య నిరంతరము అనుభవిస్తూ ఆత్మారాముడని పిలువ బడుతాడు. ఈ స్థితిని పొందినవాడు తన నిజస్వరూపమును సాక్షాత్కరించుకొని తురీయ స్థితిని పొందినవాడై జీవన్ముక్తుడై మెలుగుచుండును. అట్టి జ్ఞాని **"సర్వంఖల్విదం బ్రహ్మ"** యని సర్వమును బ్రహ్మ యందన్వయ పరచుకొని ఆనంద సాగరముల నోలలాడుతూ ఉంటాడు. ఈ ఆరవ భూమికను చేరిన యోగి నిదురించి నిదురింపని వానివలె వ్యవహారములు చేయు చుండియూ చేయని వానివలె ఉంటాడు. కేవలం పరమానంద నిమగ్నుడై ఉంటాడు.

(7) **తుర్యగ**: ఆరవ భూమికను చిరకాలము అభ్యసించుటవలన బ్రహ్మ వేత్తలలో అగ్రగణ్యమైన అనగా సిద్ధులలో (బ్రహ్మ వేత్తలలో) ఉత్తమోత్తమైన తుర్యగ అనుభూమికను పొందును. నిర్మలత్వము,

పరమశాంతత్వమే ఈ భూమిక యొక్క ముఖ్యలక్షణము. ఈ భూమికలో పరిపూర్ణుడై పూర్ణ సుధాకరుని పోలిన నిత్యతృప్తితో, సుఖదుఃఖముల స్మరణలేక ఆత్మారాముడై తననాశ్రయించిన వారికి అంతఃకరణ శీతలమును కలుగచేయుచూ పరమాత్మతానై మౌన స్థితిలో నిత్య నిరంతరము బ్రహ్మ భావనమనే నిర్వికల్ప సమాధిని ఆశ్రయించి ఉంటాడు. ఈ సప్త భూమికనే **"బ్రహ్మ విద్వరిష్టస్థానమని"** చెప్పుదురు. వీరు బాహ్యము సర్వము మిథ్య అనే నిశ్చయము ద్వారా సకల సంశయరహితుడై, సర్వదా నిధిధ్యాసనాపరుడై నిర్వికల్ప సమాధి నిష్టుడై బాహ్యాంభ్యంతర సర్వ వ్యాపారములను మరచి స్వస్వరూపానందమునందే చిత్తము గలవాడై సంసారసాగరమును తరించిన వాడగుతున్నాడు. ఈ స్థితికే శివుడని, రుద్రుడని, బ్రహ్మయని అంటారు. ఈ భూమికను చేరినవారికి మౌనమే ప్రధానంగా ఉంటుంది. వీరు ప్రపంచములోని సర్వత్రిపుటిలను సమన్వయపరచుకొని నిర్గుణ, నిర్వికార, పరబ్రహ్మ స్థితిలో ఉండుటయే ఈ భూమిక యొక్క పరిపక్వస్థితి. పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల సమస్త జీవకోటి తాను ఎటువంటి ఆనందస్వరూపుడో అటువంటి ఆనంద రూపులనే భావంతో ఉంటాడు. సర్వ ధర్మములు విడిచి ప్రణవ స్వరూపుడైన బ్రహ్మమే తానై ఆనందఘన స్వరూపముక్తిని పొందును.





## 17. నిర్విల్పసమాధి పొందిన యోగి ఏవిధంగా మాయలోకి జార కుండా దేహత్యాగ పర్యంతము స్థితిని కాపాడుకోవాలి

నిర్వికల్ప సమాధి పొందిన యోగి ఈ క్రిందివిధముగా నిత్య నిరంతరము భావన చేస్తు ఉండటంవల్ల ఎల్లవేళల సహజ సమాధి స్థితి ఏర్పడుతుంది.

సర్వప్రపంచము సచ్చిన్మయము, సచ్చిదానందము, అద్వైతము, అవ్యయము, సచ్చిదానందమాత్రము, సచ్చిదానంద రూపము, ఆకాశము నీవు సచ్చిదానందము, నేను సచ్చిదానందము, మనస్సు, బుద్ధి అహంకారము, చిత్తము నీవు లేవు. నేను లేను. మరొకరు లేరు. సర్వము కేవలము బ్రహ్మమే, వాక్యము, పదము, వేదము, అక్షరమూ, జలము - ఏమియు లేవు. మధ్యమ, ఆది, అంతము, సత్యము, నిబంధనము, దుఃఖము, సఖము, భావము, మాయ, ప్రకృతి, దేహము, ముఖము, ముక్కు, జిహ్వా, చెవులు, దంతములు, పెదవులు, లలాటము, విశ్వాసము, ఉచ్ఛ్వాసము, స్వేదము, అస్థి, మాంసము, రక్తము, మూత్రము, దూరము-దగ్గర, అంగము, ఉదరము, కిరీటము-ఏవియు లేవు. కాలు-చేతులు కదపుట, శాస్త్రము, శాసనము, వేదనము, వేత్త, వేద్యము, జాగ్రత్ స్వప్న సుషుప్తులు - ఏమియు లేవు. తుర్యాతీతమేమియు లేదు. అంతయు సచ్చిన్మయము, ఆధ్యాత్మికము, అధిభూతము, అదిదైవము, మాయికము - లేవు. విశ్వుడు, తైజనుడు, ప్రాజ్ఞుడు, విరాట్టు, సూత్రాత్మకేశ్వరులు, గమాగమచేష్టలు నష్టము, ప్రయోజనము - లేవు. త్యాజ్యము, గ్రాహ్యము, దూష్యము, మేధ్యము, అమేధ్యము, పీనము,

కృశ్యము, క్లేదము, కాలము, దేశము, భాషణము, భయము, ద్వైతము, వృక్షము, తృణము, పర్వతములు, ధ్యానము, యోగసంసిద్ధి, బ్రహ్మక్షత్రవైశ్యులు, పక్షి, మృగము, అంగి, లోభము మోహము, మదము, మాత్సర్యము, శమము, క్రోధము, స్త్రీ, శూద్రులు, బిడాలము, (పిల్లి) భక్ష్యము, భోజ్యము, ప్రౌఢము, నాస్తిక్యము, వార్తావసరము - ఏమియులేవు. లౌకికాలౌకిక వ్యాపారములు, మూఢత్వము, భోక్త, భోజనము, భోజ్యము, మాత, మానము, మేయము, శత్రుమిత్ర, పుత్రాదులు, తల్లి, తండ్రి, చెల్లెలు, జన్మ, మరణము, వృద్ధి, దేహమే నేనను భ్రాంతి, శూన్యము, అంతఃకరణము, సంసారము, రాత్రి, పగలు, నక్తము, బ్రహ్మము, హరి, శివుడు, వారము, పక్షము, మాసము, సంవత్సరము, చంచలము, బ్రహ్మలోకము, వైకుంఠము, కైలాసము, సువర్లోకము, దేవేంద్రుడు, అగ్ని లోకము, అగ్ని, యముడు, యమలోకము, తక్కిన లోకములు, లోకపాలురు - ఏమియు లేవు. భూలోక, భువర్లోక, స్వర్లోక - త్రిలోకములు, పాతాళము, భూతలము, అవిద్య, విద్య, మాయ, ప్రకృతి, జడము, స్థిరము, క్షణికము, నాశము, గతి, ధావనము, ధ్యాతవ్యము, స్నానము, మంత్రము, జపము - ఏమియు లేవు. పదార్థము, పూజ, అభిషేకము, అర్చనము, పుష్పము, ఫలము, పత్రము, గంధము, పుష్పము. ధూమము, స్తోత్రము, నమస్కారము, ప్రదక్షిణము, ప్రార్థన, హవిస్సు, నివేదనము - ఏమియు లేవు. హోమము, కర్మలు, దుర్వాక్యము, మంచిమాటలు, గాయత్రి, సంధి, మనస్యము, దుస్థితి, దురాశ, దుషాత్మ, చండాలుడు, పుల్కసుడు, దుస్సహము, దురాలాపము, కిరాతుడు, కైతవము, పక్షపాతము, పక్షము, విభూషణము, తస్కరుడు, దంభము, దాంభికుడు, హీనుడు, అధికుడు, ఏకము,





ద్వయము, త్రయము, తుర్యము, మహత్త్వము, అల్పత్వము, పూర్ణత్వము పూర్ణము, పరిచ్ఛిన్నము, కాశి, పుణ్యము, తపస్సు, గోత్రము, కులము, సూత్రము, విభుత్వము, శూన్యత్వము, స్త్రీ, యోషిత్, వృద్ధ, కన్య, వితంతువు, సూతకము, జాతము, అంతర్ముఖము, విభ్రమము, మహావాక్యము, ఐక్యము, అణిమాద్యష్ట సిద్ధులు, చైతన్య మాత్రమగుట వలన సర్వము, సర్వ దోషములు, కలది - లేదు, సర్వము సన్మాత్ర రూపమగుట వలన సచ్చిదానంద మాత్రకమే.

సర్వము బ్రహ్మమే, అన్యమూ లేదు. అదే నేను, అదే నేను, బ్రహ్మమే నేను. నేను బ్రహ్మనే. సంసారిని కాను. నాకు మనస్సు లేదు. నాకు బుద్ధిలేదు. నాకింద్రియము లేదు. దేహమును కాను, గోచరుడను కాను, జీవుడను కాను, భూమిని కాను, జడుడను కాను, నాకు మృతిలేదు, నేను ప్రాణము కాను, నేను పరాత్పరుడను.

ఈ బ్రహ్మ పరబ్రహ్మ, సత్యము బ్రహ్మ, అతడే ప్రభువు, కాలము బ్రహ్మ, కలబ్రహ్మ, సుఖము స్వయంప్రభమైన బ్రహ్మ ఏకము, ద్వయము, మోహము, శమాదికము, దోషము, గుణము, దమము శాంతము, విభువు, ప్రభువు, బ్రహ్మమే. లోకము, గురువు, శిష్యుడు, సదాశివుడు, పూర్వము - పరము, శుద్ధము, శుభము, అశుభము, బ్రహ్మమే, జీవుడే బ్రహ్మ, నేను సచ్చిదానందుడను. సర్వము బ్రహ్మమయము, సర్వజగత్తు బ్రహ్మమయము.

తానే బ్రహ్మ సందేహము లేదు. తనకన్న వేరైనదేదియును లేదు. సర్వము ఆత్మయే, శుద్ధాత్మ, సర్వము చిన్మాత్రము, అద్వయము, నిత్య నిర్మలరూపాత్మ, ఆత్మకన్న వేరుగా మరొకటి లేదు. ప్రకాశించు రూపము కలది. అణుమాత్రమైన దీజగత్తు. శరీరము, అణుమాత్రము. అసత్యము

అచింత్యము, చింత్యము, అణుమాత్రము, సర్వము బ్రహ్మమే, చిన్మాత్రమే. జగత్త్రయము బ్రహ్మమాత్రమే. ఆనందవత్తు. పరమానంద రూపము. వేరుగా ఏమియును లేదు. చైతన్యమంత్రము, ఓంకారము, సకలము స్వయముగా బ్రహ్మము జగత్తంతా నేనే. నేనే పరమపదము. నేనే గుణాతీతుడు, పరాత్పరుడును నేనే పరంబ్రహ్మ, గురువునకు గురువు, నేనే అఖిలాధారుడను, సుఖకన్న సుఖమను. ఆత్మకన్న వేరైన జగత్తు లేదు. ఆత్మకన్న వేరు సుఖము లేదు, ఆత్మకన్న అన్యమైన గతి లేదు, సర్వ జగత్తు ఆత్మమయము. ఎక్కడను ఆత్మకు వేరుగా ఏమియును లేదు, ఆత్మకాక తృణము కూ డ లేదు. ఆత్మకన్నవేరుగా ఊకపాయకూ డా లేదు, ఇది బ్రహ్మ మాత్రమే. బ్రహ్మ మాత్రము కానిదేదియు లేదు. శ్రుతమంతయు బ్రహ్మమాత్రమే. స్వయముగా కేవలము బ్రహ్మమే. వృతము, రసము, సుఖము బ్రహ్మ మాత్రమే. చిదాకాశము, సచ్చిదానందము, అవ్యయము, బ్రహ్మము. బ్రహ్మకన్న వేరైనది జగత్తు లేనే లేదు. బ్రహ్మకన్న వేరైన అహం లేదు, ఫలము లేదు, తృణము లేదు, ఫలము లేదు. బ్రహ్మకన్న వేరైన గురువు లేడు. శరీరము లేదు, అహంత లేదు, త్వత్త, ఇదంత లేవు. స్వయము బ్రహ్మాత్మకముగా తెలియుము, తనకన్న, వేరు ఏమియు లేదు. లోకము చూడబడునది, జనులచే చెప్పబడునది, భుజింపబడునది. అంతయు అసత్తే. కర్మభేధము, క్రియా భేదము, గుణభేదము, రసాదికము, లింగభేదము, అసత్తే. కాలభేదము, దేశభేదము, వస్తుభేదము, జయము, అజయము. ఏయే భేదములున్నవో అవన్నియు అసత్తే, అంతఃకరణము, ఇంద్రియాదికము, ప్రాణాదికము, సముదాయము పంచకోశములు, పంచదేవతలు అసత్తే. షడ్వికారములు, అరీవర్గము, షడృతువులు, షడ్రసములు-అసత్తే. నేను సచ్చిదానందమాత్రుడను. ఈ జగత్తు పుట్టలేదు.





నేనే ఆత్మను. చిదానందుడను, ఇతర సంసారదృష్టులు లేవు. నేను ఆనందరూపుడను, చిద్ఘనానంద విగ్రహుడను, ఈ సర్వము జ్ఞానాకారము. నేను అద్వయుడను, జ్ఞానాందుడను, సర్వ ప్రకాశరూపుడను, సర్వభావ స్వరూపుడను, నేనే ఎల్లప్పుడును ప్రకాశించుచున్నాను. అన్నదెట్లు అసత్తగును? నీవును ఈ రీతిగా పరబ్రహ్మవే. చిన్మయానంద రూపుడవే. చిదాకారము, చిదాకాశము, పరమసుఖము చిత్తే, నేను ఆత్మను. అసత్తును కాను నేను కూటస్థుడను, పరమగురుడను. నేను సచ్చిదానంద మాత్రుడను. ఈ జగత్తు పుట్టలేదు, కాలములేదు, జగత్తు లేదు. మాయా ప్రకృతి లేదు. నేనే హరిని, సదాశివుడను, శుద్ధచైతన్యభావుడను, శుద్ధసత్వానుభావనుడను. నేను అద్వయానందమాత్రుడను చిద్ఘనైకరసుడను, అంతయు కేవలము బ్రహ్మమే, చేతనమంతయు బ్రహ్మమే, నేను సర్వాంతర్యామిరూపుడను. సర్వసాక్షిత్వలక్షణుడను. పరమాత్మ, పరంజ్యోతి, పరంధామ, పరాగతి, సర్వవేదాంత సారము నేనే. సర్వశాస్త్ర నిశ్చయము నేనే. యోగానంద స్వరూపుడను, ఆనందమహోదయమును, సర్వజ్ఞాన ప్రకాశుడను, జ్ఞాన విగ్రహుడను, తుర్యాతుర్య ప్రకాశుడను, తుర్యాతుర్యవర్జితుడను, చిదక్షరుడను, సత్యుడను, వాసుదేవుడను, అజరుడను, అమరుడను. నేను చిదాకాశమును, బ్రహ్మను, నిత్యము, నిరంజనము, శుద్ధము, బుద్ధము, సదాముక్తము, అనాత్మకము, అరూపకమునైన బ్రహ్మను. నేను సచ్చిదానంద రూపుడను. జగత్తు అనుత్పన్నము, సంకల్ప శాంతము, ఏకరూపము, అనామయము, నాకన్న వేరుగా ఏదైన ఉన్నచో ది నిర్జల ప్రదేశములోని ఎండమావివలె మిథ్య.

(తేజోబిందుపనిషత్తు ఆధారంగా)

# 18. జీవన్ముక్తుని లక్షణాలు

జీవన్ముక్తుడంటే జీవించి ఉండగానే ముక్త స్థితిని పొందినవాడు అని అర్థం. అది ఎలా సాధ్యం. తీవ్ర వైరాగ్యంతో, మోక్షం పొందాలనే ఏకైక లక్ష్యంతో సద్గురుని సేవ చేసి ఆయన కృపతో తత్త్వ బోధ పొంది తీవ్ర సాధన ద్వారా తురీయావస్థలో తన స్వస్వరూపానందమును (బ్రహ్మానందమును) పొందిన మహాయోగి కావటంవల్ల తద్వారా పునర్జన్మకు హేతువైన సకల విషయవాసనలను అంటే సంచిత ఆగామి కర్మల సముదాయాన్ని భస్మీపటలము గావించుకొని, తన ప్రారబ్ధ కర్మను శరీరానికి వదిలిపెట్టి సాక్షి రూపంగా చూస్తూ ఉండి జీవితము ప్రారబ్ధం తీరేవరకు అంటే శరీరం పతనం అయ్యేంత వరకు వేచివుండేవాడు జీవన్ముక్తుడు. అతను ప్రారబ్ధవశాత్తు సుఖదుఃఖములు సంభవించుచుండినను హర్ష విషాదములు పొందడు. హర్షము, అమర్షము, భయము, క్రోధము, కామము, కార్పణ్యము ఈ సంకల్పవృత్తులు అతనికి ఉండవు. అహంకార సహిత వాసనను పూర్తిగా త్యజించిన వాడు. దృశ్య జాలమంతయు మిథ్య అని రూఢీ చేసుకొని దానిని సమూలముగా త్యాగము చేసినవాడు. అతనికి అంతర్ముఖ దృష్టిలో ఇష్టా నిష్టములు లేక ఉండును. ఎల్లవేళల అతర్ముఖముగా ఆత్మానందము అనుభవించుచూ ఇతరులకు సుషుప్తిలో ఉన్న వానివలే అగుపడును దృశ్యవిషయములందు కొంచెం కూడా సంగమము పెట్టుకొనక రాగద్వేషములను, ధర్మాధర్మములను, ఫలాఫలములను లక్ష్యము చేయక ఆపేక్షరహితుడై, అహంకార రహితుడై, మానము లేనివాడై, ఉద్వేగ రహితుడై, నిస్సంకల్పుడై, ముక్తమత్సరుడై, ఇచ్ఛారహితుడై, సాక్షి భావంతో కూడినవాడై, సర్వాత్ర విగత స్నేహితుడై, కర్తవ్యకర్మలను నిష్కామంగా, పరహితార్థం, సర్వాత్మభావంతో చేయునో





అతడు జీవన్ముక్తుడు. ఈ సమస్త దృశ్యములను సమ్యక్ దృష్టితో పరిత్యజించిన వాడు. కారము, పులుపు, ఉప్పు, చేదు, రుచి, అరుచి, వీటన్నిటినీ సమభావంతో యాదృచ్ఛికముగా లభించు దానిని శరీర పోషణార్థం భుజించుచుండును. వృద్ధాప్యము, మరణము, ఆపద, రాజ్యము, దరిద్రము, అనువాటిని సమభావంతో ప్రీతిగా అనుభవించును. సర్వేచ్ఛలను సకల సంశయములను, సకల ప్రయత్నములను, సర్వ నిశ్చయములను జ్ఞాన బుద్ధితో పరిత్యజించినవాడు. అతనికి సృష్టి స్థితి లయమునందును ఉదయాస్తమానములయందును. భావాభావముల యందును మనస్సు సమ భావముతో ఉండును. అతడు ఎవరినీ ద్వేషింపక, కాంక్షింపక, రాగద్వేషరహితంగా ఉంటాడు. సంసార సంకులములో శాంతుడై ఉంటాడు. మనస్సు ఉండికూడా అమనస్కుడై ఉంటాడు. నిష్కళుడై ఉంటాడు. సమస్త సంపదలయందుండియూ సమస్త వ్యవహారములయందున్నా స్పృహ లేనివాడై ఉండి పూర్ణ భోగ స్వరూపుడుగా ఉంటాడు. అపదల యందు కృశించిపోడు. సత్ ప్రవర్తనతో ఆత్మానందంలో సంతోషంగా ఉంటాడు. సమత్వ భావంతో ఎల్లవేళల సాధువృత్తి కలవాడై ఉంటాడు. జీవ బ్రహ్మైక్య బోధరూపమైన ప్రజ్ఞయందు సర్వదా నిలచియుండి సర్వత్మా భావనతో కరుణ, ముదిమి సకల జీవులందు ప్రేమలతో ఉంటాడు. నిరంతరముగా చిదాకార మనోవృత్తి గలవాడై సర్వదా బ్రహ్మానందమనుభవిస్తూ దరిదాపుగా ప్రపంచ స్పృహ లేకుండా తనలో తాను నిలబడి ఉంటాడు. తన స్థూల దేహమందు కూడా తాదాప్మ్యాభిమానము లేకుండా దానివలన కలిగే జన్మ జరా వికారములకు, తత్సంబంధీకులైన భార్యా, పుత్ర, బంధుమిత్రుల యందు మమకారం లేకపోవటంవలన ద్వేష హర్ష విషాదాది వికారములు లేకుండా

నిర్వికారుడుగా ఉంటాడు. గతించిన విషయాలను స్మరించడు రాబోవు విషయములగురించి ఆలోచించడు. ఎప్పుడూ వర్తమానంలో ఉంటూ ఏ విషయాలయందు సంగమం పెట్టుకోడు. గుణ దోషములు కల ఈ జగత్తును సమభావంతో చూస్తూ దాని అధిష్టానమగు బ్రహ్మనే వీక్షిస్తూ ఆనందంతోఉంటాడు. అతనికి ఇది ఇష్టము అది అనిష్టము అనే యోచనే ఉండక నిర్వికారుడై ఉంటాడు. నిరంతరము స్వస్వరూప బ్రహ్మానందము అనుబవించుచుండుటచే బాహ్యాంతర జ్ఞానము లేకుండా ఉంటాడు. దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధ్యాహంకారములందు అహంతామమతలు లేకుండా, నేను మనుష్యుడను, బాలుడను, పురుషుడను, వృద్ధుడను, చూచుచున్నాను, వినుచున్నాను, అని తలంపడు, నేను ఈ పని చేసితిని నాకింకనూ ఈ కర్తవ్యయమున్నది అనే భావనలు లేకుండా ఉదాసీనంగా ఉంటాడు. **తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి, అయమాత్మాబ్రహ్మ,** సర్వంఖల్విదం బ్రహ్మ మొదలైన మహావాక్యార్థ విచారణా బలం చేత తాను సాక్షాత్ పరబ్రహ్మగా తెలుసుకున్నవాడును, మూలావిద్యను, నశింపచేసుకొని సర్వ విధ సంసార బంధములను ఛేదించుకుని పూర్తిగా బయటపడినవాడిని జీవన్ముక్తుడని పెద్దలంటారు. సజ్జనులు పదిమంది చేరి తన శరీరమును భక్తితో ఆరాధించి పట్టుచున్నప్పుడు గాని అట్లే దుర్మార్గులు తన శరీరమును చుట్టుముట్టి తిట్టుచూ, కొట్టుచూ, అవమాన పరచినప్పుడుగాని హర్ష విషాద, క్రోధాది వికారములు పొందక సమభావంతో ఉంటూ సాక్షి రూపంగా ఉండేవాడు జీవన్ముక్తుడు. ఇతడు జీవించి ఉండగానే సర్వ బంధములనుండి విముక్తుడై సార్థక నామధేయము **"జీవన్ముక్తుడు"** అనబడును.





నేను జ్ఞాన స్వరూపుడను, సత్వర జస్తమోగుణవర్జితుడను నిఖిల జగముకంటే పరమగు మాయను కూడా అతిక్రమించిన బ్రహ్మ స్వరూపుడను అనే భావనలతో తన స్వస్వరూపమందే స్థితుడై ఉంటాడు. నేను శరీరత్రయ విలక్షణుడను, మాయా సంబంధ రహితంబగు సచ్చిదానంద బ్రహ్మ స్వరూపుడను అను భావము ఎల్లవేళల కలిగి ఉంటాడు. దేహేంద్రియాలు వాస్తవములు కావు "నేను బ్రహ్మమునే" అను దృఢ నిశ్చయముతో ఉండి నిరతిశయ ఆనందములో మునిగి ఉంటాడు. సకల అవస్థలయందు ముమ్మాటికిని బ్రహ్మమే నేనగుచున్నానని జ్ఞానస్వరూపుడనే అగుచున్నానని నిశ్చయం కలవాడు జీవన్ముక్తుడు. నేను చిదాత్మను, నేను పరాత్మను, నిర్గుణుడను, పరాత్పరుడను అని యెవడు ఆత్మమాత్ర బుద్ధితోనుండునో వాడు జీవన్ముక్తుడనబడును. నేను దేహత్రయాతిరిక్తుడను, శుద్ధచైతన్యుడను, నేను బ్రహ్మను అని యెవరికి నిశ్చయమున్నదో వాడు జీవన్ముక్తుడు. నేనానంద ఘనరూపుడను, పరానంద ఘనుడను, ఎవరికి దేహాదికము (పై భ్రాంతి) లేదో, బ్రహ్మమే అను నిశ్చయమున్నదో, ఎవడు పరమానంద పూర్ణుడో వాడు జీవన్ముక్తుడు. ఎవనికి అహంకారము (నేనే చేయుచున్నానను జ్ఞానము) కించిత్తైనా లేదో, చిన్మాత్రముగా నుండునో ఎవని నిశ్చయము చైతన్యమాత్రమో, చిన్మాత్రైక స్వరూపుడో, అన్నిట పూర్ణరూపాత్ముడో, అన్నిట ఆత్మావశిష్టుడో, ఆనందమందే బుద్ధిస్థితి (రతి) కలవాడో, అవ్యక్తుడో, పరిపూర్ణుడో. చిదాత్మకుడో, శుద్ధ చైతన్య రూపాత్ముడో, సర్వ సంగ వివర్జితుడో, నిత్యానందుడో, ప్రసన్నాత్ముడో, అన్యచింతలు లేనివాడో, ఎవడు కొద్దిగానైన అస్తిత్వము లేనివాడో, నాకు చిత్తము లేదు, నాకు బుద్ధిలేదు, అహంకారము లేదు, ఇంద్రియములు లేవు, అను జ్ఞానము కలదో వాడు జీవన్ముక్తుడు.

# 19. విదేహముక్తుడు

పై విధముగా చెప్పబడిన జీవన్ముక్తుడు ప్రారబ్ధాధీనమగు శరీరము నశించినతోడనే ప్రాణవాయువు పైకి కిందకి సంచరించుటను విడచి నిశ్చలంబగునట్లుగా పరలోకగమనాదులు చెందక జీవన్ముక్తి స్థితిని పరిత్యజించి విదేహముక్తుడగుచున్నాడు. విదేహముక్తుడగు పురుషుడు సర్వ సంకల్ప శూన్యుడు. తనకు రెండవదేమియూ లేకపోవటమువలన అత్యంత నిర్భయుండు అగుచున్నాడు. మరియు ఆకాశమందున్న వట్టికుండకు లోపలను ఏమీ ఉండదు. వెలుపలనూ ఏమీ ఉండదు. అట్లే లోపలనూ వెలుపలనూ తన సచ్చిదానంద రూపముకంటే నితరమేమియూ లేనివాడు విదేహముక్తుడు. సముద్రమందున్న పూర్ణ కలశమునకు లోపలను వెలుపలను జలము మాత్రమే ఉంటుంది. అట్లే తానొక్కడే లోపలనూ, వెలుపలనూ, అంతటనూ వ్యాపించి యుండువాడు విదేహముక్తుడు. ఇట్టి విదేహముక్తుని స్థితియే తుర్యాతీత దశ అనబడుతుంది. విదేహముక్తుని పొందిన పురుసుడు వాక్కులకు మనసులకు గోచరించని సచ్చిదానంద పరమాత్మ అగుచున్నాడు. ఈ ఆత్మ వస్తువునే సకల శాస్త్రములందు నిత్యమైనదిగా నిర్ణయించబడుచున్నది. ఇట్టి స్వరూపము చెంది ఉన్నవాడు విదేహముక్తుడనుచున్నారు. "నేను బ్రహ్మమనికాని" "జ్ఞాన స్వరూపుడని కాని" కూడా చింతించక బ్రహ్మ స్వరూపుడే అయి ఉండును. చిత్త వృత్తులను అతిక్రమించి సాక్షి స్వరూపము చిత్త వృత్తుల భాసింప చేయుచున్నవాడై స్వస్వరూప మాత్రము చిత్తవృత్తులు లేనివాడగుచున్నాడు. అన్తఃకరణముతో కూడుకొనిన వాడును, సంసారియు, కర్తయు, భోక్తయు, అల్పజ్ఞుడను అగువాడు జీవాత్మ అనియు మాయాऽవిచ్ఛిన్నుడను-సంసారము లేనివాడును, సర్వజ్ఞుడును అగువాడు





పరమాత్మ అనియు ఈ విధములైన చిన్నలేమియు లేవు కనుకనే సర్వ సంకల్పములును నశించిపోయినచో వాడు విదేహముక్తుడగుచున్నాడు. అకార మకారాత్మకంబగు ఓంకార ప్రణవము ఈశ్వర చైతన్యమవుచున్నది. విదేహముక్తుడు ఈ సగుణ చైతన్యమును కూడా అతిక్రమించి కేవలం నిర్గుణ చైతన్య స్వరూపుడగుచున్నాడు. సకల శబ్దములచేత చెప్పబడు కల్పిత జగత్ప్రప రూపమును అతిక్రమించుచున్నాడు. జాగ్రత్స్వప్న సుషుప్తులు అనే మూడు అవస్థలునూ లేనివాడగుచున్నాడు. పాముచే విడువబడిన కుబుసము పుట్టమీద పడివుండును. దానిని ఎంతమాత్రమూ "పాము" "ఇది నేనని" "నాది" అని అభిమానింపకున్నది. అటులనే సంసార కాలమున దేహేంద్రియాదులందు "నేను" "నాది" అని అభిమానముతో గూడుకొనిన జీవుడు ముక్తి కాలమున "నేను బ్రహ్మనైతిని" అనే బ్రహ్మ జ్ఞానముచే సంసార కారణమగు మూలాऽజ్ఞాన మంతయు నశింపబడగా దేహేంద్రియాభిమానమున పరిత్యజించి శరీర రహితుడై విదేహముక్తుడగు చున్నాడు. అజ్ఞానముయొక్క ఆవరణ శక్తిచే బ్రహ్మ స్వరూపము కనబడకుండా చేయబడకుండా చేయబడగా పిమ్మట విక్షేప శక్తిచే బ్రహ్మమునందు విశ్వుడనియు, తైజసుడనియు, ప్రాజ్ఞుడనియు (వ్యష్టిరూపమున) విరాట్టు-హిరణ్య గర్భుడు-ఈశ్వరుడనియు (సమిష్టి రూపమున) కల్పింపబడుచున్నవి విదేహముక్తియందు శక్తి ద్వయసహితంబయిన అజ్ఞానమంతయు సంపూర్ణముగా లయించుట వలన విశ్వాది పదార్థములన్నీ తిరిగి తమకు అధిష్ఠానబ్రహ్మమునందే విలయము పొందుచున్నవి. ఈ విధముగా బ్రహ్మజ్ఞానముచే కల్పిత ప్రపంచమంతయు బ్రహ్మమునందు లయించిన పిమ్మట విదేహముక్తుని స్వరూపము బ్రహ్మముకంటే వేరేమియూ లేదు. ఇట్టి విదేహముక్తావస్థ

యందు వేద శాస్త్రములుగాని తత్ప్రతిపాదితమగు జీవేశ్వరాది వాక్యములుగాని ఏమియు లేవు. మరియు ఎవరికి నేనిట్టి వాడిననియు చైతన్యమీవిధముగా ఉండుననియు నేను చైతన్య స్వరూపుడనే అనియు ఈ విధమైనటువంటి నిశ్చయము కూడా లేకున్నవో వాడు విదేహముక్తుడు.

ఈ విధముగా నిరన్తరమూ ఆత్మస్వరూప జ్ఞానము కలిగియున్న బ్రహ్మజ్ఞాని ప్రారబ్ధ కర్మము క్షయింపగానే ఏ దేశమందైననూ, ఏకాలము నందైననూ, దేహమును పరిత్యజించినచో ఆదేశమున ఆకాలమునే సర్వావ్యాపకంబగు పరబ్రహ్మ స్వరూపము చెందుచున్నాడు.

**ఓం తత్సత్**